యూసడించుట గోచరమగును. అయిన నేమగును పట్టణమున నవ్వులపాలు కావలసివచ్చును. ఈపద్య రచనమున కౌరవబల వైశిష్ట్యము తన మహావీరత్వమును తాను నిర్వహించవలసిన మహత్తర గోరక్షణ గౌరవము బృహన్నల యల్పత్వము నుత్తరుని ముఖమున తిక్కన చక్కగా ప్రకటింపజేసెను. ఉత్తరునియూరి పురిలో గౌరవమునందుట. అది పోయినచో భరింపలేడు. ఇవి మహావీర లక్షణములే పాపము! బృహన్నల నట్లు తెగడుట విని సైరంధ్రి తీవ్రత బొందినది. వాక్యప్రారంభము తీవ్రముగానున్నను తుదికి మనోనిగ్రహము చేసికొని తనస్థితికి తగిన యట్లు మాటాడినది. "కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట నెత్తివచ్చినన్ దేరు బృహన్నలావశగతిన్ జరియించిన గెల్వవచ్చు" ఇది ఉద్రిక్త హృదయముతో మాటాడినది. తర్వాతి భాగము తమాయించుకొని పూర్వాపరసమర్థనీయముగా పలికెను. ఇందు విచిత్రమైన ధ్వనిగలదు. ద్రౌపది భావమున తేరు బృహన్నల చెప్పుచేతలలో నుండవలయు ననియే గాని, అతని సారథ్యమున నుండవలయు ననియే గాదు. అనగా నుత్తరుని సారథ్యమును, అర్జునుని నాయకత్వమును నుద్దిష్టములు. ఇదియేకదా పర్యవసానము. ఇందు కూడ ఉత్తరునికి తెలియునట్లు అర్థాంతరన్యాసమును "కారణజన్ములై తనువికారము నొందిన పెంపు దప్పునే" అనువాక్యమున బృహన్నలమహత్త్వము కారణ జన్యత్వము లుగ్గడింప బడినవి.

ఉత్తర కడు హృదయంగమముగ నర్తనశాల ప్రవేశించినది. ఆ ప్రవేశవేగమును సౌందర్యమున తళుకు బెళుకులను జూపుటకై "మెరుగు మొగిలు వొచ్చు తెఱగున" నను నుపమానము వాడెను. నాట్యమందిరము జొచ్చి అనుచోట మందిరము శబ్దమును మధ్యలో విరిచి రెండవ పాదమున వాడుట మలుపు తిరిగి లోనప్రవేశించుటను గోచరింపజేయును. ఆమె గమనమంతి వట్టు రేఫప్రాస యతి వాడుట యొకలయానుబద్ధమైన క్రమమున నర్తించి గమించినట్లు చూపుటకై యున్నది.

శిష్యురాలయిన యుత్తర . కోరిక కాదనలేక నియ్యకొనినట్లు బృహన్నల "జగదీశ్వరపుత్రి నాకు సారథ్యము నేర్పు కలదె? నీమాటకు నే మిగులంగా వెఱకు వాదము మీ దిట్లుండెడిన్" అని తిరిగి యాథార్థ్యము నిట్లు వ్యాక్రుచ్చును "భవదీయప్రార్థనచే తివిరి పరము దుష్కరములు దీర్చియయిన నుత్సవ మొనరించెద. సారథ్యవిషం బొకడవగ నేల" వీనియందు తాను యుద్ధమే చేయుదును సారథ్యమేయని యడుగ నిలయని వాస్తవము స్పష్టీకరించును. ఈ ఘట్టమున అర్జునుడు పేడిరూపధరుడై యుండుటచే రెండు పాత్రలకును తగినట్లు ద్వ్యర్థిగా మాట్లాడును. ఈ పల్కులోను చేతలలోను లలితమైన హాస్యముకలదు. తర్వాత ఉత్తరుడు బృహన్నలను సారథిగా కోరునప్పటి మాటలు "కౌరవులతోడ కయ్యంబు కలిగె నాకు; కడగి నేడు రథమునీవు గడుపవలయు" ననునవి కౌరవులతో యుద్ధము చేయుట చాల మహత్తరవిషయమని యుత్తరునకు తెలియును. బృహన్నలను సారథిత్వమునకు వేగిరించునప్పటి శైలిచూడుడు "వేరమ్మ, మైమఱువు తొడితే తెక్కుము తప్పగుంకదిరదు నీకున్; సైరంధ్రి చెప్పె నీదగు వీరమ్మును పెంపుఁగావు వెఱవుము మాకున్" క్రియలోని తొందర తనమును చూపునప్పుడు చిన్న వాక్యమ్ముల రెండుమూడు మాటలలో రచింపవలయును. "మాకున్" అని బహువచనము వాడుట రాచఠీవిని చూపించును. కొండొకవడి కర్జునుడు సంసిద్ధుడై తన త్రాణమును ఎఱుగనివాడు తొడిగినట్లు ఎడపెడగా తొడిగి అచ్చటి యబలాజనమును నవ్వించెనట. అర్జునునంత మహావీరుడు లోన భగ్గనిమండుచున్న కౌరవబల విజిగీషాపూర్వక విధ్వంసనాగ్ని నెలరేగుచున్న దానిని బయల్పడనీక తాత్కాలిక బృహన్నలా వేష సముచిత భంగి హాస్యప్రాయముగా ప్రవర్తించుట చాలహృద్యమును సముచితమునైన పాత్రపోషణావైఖరి. "రయమున సిడమెత్తు...అస్మదీయ విజయము నభినందింప పురముజను లెదురొత్తుగాక" అనినప్పు డర్జునుడు చమత్కారముగా నిట్లను: "నీవేమి పనిచిన అట్ల చేయవలయు. నీవున్న యెడ నుండవలయు. నీవు సన్నదిన దనవలయు, నా శక్తి యెఱిగి పంచి పనిగొని కడిమిమై పగఱ గెల్వుము." ఈ చివరవాక్యమునందతని నిజస్వరూపమును శక్తియుక్తులను తెలిసికొని శత్రువుల జయించిన కీర్తిని పొందవలెనను వాసన యాథార్థ్యము చెప్పెను. అర్జునుడెక్కిన రథమెంత మనోహరముగా నున్నదో చాటుటకు "కాంచన జాలాలంకృత చంచత్ తనులీల మెఱయు జవనాశ్వములన్ పూన్చి రథంబున మణిమయ పంచానన కేతు నెత్తె బంధుర భంగిన్." ఇందలి బిందుపూర్వక చకారప్రాసయు, సమాసరచనావిన్యాసము, హృద్యతను స్ఫురింపజేయుచున్నది. ఇట్లు సన్నద్ధుడైన సారథితో ఉత్తర కురు

వీరుల అంబరములలో బొమ్మపొత్తికలను కోరుట ప్రకృతమునం దుచితమును భావివాస్తవికతకు సన్నిహితమును. ఇది వీరుడై చనుచున్న ఉత్తరకుమారునితో చెప్పవలసినది. అట్లుగాక సారథితో జెప్పుటయు నాతడు "జనపాలకనందనుండు జయలక్ష్మిన్ చేకొనవలె చీరలు తెచ్చుట పనియే అటునూడుడు ఎల్లభంగుల తెత్తుగా" అని చీరలు తెచ్చుటయందలి తనకర్తృత్వము వెల్లడించును. ఇందెల్లయెడల నర్జునుడే కౌరవబలము నెదుర్కొని యోడించుననుట తెల్లముచేయబడినది. బృహన్నల సూతవృత్తి జేయుచుండ ప్రప్రథమముగా కౌరవబలమును దూరమునుండియే జూచెను. అప్పుడది చిత్రవర్ణ సంశోభితమై లలితవనము దివికి నరిగాపువోయెడు తెఱగుదాల్చినది. ఇదమిద్ధమని కౌరవ బలము స్పష్టముగా దృగ్గోచరముకానపుడు, అదియొక మహోద్యానముగా వీరమ్మన్యుడయిన యుత్తరుని కన్నుల కగుపడుట కడు నుచితముగానున్నది. అందలి రంగురంగుల పట్టులను తాను విహరించుట కలవాటుపడిన, అనువయిన వనముగ్లే భావింపగల్గెనుగాని ఒక మహార్ణవముల్లుగా చూడలేదు. ఈ వర్ణనమున తొలుత నాతని మనస్తత్త్వమును, కౌరవబల మెంతదూరమునుండి దర్శనమిచ్చుచున్నదియు మనకు స్పష్టమగును. కౌరవరాజసైన్యము దివికి నరిగాపుపోయెడు తెఱగు దాల్చుట భావిని కౌరవసైన్యమే కాదేకాదశాక్షౌహిణులును భీష్మద్రోణకృపాది మహావీరవరులును, కురుకుమారశతమును దివి కేగి వీరస్వర్గము నలంకరించుట సూచితము. కౌరవరాజసైన్యంబుకనియె (తొలుత) కని మరల, నుత్తరుడు విచ్చుకడిన చూపుల దొట్రుపడును. రెండవసారి మాచునప్పటి కెంతమార్పుకల్గినదో గమనింపుడు. కారణము సైన్యసామీప్యమునందుండుటయే. చూపునకును చూపునకును మధ్యగల భేదము త్రుటికాలమున రథమెంత సామీప్యమునకు గమించినదో యూహించిన నర్జునుని యాతురత, రణోత్సాహము, రథము నడుపు నేర్పు స్పష్టములగును.

రెండవసారి చూచినతర్వాత నుత్తరుడు బృహన్నలతో నిట్లనియె: "భీష్మద్రోణకృపాది ధన్వినికరాభీలంబు...కలితంబు సైన్య మిది—యే జేరంగ శక్తుండనే."

పై సైన్యవర్ణన పద్యశైలి వేరు. ఇది వేరు. అప్పటి భావము వేరు. ఇప్పుడు వేరు. ఇది భయానకము. క్లేశావహము, దురభిగమ్యముకాన నేతతోన్నఘరక శబ్దసమాస రచనయు, ప్రాసకల్పనయు "జాలోద్యత్స్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం బుదగ్రధ్వజార్చిష్మత్త్వాకలితంబు" నందలి సంయుక్తాక్షర సంధి బంధురతా ప్రయోగంబును చేయబడినవి. పద్యబంధ మెట్లు ఎంత క్లిష్టమైయున్నదో జూడుడు. ఆ పద్యబంధ మెట్లు ఎంత క్లిష్టము దుర్గమమునో ఆ సైన్యము నంతియు. ఇదియే రచనా శిల్పము. ఈ రచనా శిల్పమును తెనుగుకవులలో నుత్తము లెల్లరు పాటించి నుతింపబడిరి. పై పద్యము నందలి "యే జేరంగ శక్తుండనే"లో ఏల అనగా క్రింది పద్యమున వివరింపబడినది.

అకృతాస్త్రుడ, బాలుడ (నేను) కౌరవ్యక విద్యాప్రౌఢిమై నిరూఢులీ శకుని జయద్రథ దుర్ముఖ వికర్ణ కర్ణాది యోధవరులు. ఇట్టుల నెరుంగక వచ్చితి ఎట్టొకో మనభంగి? బెట్టిదులు — మనకు మార్కొనునట్టి కొలదికాదు." ఇందలి ద్విరుక్త టకార ప్రాసము ఉత్తరు మనః పరిస్థితిని సరిగా చెప్పగలది. తన బాలను భయమును అసమర్థతను నొక్కి చెప్పుట కనువైన ప్రాసము. "కౌరవసేన జూచి వడకన్ దొడగన్ మది తోన మేను నీవూరకపోవుచున్కి ఇది యొప్పునె "నేను వస్తుంటే నీ వూరికే ఏమిటి అల్లా పోతావు" అను భావమును చక్కగా "ఊరకపోవుచున్కి" అను జాతీయముతో పాత్రను కూడ కన్నులకు కట్టినట్లు రచించెను. "తేరు మరల్పుము" అనగా అప్పుడర్జునుడు "పసులటు బోవగా మరల బాడియె నీకు నరేంద్రనందనా" అనును. ఈ సంబోధనమున ఉత్తరునిచే లోగడ చూపబడిన రాచపుట్టువులని గర్వమును ఉపాలంభించినాడు. "దంతితురంగసద్భటకదంబము జూచి కలంగు టొప్పునే," జూచిన మాత్రముననే భయపడుట తగునా! గుఱ్ఱములు, ఏనుగలు కాల్బలము విస్తారముగా నుండుట జూచి భయపడుటచేత నుత్తరుని భీరుతాగుణము, బేలహృదయము నిందు ప్రకటితములు. తన భీరుత్వము మూర్తిభవింప "పసుల దయ్యమెఱుగ పడతుల సంతోషమేల నాకు. అనికి చాల నేను" అని దీనుడయ్యెను. ఈ వాక్యములు చిన చిన్న పదముల తోడను చినచిన్న వాక్యములతోడను కూడియున్నవి. సూటిగా పల్కినవి. "అనికి చాల నేను" అనునది యింటికిపోవ వేగిరపాటును స్ఫురింప జేయును.

ఆత్రమును తాత్కాలిక కార్యోపసంహారణమును, కార్యాంతరవ్యగ్రతయు, చూపదలచినచో పై రచన చాల యోగ్యము. ఎదుటివారి వాక్యముల త్వరగా ఖండించి పై మాట మాట్లాడక సూటిగా సమాధాన మిచ్చి సంభాషణను త్రుంచివేసి తన కార్యసాధనకు వేగిరించుట యిందు స్పష్టములు. అర్జునుడు ఆమాటయు నీమాటయు చెప్పి యుద్ధరంగమున నుత్తరుని దుముకజేయు నుద్దేశించుట చూచి ఉత్తరుడు వానిమాటల త్రుంచివేసి విసుగుదల చూపుటకై "పసులవమ్ము మెఱుగు పసతుల సంతోష మేల నాకు అనికి చాలనేను." అని ముక్కకు ముక్క తెగవేసి సమాధానమిచ్చి యింటికి పోదము పద అన్నట్లుగ పల్లవిపాడును. ఇది యీ ఘట్టమున నీ పాత్ర కెంతయో తగియున్నది. ఉత్తరుని భీరుమూర్తి కన్నులకు గట్టుటలేదా! దీనికీదృశవాక్య రచనా విన్యాసమును శైలియే కదా సాధనములు కవికి. ఇట్లుపాసన చేసి శబ్దమును వాడుటయే మహాశిల్పము.

అర్జును డింక నేమేమో పల్కుచు ఉత్తరుని సమ్మతింప జేయుటకును ధైర్యమును కల్గించుటకును యత్నించుచు మాటలమధ్య రథము త్రోయుచు కౌరవానీకము సమీపమునకు పోవుచు "నీకు భయమేల? ఏ గ్రమ్మరి రిత్తవోదువె? భయోత్కంపంబు నీకేటికిన్ అని తేరు పోనిచ్చెను. అప్పుడుత్తరుడు ఆననంబు పల్లటిల్ల మానసంబు తల్లడిల్ల "నేమో" యనును. ఈ శబ్దములవలన ఉత్తరుడు రెండు పల్టీలు కొట్టి తలక్రిందులైనట్లు కన్పడును. ఈ సన్నివేశము నందంతటను హాస్యమున్నది ఉత్తరుడు నివ్వచ్చునితో:

"దవ్వుల విరిగిన నవ్వుదురటె! మేలు మేలు నను వాగను, నీ క్రొవ్వరుగదేని తలపకు మెవ్విధి జనితేని ననుచు నెత్తిన భీతిఁ"

"ప్రాణముపోవుస్థితి వచ్చియుండగా ఎవ్వరో నవ్వుదురట. నన్నాపివేయుడుము. నీకు నోడలంత పొగరుపట్టినచో పోయి శాస్త్రి చేయించుకొనుము" అనెను. నన్నాపకు అనవలసియుండ, నన్నాగకు, అనెను, అపుట తాను ఇతరులను చేయుక్రియ. ఇంది ద్వరి యత్నము లవసరము. అగుటలో తానై చేయునది కావున సర్వస్వాతంత్ర్యములు కలవు. అట్లే అర్జును డుత్తరునితో స్వైరవృత్తి వహించె. అర్జును డింకను రథము పోనిచ్చుచుండెను. అప్పుడు లాభము లేదని అదిరిపోయి "శరములు శరాసనము నయ్యరదముపై డిగ్గవిడిచి యతిరభసమునన్" "ధరణికి లంఘించి వెసం బురిదెసకును లజ్జవిడి పోవంబారెన్." డిగ్గవిడిచి యను పదముచే తక్షణమే క్రిందపడవేసి యని యర్థము, లంఘించి అను పదముయొక్క ధ్వని దుముకుటను స్ఫురింపజేయును. అప్పుడర్జునుడు ఉత్తరువెంట నఱిగి ఏరి పట్టుకొనగ నతడు వెలవెల బాఱుచు మూర్తీభవించిన భయానక రసమో యన కడుదీనవదనుడై అర్జునునకు లంచ మిచ్చెద ననియు తనను విడువవలసినదనియు బ్రతిమాలెను. అనేక బహుమానము లిత్తుననియు ననెను. అప్పటికిని విడకున్న కరుణింపు మనెను.

"సైనికు లెల్లచూచి వెఱఁగుపడ వేగమును లావు' అనుపద్యమున ఎవడు సారథియో ఎవరు యుద్ధవీరుడుగ నుండవలయునో స్పష్టముగ లేదు. ఇచ్చట "చిచ్చఱపిడుగొట్టు లట్టివెరి శూరుల మొత్తము నుగ్గచేసెదన్, గోవుల గ్రమ్మరించెదన్" అని స్పష్టముగా తానే చేయునట్లున్నది. తిక్కన యింత నిశితమైన జాగరూకతను సూక్ష్మాతి సూక్ష్మములగు పలుకుబడులను కర్త కర్మ క్రియల ప్రయోగములను పాటించి ఔచితీ పోషణమును పారమునందించెను. ఈ పద్యమున మఱియొక చమత్కారము గలదు. "శూరుల మొత్తము నుగ్గజేసెదన్, పఱపెదసేన, రాజున్నతి బాపెద, గోవుల గ్రమ్మరించెదన్." ఇందు నాల్గువాక్యములు గలవు. అవియు చిన్న చిన్నవి. నాల్గు క్రియలున్నవి. ఇట్టి చిన్న వాక్యములును. హెచ్చుక్రియలును పాత్రల యుత్సాహమును ప్రకటితముజేయును. ఇది రచనా శిల్పమునందలి యొక విశేషము. దీనినే బృహన్నల అర్జునుడని స్పష్టపడిన తర్వాత, కుంతీతనయుడు విరటు కొడుకును కౌగిటజేర్చినప్పుడు, ఉత్తరుడు "మనము కలంకదేర, రిపుమర్దన విక్రమ! ఎక్కుతేరు, నీఘన భుజశక్తి ప్రాపున అఖండిత శౌర్యమహోన్నతుండనై అనిమొనసారథిత్వము మహత్త్వము వైరులు మెచ్చ జూపెదన్, నను పని గొమ్ము, లెమ్ము. కురునాథున దల్పు మరల్పుగోవులన్" ఇందుత్తరుని ధైర్యవీర్యములు పౌరుషము, ఉత్సాహము ప్రకటితమగు సమాసరచనము సారథిత్వము, మహత్త్వము. అనుశబ్దాలంకారములు, "పనిగొమ్ము, లెమ్ము, కురునాథున దల్పు మరల్పు

గోవులన్" అను ఉత్సాహ పూరితమైన శైలిలో ఉత్తరు మనోహరమూర్తియు మనకు కన్నులకు కట్టినట్లు గన్పించును.

"ఆతురరై ఎదిరిచూచు నంబకు చేతఃప్రీతిగజని, ఆయమహాపసూతుణ్, పోనీగదే విశుద్ధచరిత్రా!" అనును. ఈ ఉత్తరుని పాత్రనిర్మాణవైభవము చాల అద్వితీయమైనది. ఈ భాగమునందు రసనైపుణ్యమున్నను అంతటను సన్నని హాస్యము ప్రాధాన్యాంగముగా పోషింపబడినది.

అప్పు డర్జునుడు 'వెలువడుమన్న పోటు కురువీరులతోడ నశక్యమేని, అత్తెఱఁగది యేలనీకు? ఉడుగు, తేజికి సారథిగమ్ము నాకు, చిచ్చఱ పిడుగొట్టులట్టివి శూరుల మొత్తము నుగ్గుసేసెదన్, పఱపెదసేన, రాజు ధృతిబాపెద, గోవుల గ్రమ్మరించెదన్." ఇచ్చటినుండి వీరరసము పరిపుష్టినొందినది. వీరమున కుత్సాహము స్థాయి. ఇంతకు పూర్వ మర్జునుడు అస్పష్టముగా నుత్తరునికి ధైర్య వాక్యములు బలుకుచుండెను. మహోత్సాహమూర్తియై ముందుకు దుముకుచుండెను. ఎంతకును ఉత్తరుడు అతనిని నర్జునునిగా గ్రహింపలేదు. సరికదా! పరమభీరుడై గుండెజారి నిరుత్సాహియై ఇంటి మొగము బట్టుచుండెను. ఇపు డర్జునునికి తన నిజ స్వరూపము జూపవలసిన యవసర మేర్పడినది. పూర్వమువలె హాస్యపు పలుకులు పలుకుటకును వేళాకోళములకును సమయము కాదు. అందుచే నీ ఘట్టము నుండి విషయము తీవ్రత దాల్చినది. ఇచ్చటినుండి యర్జునుడు ప్రధానపాత్ర కావున వీరము ప్రధానము. అందుచే నీ పద్దెమున వాత్సల్యపూర్వకముగా, ఉత్సాహజనకముగా నడిచినది శైలి. ఇంతకుపూర్వ మర్జును డుత్తరుని సంబోధించుట రాజకుమారునిగా మాత్రమే, కాని యిప్పుడు, ఒక మహావీరుడు అభయహస్తముతో నొక భీత హృదయుని ప్రేమార్ద్రముగా పలుకుట "వెఱవకు మన్న దానిలో గలదు. పోటశక్యమేని ఉడుగుము, నాకు తేజికి సారథిగమ్ము" ఇంత స్పష్టముగా తాను యుద్ధము చేయుదునని యింతకు పూర్వము అర్జునుని పలుకులలో వ్యక్తముకాలేదు. చూడుడు." చిత్తవృత్తి యొక్కించుక చిక్కబట్టును. ఇప్పుడు కౌరవ సేన నుగ్గుచేసెద, నని వాడర్జునుడు.

శమీవృక్ష సమీపంబున కరుగునపుడు అర్జునుమూర్తి క్లీబరూపచ్ఛన్నంబును, ప్రస్ఫురణ విశేష భీషణంబునై ద్వైధీ భావంబున కౌరవ సైనికుల మనంబుల గలచినది. అర్జునుడు శమీ వృక్షంబునకై బయలు వెడలి చేరులోపల కొంతకాల వ్యవధి యగును. కదా! ఈ కాలమున గమన వర్ణనము చేయవలయును. లేదని మరియొకవిషయమును దేనినైనను వర్ణింపవలయును. ఈ రెండును నుచితములు కావు. అందుచేత అది యేదియు నక్కఱలేకయే ప్రస్తుత కథాంశమునకును పాఠకమహాశయులకును మనోహరతాపాదకమైన ప్రధానాంశములు వర్ణింపబడినవి. ఇప్పటి వఱకును ఉత్తరార్జునుల విషయమే వర్ణింప బడినది. గోగణముతో లుకుని పోవు బల విషయమేది? ఇప్పటికే చాల నాలస్యమైనది. కావున అర్జునుడు తద్బలమునకు అల్లంతనుండెననియు, నాతడు రథికుడై ఆయుధములకై శమీ వృక్షము పైపునకు బయలుదేరగనే అజ్ఞాతవాసరూపమైన క్లీబత్వము తొలగి, విశ్వద్యుతి మూర్తి ప్రకటితమగు చున్నదనియు సూచితము. అపుడు కౌరవబలమున నుత్పాతములు పుట్టుచున్న వట వాని నవలోకించి పాండవ పక్షపాతియు, శిష్య వాత్సల్య పూరిత హృదయుడును నయిన ద్రోణాచార్యులు సురనదీసూను నవలోకించి "అతిస్నేహః పాపశంకీ" యనునట్లు అర్జునుడు అజ్ఞాతవాస సంవత్సరము ముగియకుండనే బయల్పడునేమోయను భయమున ప్రక్కనున్న దుర్యోధనాదుల కెఱుగకుండ భీష్మునికే తెలియునట్లు ద్వ్యర్థిగా నిట్లనును.

"వెఱవరి గాక వీడు కురువీరులకున్ బొడసూపువాడె, అచ్చెరు వొక్కమాని పేర నిట సేరగ వచ్చుచున్నవాడు, అహంకరణము కొని యొండొకటి గానడు మూర్తి విశేషమాలయున్ సురపతి యట్ల వీని మది చొప్పది యెట్లో యెఱుంగనయ్యెడున్" అనగా నిగూఢ వృత్తిని భీష్ముడు డూడ సమాధానము చెప్పెను, "తలపగ రిపులకు ఇమ్ముగుకొలది గడచి వచ్చితిమి అకుంఠితబాహాబలము నెఱప తరియయ్యెన్" అని ఇందు "రిపులకు ఇమ్ముగుకొలది" యనగా శత్రువులకు సుఖకరమైన ప్రదేశమును అనగా విరాటసైనికులకు బలకరమైన స్థానమును వదలి వచ్చితి మని బాహ్యార్థము. పాండవుల అజ్ఞాతవాసకాలమును గడచి వచ్చితిమని అంతరార్థము. కావు ననుభయత్ర మొక్కవాని పరాక్రమముతో యుద్ధము జేయవలసిన కాలమని భావము. అప్పుడు పాండవులకు శుభకాలము వచ్చినదని ద్రోణుడు ప్రియంబంది ఉత్సాహముతో

పుత్ర నిర్విశేష వాత్సల్యముతో అతఁ డర్జునుని స్పష్టీకరించి "సింగం బాకటితో" నను పద్యమును పల్కెను. సింహశబ్ద వికృతియైన సింగంబును వికృతిమైన బృహన్నలా రూపమున నున్న యర్జునునికి వాడుటెంతయేని సమంజసము. "మాతంగస్ఫూర్జిత యూథ మెంత యున్నను, ఒక్క సింగమునకు చాలదు. ఆకలి గొనియున్న సింగము మాతంగయూథమును చూచి నప్పుడు ఒక్క గంతున మీఁదకు దుముకును. దీనిని స్ఫురింప జేయుటకే "వచ్చెం గుంతీసుతమధ్యముండు సమర స్థేమాభిరామాకృతిన్" యనెను. "వచ్చెంగుం దీసుకుండు" అన్న శబ్దము అర్జునుడు చెంగున దూకి వచ్చుచున్నట్టుల గన్పడును. మాతంగ యూథముపై సింగము చెంగున దూకి వచ్చునప్పుడెట్లు భీషణ సుందరముగా నుండునో, అట్లే కుంతీసుత మధ్యముడు సమర స్థేమాభిరామాకృతితో వచ్చెనట. "కుంతీసుత మధ్యముండ" నుటచే నీతఁడు కాకనిట్టి సింగములవంటి వారింకను గలరని సూచితము.

ఇచ్చట ద్రోణు డర్జునుని పరాక్రమము నగ్గడించుట విని, కర్ణుడు కటకటపడి ధిక్కరించును. రాజనీతి దృక్పథమున నీ కర్ణుని వాక్యములు కడుసమంజసములు. "కౌరవ సేనకెల్ల ఒక్కండవ మేటివి. ఈబలము గర్వము దుంపఁగ ఇట్లు దోశ్ప్రండిముకోహాటించితివి తగువా?" యనియు, అతడు వచ్చెనేని "అస్త్రచ్ఛిలీముఖపాతచలిత హృదయుపగుత్త జేయుదు" నని వీరాలాపము లాడును. దుర్యోధనుడు పాండవులపై కత్తిగట్టుటకు, కౌరవ పాండవుల వైమనస్య ప్రాబల్యమునకు మూలము కర్ణుడే కదా! భీముని దుర్యోధను డెదిరించగలడను ధైర్యము అర్జునుని కర్ణుడు నిర్జింపగలడను విశ్వాసముతో కౌరవ పాండవుల వైరము మహాగ్నియై ప్రజ్వలించెను. అందుచేతనే కర్ణుని తల భారతమనిరి. అట్టి కర్ణుడు అర్జునుని నిర్జింతును అని ద్రోణుని ధిక్కరించి బల్కెను. కర్ణ పరాక్రమముపై ఆధారపడియున్న దుర్యోధనునకు ఇది అమృతసేచనముగానైనది. కాని చివరకు కర్ణుడే కాదు యావత్కౌరవమాతంగయూథము అర్జున శిలీముఖాగ్నికి తృణప్రాయమైనది. బాగుపడదలచినచో దుర్యోధనుని కిది చక్కనిపాఠము. అర్జును డనిన దుర్యోధనునకు తగని భయము. అతనినితప్ప మరియెవ్వరినైన గెల్తునను ధైర్యము కలదు. "పరుడయ్యేనేని మామకశరాసనముక్త దీప్త సాయకపంక్తిన్ బరిమార్చెద." అర్జునుడైన నేమియు చెయ్యలేడు. కావుననే అర్జును డయ్యేనేని అడవికేగి భ్రాతృయుతముగాగ బండ్రెండు వత్సరములు నిలువవలయు మగుడ నను నూహజేసి యుత్తరగోగ్రహణమునకు బూనుకొనెను. దీనినిబట్టే దుర్యోధనునికి పాండవుల నిర్జించుటయందు దృఢమైన విశ్వాసము లేనట్లు ప్రకటితము. ఈ పాత్రయందలి యీ ముఖ్య విషయమును తఱిచూచి కవి బయల్పఱచెను.

అర్జునుడు ఇప్పటికి శమీవృక్షమును సమీపించెను. పై కౌరవవీరసంభాషణము వలన రంగస్థలము పై నిరుపక్షములనుండి కథాగమనమైనది. ఇది నాటకీయ శిల్పము పాఠకమహాశయుల హృదయమందును, కౌరవ మహావీర హృదయమందును గల యొక ముఖ్యమైన సందేహము తీర్చబడినది. దుర్యోధనుని దురాలోచనము స్పష్టమైనది. ఇన్ని ప్రయోజనములు సాధించు నీ సంభాషణమును సూటిగను, క్లుప్తముగను ముఖ్యపాత్రల మూలమున చేయించుట తిక్కన ఔచితీపోషణమునకు ఒక మచ్చుతునక.

ఉత్తర కుమారునకు హృదయమున భీరుత్వము మెండైనను మనమున రాజసమునకు లోటులేదు. అర్జునుడు శమీవృక్షము నెక్కించి గాండీవమును గొని రమ్మని చెప్పగా రాజసపు పల్కుల నిట్లు పలుకును. "పీనుఁగు నంటఁగ నగునే భూనాథతనూజు డనక పుయిలోడక నన్నీ నీచపుపనికి పనుపంగ నీకుందగునే! పాపకర్మముగాదె!" భూనాథతనూజుడనను గర్వము ఈ పల్కులందు మెండుగా గన్పించును. అప్పుడు గడు చమత్కారముగ, వాత్సల్యమును ఉపాలంభనమును ద్యోతకమానట్లు ఈ క్రింది వాక్యములనను. "శవము కాదు మత్స్యజనపాలపుత్ర! ఏనట్టిదైన పనుతునయ్య నిన్ను" అనును. అతనికి దగినట్లు 'నీవు రాజకుమారుడవని నేను గుర్తెఱింగితిని. ఇప్పుడే నీ రాజకుమారలక్షణమ్ము బయల్పడినది' అన్నట్లు మత్స్యజనపాలపుత్ర! యని సంబోధించును. దీనియందు సామాన్య రాజకుమారుడవే గాదు నైరాటివిగూడ నని స్పష్టము చేయును. చెట్టెక్కి ఆయుధములు పాములచందమున నునికిజూ భయమంది 'సారథీ' యని సవ్యసాచిని బిల్చెనట. సవ్యసాచిత్వము అద్వితీయ బిరుదము అర్జునునకు అట్టివానిని సారథీయని పిలుచుటలో నెంత సొగసుగలదో! అచ్చట గాండీవమును గనుగొని "ఇది

యొక చాపము విస్మయ మొదవించు కొండచిలువ యొకొనా దగియున్నది." ఇంతవఱకును సామాన్యమైన మాటలలో వర్ణించెను. "ఖచిత కనకకమలసముదయద్యుతి సముపగూహనోజ్జ్వల" అను సమాసమున వాని దైన్యమహత్వములు సూచితములు.

అతడు పాండవ మధ్యముడనియు తన తండ్రి కొలువున నున్న కంకుభట్టాగులు ధర్మరాజాదు లనియు విశ్వాసపూర్వకముగా తెలిసి యుత్తరుడు క్రొత్త రూపము నందెను. ఆదినుండి యిప్పటి దనుక మనము జూచు ఉత్తరుడు అకృతాస్త్రుడు, బాలుడు, భీరుడు, తేల, తల్లి యొడిలోని పసిబిడ్డ చందమువాడు. కాని బృహన్నల యర్జునుడని తెలిసి, మనము కలంక జేరిన తర్వాత, నుత్తరుని మూర్తి నిజమైన రాజకుమార యోగ్యమైనది. ఇప్పటి యుత్తరుడు నాగరికుడు, ఉచితజ్ఞుడు, ధైర్యశాలి. అర్జును వృత్తాంతము విని ఉత్తరుడు అద్భుతహర్షంబులు ఒదవ మ్రానుడిగ్గ నుఱికి సర్వాంగ సంగతోర్వీతలంబుగ దండప్రణామం బాచరించి చేతులు మొగిచి "బాహుసమగ్రశత్రుమదభంజన శౌర్య! సమస్తలోక చేతోహరమూర్తి! నీ విటుల తోచుట నాకు ప్రసన్న విస్ఫురద్దేహముతోడ, భాగ్యమయదేవత సన్నిధిసేతి కాదె, సమ్మోహముమాసి, చిత్తము ప్రమోదరసత్త్వము పొంది పొంగెడుఁగా" అనును. ఇంతకు పూర్వము బృహన్నల ఎన్ని చెప్పినను, విసిగికొని భయపడి పన్నిచ్చిపాఱిన ఉత్తరు పాత్రయేనా యిది? అప్పటి శైలికిని, యీ పద్య శైలికిని, భేదము గమనింపుడు, ఈ శైలి ప్రమోదరసత్త్వమునకు మూర్తి. హృదయమున నెంత సంతసము లేకున్న మ్రాను డిగ్గనుఱుకుటయు సాష్టాంగ దండప్రణామ మాచరించుటయు, చేతులు మోడ్చి నిల్చి "బాహు సమగ్ర శత్రు మదభంజనశౌర్య!" మొదలుగా గల సమాసములతో సంస్తుతించుటయు జరుగునా? ఇందు మరియొక విశేషము గలదు. అర్జును డిప్పుడు బృహన్నలగాడు. సమస్తలోకచేతోహరమూర్తి. బాహు సమగ్ర శత్రుమదభంజన శౌర్యుడు, ప్రసన్న విస్ఫురద్దేహుడు. బృహన్నలారూపము మారుట యెంత సుందరముగా చిత్రింపబడినదో చూడుడు. భారత భాగ్యమయదేవతయైన యొక మహావీరుని సన్నిధిని, ఒక మహాభక్తుడు అమాయిక హృదయుడు, నిర్మోహుడు చేతులుగట్టి నిలిచి మోదతన్మయుడగుట యిందలి దృశ్యము. ఇదియే విశ్వరూప సందర్శనానంతరము. శ్రీకృష్ణుని యెదుట "నష్టో మోహః స్మృతిర్లబ్ధా, త్వత్ప్రసాదాత్ మయాచ్యుత! స్థితోస్మి గతసందేహః, కరిష్యే వచనం తవ" అన్న అర్జునుని దృశ్యము. ఉత్తరుని నాగరికత చూడుడు "నిన్నెఱుగక ఏనెమే నన్న పలుకు లెల్ల మఱచి" "ఆశ్రితరక్షాసన్నద్ధభావమేర్పడ, నన్నుఁ గృపజూచెదవే, సనాథుడ నవుదుఁగా" అని ప్రార్థించుటలో విదితమగును. ఈ నాగరికతకు సంతుష్టాంతరంగుడై తేరుడిగ్గి కుంతీ తనయుడు విరటుకొడుకును గ్రక్కున కౌగిట జేర్చెను. తన కన్గవ నశ్రువారి కపెలుకొనెను. ఇట్లార్ద్రహృదయుడైన మూర్తి ఉత్తరుడు తొలుత నవ్వు పుట్టించియు నిప్పుడు పుల్కలెసంగ జేయువాడు. ఇంకను ఉత్తరునకు సహజ లక్షణమయిన భీరుత్వము హృదయమునందు పోలేదు. దానిని మెల్లగ తొలగించి ధీరునిజేసి సారథిగా పని గొనవలసిన బాధ్యత అర్జునునియందు గలదు. కావున ముందు మృగజాతులు భ్రమయునట్లు దెసలు నిండునట్లు గుణధ్వని చేసెను. తరువాత దేవదత్తమును పూరించెను.

ఇట్లు ప్రతి శబ్దమును రసపోషకము కావుటయే మహాశిల్పము.

నియతికృత నియమరహితాం
హ్లాదైకమయీం, అనన్యపరతంత్రామ్
నవరసరుచిరాం, నిర్మితి మాదధతీ
భారతీ కవేర్జయతి.

# ఇంద్రాసనాధికారము

శ్రీ కె. యం. మున్షీ

రాక్షసగురువగు శుక్రాచార్యుడు ఇంద్రుని అహంకారమును అణచివేయుటకు, అసురులపై జరుగు అన్యాయములను అరికట్టుటకు ఇంద్రునితో యుద్ధముచేయును. కాని కేవలరాక్షసులు ఇంద్రుని ఓడింపజాలకపోయిరి. వారి ప్రయత్నములు విఫలములైనవి. శుక్రాచార్యుని కుమార్తె దేవయాని యయాతిని పెండ్లాడినది. దీనివలన మానవసేనాసహాయమున అసురబలము అభివృద్ధిచెందినది. శుక్రాచార్యుని ప్రోద్బలమున రాక్షసరాజు వృషపర్వుడు, దేవయాని ప్రోత్సాహముచే నరరాజగు యయాతి ఉభయులును కలిసి ఇంద్రునితో యుద్ధముచేసి జయించిరి. ఆదినుండి శుక్రాచార్యుడు నాశనము చేయుటకు ప్రయత్నించినట్టి ఇంద్రాసనముకొఅకు వీరిరువురు ఇపుడు పెనగులాడ జొచ్చిరి.

## పాత్రలు:

యయాతి వృషపర్వుడు
దేవయాని ఇంద్రుడు
సేనాపతి

## రంగము:

** అమరావతిలోని ఇంద్ర సభాభవనము. రత్నములు చెక్కిన సువర్ణస్తంభముల పంక్తులు కనిపించుచుండును. మధ్యలో ఇంద్రాసనము రిక్తముగా నుండును. సమీపమున వజ్రాయుధము పడియుండును. యుద్ధభూమినుండి యయాతి, వృషపర్వుడు ఆయుధధారులై ప్రసన్నవదనములతో మాటలాడుకొనుచు ప్రవేశింతురు.

వృషపర్వుడు: ఎట్టకేలకు మన మింద్రుని జయించితిమి

యయాతి: (సగర్వముగా) సురలలో ఒక్కడును మన ధాటికి నిలువలేకపోయెను.

వృ: ఎన్ని తరముల తరువాత విజయశ్రీ లభించినది! నేటికి నా పూర్వులపై జరిగిన అన్యాయములకు బదులు తీర్చుకొనగలిగితిని.

య: (గర్వముతో) నేను జయించి తీరుదునని నాకు ముందే తెలియును.

వృ: (సభాభవనమును చూచి ఉలికిపడి) రాజా! ఈ దేవసభను తిలకింపుము!

య: ఆహా! ఎంత సుందరమైనది! (ఇంద్రాసనము వంక చూచి) ఈ ఇంద్రాసనము (ముగ్ధుడై చూచుచు) నా కోర్కెల కేంద్రము!

వృ: (జౌడుగఅచి) మన అధికారమున నున్నది. అటు చూచితిరా! (మెల్లగా) వజ్రము!

య: నా ఖడ్గప్రహారమునకు ముక్కవోయిన వజ్రాయుధమేనా?

అనువాదం: శ్రీ చావలి కోటీశ్వరరావు

వృ: పాతాళమును సహితము కంపింపజేయు వజ్రాయుధము. ఇప్పుడిది మనదైనది.

య: (మీసములు మెలివేయుచు) పాపము ఇంద్రుడు!.., సరే! గురువుగారిని తీసికొని రాబోయిన దేవయాని ఇంకను రాలేదేమి?

వృ: (శ్రద్ధగా వినుచు) బహుశః దేవయానియే వచ్చుచున్నది. చంచలమై, ఉత్సాహపూరితమై స్పష్టమైన యీ సవ్వడి మరొకరిది కాజాలదు.

య: (నవ్వి) నీవు ఆమె కాలిచప్పుడును కూడ గుర్తింప గలవా?

వృ: ఈమెయే మమ్ములను రక్షించినది. ఈమెయే మాకు ప్రేరణశక్తి, మా జీవాధారము.

య: ఇట్టి మాటలతోనే మీరు ఆమెకు గర్వము కలిగించినారు (నవ్వి) ఆమె రానే వచ్చినది.

వృ: దయచేయుడు ! దేవయానీ !

దే: (ఉత్సాహముగా సభాభవనము వంక చూచుచు) ఇదే దేవసభ. ఇక్కడే మాపరాజయ శృంఖలములు సృష్టింపబడుచుండెడివి.

య: ఆ ఇంద్రాసనమును చూచితివా ? దేవయానీ !

దే: (ఏకాగ్రదృష్టితో గర్వముగా, ఇంద్రాసనమువైపు చూచుచు నిలబడును.) ఈ ఇంద్రాసనము... అసంఖ్యాకమైన అపరాధులకు జన్మస్థానము.

వృ: ఆచార్యు డెక్కడ ?

దే: ఇక్కడకు వచ్చుటకు నిరాకరించుచున్నారు.

య: ఎందువలన ?

దే: ఈ స్వర్గభూమికి ఇంకను తాము ప్రవేశింప దగినంత పవిత్రత లభింపలేదనుచున్నారు.

వృ: వారుకాక మనకు భవిష్యన్మార్గదర్శకు లెవరు ?

దే: నా ద్వారా వారొక సందేశ మంపినారు.

య: సందేశమా ?

దే: (నిర్లక్ష్యముగా) అవును. సందేశమే.

వృ: ఏమిటా సందేశము.

దే: "ఇంద్రాసనము ముక్కలు ముక్కలు చేసి వీరులకు పంచుము. వజ్రాయుధమును నాశనము చేసి, స్వర్గ, మర్త్య, పాతాళలోకముల నేకము చేసి, దేవ, దానవ, మానవ సమాజములను స్వతంత్రులనొనర్చి పరస్పరమైత్రిని నెలకొల్పుడు" అని మీతో చెప్పుమని సెలవిచ్చినారు.

య: (కోపమున) ఏమీ ?

వృ: (భయమున) ఏమీ ?

దే: ఆచార్యుని ఆజ్ఞను వింటిరా.?

య: ఇంద్రాసనమును నాశనము చేయుటకు కారణము?

వృ: దేవదానవుల మధ్య మైత్రత్వమా?

దే: (విచారముగ) రాజా! ఇంద్రాసనముపై ఇంత వ్యామోహము కలిగినదా!

య: జీవిత మంతయు ఇంద్రాసనమింద్రాసనమని కలవరించుచు గడపితిని (మాటలు మింగుచు) గురువుగారు వృద్ధాప్యమువలన ధిషణ కోల్పోయినారు.

దే: (విచారమున) మానవరాజా క్షమింపుడు. ఎన్నో యుగముల అనుభవమువలన నిర్మలత్వమును పొందిన శుక్రాచార్యుల దృష్టిలో దోషమును చూడవలదు. ఇప్పుడీ విజయము నీ బాహుబలమున లభించినదని నీకు తోచుచున్నది. వృషపర్వుని అభిప్రాయములు ఇందుకు పూర్తిగ వ్యతిరేకమైనవి.

య: కాని, దేవయానీ! ఇంద్రాసనమును నాశనము చేసినచో మనము కూర్చుండున దెక్కడ?

దే: ఎక్కువ తక్కువల భేదభావములేని భూమి మీద. ఈ ఇంద్రాసనముమీద మనము కూర్చుందుమా? వలదు, రాజా వలదు. ఈ సింహాసనము నుండి క్రూరత్వము, అన్యాయము అను దుర్వాహినులు ప్రవహించుచున్నవి. ఈసింహాసనము నధిష్ఠించిన వారు భవనమును చూపి పేరాసను, భక్తి పేరిట అన్యాయమును, ఆగ్రహమును చూపి భయమును సృష్టించి యుగయుగాలనుండి సర్వ నాశనమును వ్యాప్తి చేసినారు.

య: మేము ఇంద్రునివంటివారము కాము. వాడు దుర్మార్గుడు, మేము కాదుగదా!

దే: రాజా! ఇంద్రుడు చెడ్డవాడుకాడు. ఇంద్రాసనము చెడ్డది. నిరంకుశాధికారమునకు కేంద్రమైన యీ సింహాసనము దుఃఖమునకు మూలము. శుక్రాచార్యుల సంజీవని మంత్రమును అర్థము చేసికొనినవాడు తాను లొంగడు. ఇతరులను లొంగదీయడు. అతనికి దానిని నాశనము చేయుటకే ఇంద్రాసనము మీద ఆశ కలుగును. తండ్రిగారి ఆజ్ఞకు కారణము మీ కితగావున కాలేదా? కేవలము ఇంద్రాసన

యొక్క ఇంద్రుని మాత్రమే భయంకరునిగ చేసినది. ఇప్పుడు దీని ప్రతిక్షణమును పొంది ప్రతి వీరుడు భయంకరుడై ముల్లోకములను భయరహితము చేయగలడు.

యః (కోపగించుకొని) దేవయానీ! నీ తండ్రి ఆజ్ఞ నాకంగీకారము కాదు. నేనీ యింద్రాసనముకొరకే నా జీవితము నంతను వెచ్చించితిని. ఇప్పుడు దీనిని వదలుకొందువా! అసంభవము. కాదు దేవయానీ! ఈ యింద్రాసనము నాది. నేను దీని నధిరోహింతును. రాదలచినచో నీవును రమ్ము (దేవయానిని వెంటతీసుకొనుటకు ప్రయత్నించును.)

దే: (హెచ్చరిక చేయుచు) రాజా! వలదు. ఈ ఇంద్రాసనము భవబంధనలవలె కఠోరమైనది. పట్టి మాయావి. దీనిని నాశనము చేయుటకే శుక్రాచార్యుడు యుద్ధము ప్రారంభించినాడు. నేను దీనిమీద కూర్చుండను. నీవు కూడ దీనిమీద కూర్చుండుటకు ముందు కొంచెము ఆలోచింపుము. దీని భవ్యత నిన్ను గర్వోద్రిక్తుని చేయగలదు. దీని కాంతివలన నీవు అంధుడవగుదువు. దీని మోహము నిన్ను దుర్మార్గుని చేయును. నీవు ఒకమారు దీనిమీద కూర్చుండినచో తరువాత ఎప్పటికిని క్రిందికి దిగుటకు అంగీకరింపవు. శాశ్వతముగా కూర్చుండి ఉండవలెనను లోభమువలన నీలో క్రోధము క్రూరత్వము జనింపగలవు. అప్పుడు నీవు మానవుల శక్తిని, స్వాతంత్ర్యమును నాశనము చేయుటకు సంసిద్ధుడవగుదువు. భయమును వ్యాపింపజేయుటకు అన్యాయము నాచరింతువు! అయినచో తండ్రిగారి ఆజ్ఞను పాలింపవా?

యః చాలు! చాలు! నీ తండ్రి స్వార్థము నెరవేరగనే *మాతో సంబంధము—*

దే: దుర్మార్గుడు, అహంకారి, పిరికిపంద, ధర్మవిరోధి ఒక్కడు మిగిలియున్నను మా తండ్రిగారి ఉద్దేశ్యము నెరవేరదు.

యః ఏమి చెప్పితివి! ఇంద్రాసనమును నేను నా పరాక్రమున జయించితిని. నేను దానిని తప్పక అధిరోహింతును. ముల్లోకములును నన్ను పూజించును. నీవు నాతోపాటు రాకుంటివా శర్మిష్ఠను పిలపించె

దను; కాదు—ఇంద్రాణి వివాహ మింద్రాసనముతో జరిగినది. ఇంద్రునితో గాదు.

దే: అయితే యయాతీ! నీ కర్మఫలము నీవే అనుభవింపుము. భార్గవపుత్రి ఇక్కడ ఒక్క క్షణమైన నుండదు.

వృషపర్వుడు: ఎందువలన?

దే: వృషపర్వా! నీవుకూడ నీ బుద్ధి కోల్పోయితివి. నేడుకూడ పరిస్థితి పూర్వమువలెనే యున్నది. యయాతి ఇంద్రాసనముమీద కూర్చుండి ఇంద్రుడగును. ఇంద్రుడు పాతాళమున దాగియుండి వృషపర్వుడగును. కవియైన శుక్రాచార్యుడు ఇంద్రుని మిత్రుడై యయాతి పరాజయమునకై ప్రయత్నించును.

యః యయాతి పరాజయమా?

దే: అవును. శుక్రాచార్యుడు ఇంద్రాసనమును నాశనము చేయ గోరుచున్నాడు. దానిమీద ఎవడు కూర్చుండినను వారికి శత్రువే. వృషపర్వా! గురుదేవుని ఆజ్ఞోల్లంఘనము చేయుదువా?

వృ: దేవయానీ! సుదీర్ఘ ప్రయత్నము ఫలితముగా లభించిన యీ ఇంద్రాసనమును ఇతర రాక్షసులతో పాటు పంచుకొనుటకు నేనంగీకరింపను.

యః వెళ్ళు దేవయానీ! శుక్రాచార్యునితో ఆయన ఇష్టమువచ్చినట్లు చేయుమని చెప్పుము. నేను నా భుజబలముతో ఇంద్రాసనమును వశపరచుకొంటిని. ఇంతవరకు ఆయన ఏమిచేయుచున్నాడు?

దే: ఇంతవరకు చేయుచున్నపనినే ఇకముందుకూడ చేయును. దుర్మార్గులను, పిరికిపందల సర్వనాశనము చూచును. యయాతీ! వృషపర్వా! మీరు మీ వాంఛితములను నెరవేర్చుకొనుడు. కాని *జ్ఞాపకముంచుకొనుడు. ఇంద్రాసనము మీ మిగిలి* యున్న బుద్ధినికూడ నశింపజేయును. మంచిది. నేను వెళ్ళుచున్నాను. (దేవయాని వెళ్ళిపోవును.)

యః (నవ్వి) వృషపర్వా! రమ్ము. స్త్రీ బుద్ధి......

వృ: (భుజములూపుచు) సరే! నీవు ఇంద్రాసనము తీసుకొందువు. మరి నా సంగతేమి?

యః (గర్వముగా) భయపడవలదు. నిన్ను నేను రక్షించెదను.

వృ: రక్షింతువా! నాకు నా పూర్వీకుల రాజ్యము కావలెను, దేవతలను పాతాళలోకమునకు పంపవలెను.

య: నీవు ఇక్కడ ఉండదలచితివా? ఈ అమరావతిలోనా?

వృ: ఇది మాది. మా పూర్వీకుల జన్మభూమి.

య: భూమి, జయించినవానిది వృషపర్వా!

వృ: (కోపముగా) ఏమంటివి?

య: వినలేదా? ఈ ప్రదేశమును నేను జయించితిని. ఇప్పుడు ఇది నాది.

వృ: అయినచో నేను జయింపలేనా? వేలసంవత్సరములనుండి ఈ కలహమెందులకు?

య: అది నీకు తెలియవలెను. కాని త్రిభువనములను జయించిన యయాతియే త్రిభువనాధీశుడు.

వృ: (ఆగ్రహమున) అట్లయినచో ఒక ఇంద్రుడు పోవగనే మాకు మరొక ఇంద్రుడవతరించె నన్నమాట!

య: (నిర్లక్ష్యముగా ఇంద్రాసనమువైపు చూచి) సరే యట్లేయనుకొనుము.

వృ: (అకస్మాత్తుగా దూకి యయాతిని పట్టుకొని) నేను జీవించియుండగా నిన్ను ఇంద్రుని కానీయను.

[యయాతి సవరించుకొని వృషపర్వునితో తలపడును. ఇద్దరును చాలసేపు ద్వంద్వయుద్ధము చేయుదురు. చివరకు యయాతి వృషపర్వుని చంపును]

య: (పకపక నవ్వుచు) నీవు జీవించి యుండగనే ఇంద్రుడనగుదును. బాగున్నది—దేవయాని విడలిపోయినది. శుక్రాచార్యునికి ఆగ్రహము వచ్చినది. లేనిచో నిన్ను మరల బ్రతికించెడివాడు. ఇంద్రాసనమా!—నా జీవిత లక్ష్యమవు. నేడు నీవు నా దానవు. ఎల్లపుడును నా దానవుగ నుందువు.

[నెమ్మది నెమ్మదిగా ఇంద్రాసనము దగ్గరకు వెళ్ళి గర్వముతో ఠీవిగా దానిమీద కూర్చుండును.]

ఇదే నా స్థానము, నేనే కాదు. శాశ్వతముగా నిది నాదే. (మీసాలు మెలివేసి) ఇంద్రాసనమా! ఇంద్రుని, వృషపర్వుని, జయించిన పరాక్రమశాలివగు నేడు నీవు శోభిల్లుచున్నావు. నిజముగా నీ అదృష్టము ప్రశంసింప దగినది. త్రిలోకాధీశుడనై యున్న నేనిక్కడ కూర్చుండి లోకముల పాలింతును. ప్రజలు భక్తిపూరిత హృదయములతో సదా నా పరిపాలనను కొనియాడుదురు. పాపము శుక్రుడు! చివరకు బుద్ధి కోల్పోక పోయినచో నేడు గురుపీఠము నలంకరించెడి వాడే. కాని ఆయనది అతి తెలివి—సేనాపతీ!

సేనాపతి :—(ప్రవేశించి వణకుచు పాదములకు నమస్కరించును.) దయానిధీ! ఇంద్రాసనాధికారీ!

య: నేడు నేను ఇంద్రునికే ఇంద్రుడను. వృషపర్వుడు కూడ వదలి పోయినాడు. ఇంద్రుని తీసికొనిరమ్ము. వానిసంగతికూడ ఈ రోజె తేల్చివేయుదును.

సేనాపతి : చిత్తము (పోవును).

య: (స్వగతం) ఇది స్వచ్ఛందత! ఇదే సృష్టిని శాసించుట. ఒక్కవ్రేలితో జీవితపథమును నిర్దేశించుట! ప్రాణధారుల భక్త్యర్ఘ్యముల స్వీకరించుట నావంటి అదృష్టవంతునకే ప్రాప్తించును. మనూ! ఇలా! పురూ! పితృలోకమునుండి చూచి ఆనందింపుడు. నేడు తమవంశమును తమపుత్రుడు ఉద్ధరించినాడు. పాపము దేవయాని! ఆమెకు భార్యగా ఉండుట చేతకాలేదు. ఇంద్రాణి కాలేకపోయినది. ఎవరేమి చేయగలరు!

[(సేనాపతి ఇంద్రుని తీసికొని వచ్చును; ఇంద్రుడు తేజోవంతుడు, బలశాలి, శాంతమూర్తి, వానినేత్రములు గర్వమున ఉన్నతముగా నుండును. శిరస్సుపై కిరీటములేదు. చేత ఆయుధములేదు. చెవులకు కుండలములు లేవు. చేతికి అలంకారములేదు. అతని చీనాంబరములు మానవ రక్తముతో సిక్తములై యుండును.]

సేనాపతి : జయము. జయము! త్రిలోకేశ్వరునకు జయము!

య: (కొంచెముసేపు ఇంద్రునివైపు ఠీవిగా చూచిని) స్వర్గము నీచేతినుండి జారిపోయినది. ఇపుడు నీకేమి రావలెనో చెప్పుము. పురుసుతుడు ఎంతటి పరాక్రమవంతుడో అంతటి ఉదారుడు.

ఇంద్రుడు : మానవరాజా! నేను ఓడిపోయితిని. మానవులు తలచినచో దేవతలను కూడ జయింపగలర)

నేడు గ్రహించితిని. గతమును విస్మరించి దేవ, దానవ, మానవసఖ్యమును చేకూర్చుదు.

య: సఖ్యమా! ఇంద్రా! నీ గర్వమునకు హద్దు లేదా! స్నేహమా! నీతోడను, నీ దేవతల తోడను స్నేహమా! మూర్ఖుడా! సేవావృత్తిలో జీవితమును గడుపుకొనుము.

ఇం : (శాంతితో) దేవతలు ఎవరికి సేవచేయరు.

య : అయినచో సేవ చేయుట నేర్చుకోవలసి యుండును. ఏమందువు?

ఇం : తమరేమందురు?

య : (గర్వముగా) వెళ్ళు నీ దేవతలతో గలసి పాతాళ లోకమునకు వెళ్ళి నివసింపుము. వృషపర్వుడుచని పోయినాడు. వానికి బదులు నీవు నాసేవకుడుగా నుండుము. నేను నీకు రక్షకుడ నగుదును.

ఇం : మాకు ఎవరి రక్షణము అవసరము లేదు. మాకు మేముతప్ప ఇతరుల రక్షణ అంగీకరింపము.

య : నీ యీ మాటలలో ఏ సారము లేదు. నీ వాక్చాపల్యముతో నాకు క్రోధము కలిగింపవలదు.

ఇం : మేము పరాజితులము. ఇప్పుడు మీకు ఏ మాటల లోను సారము కనిపించదు.

య : (అశాంతిగా) నేను నిన్ను......

ఇం : నీవు మమ్ము చంపలేవు.

య : క్రోధారుణనేత్రుడై ఈ ఇంద్రాసనము నాది.

ఇం : (దృఢముగా) ఎవరు దీనిమీద కూర్చుందురో వారిది యీ సింహాసనము.

య : (ఉగ్రముగా) మూర్ఖుడా! ఈ వజ్రాయుధము కూడ నాదే.

ఇం : (శాంతముగా) కాదు. నిర్భయముగా ఉన్న వారిదే యీ వజ్రాయుధముకూడ.

య : (కోపముగా) నేను భయపడుచున్నానా? ఇంద్రా! జాగ్రత్త (ఇంద్రాసనమునుండి లేచి వజ్రాయుధముతీసికొని ఇంద్రునిపై పురుగెత్తును.)

ఇం : దుష్టుడా! దుర్బుద్ధిగలమానవుడా! భయములేని వారికి ఇది హాని కలిగింపదు (యయాతి చేతినుండి వజ్రాయుధము లాగికొనును. యయాతి భయపడి వ్యాకులముగా ఇంద్రుని పాదములమీద పడి పోవును.)

ఇం : యయాతీ! ఇది భయములేనివారిదని చెప్పలేదా గర్వాంధుడా! మేము నీచేత, నీ సేనచేత ఓడిపోతి మనుచుంటివా! మూర్ఖుడా! యుద్ధము నభిలషించిన శుక్రాచార్యుని దృఢశక్తి, స్వార్థరహిత సంఘర్షణవలన మేము పరాజితులమైతిమి.

య : దేవేంద్రా! క్షమింపుము. నేను భ్రమపడితిని.

ఇం : నీవంటిజీవి కీస్వర్గమున స్థానము లేదు.
[వజ్రాయుధములో కొట్టును. భయంకరశబ్దములో మెరుపుమెఱయును. ఏమియు కనిపించదు. యయాతి ఆక్రందనముమాత్రము వినిపించును.]

[తెర]

# అప్పయ దీక్షితులు

## శ్రీ కోన వేంకటరాయశర్మ

ఇప్పండితా ఖండలుఁడు శకవర్షము 1425 ప్రమాదీచ నామ సంవత్సర కన్యామాస కృష్ణ ప్రతిపత్తునం దుత్తర ఫల్గునీ నక్షత్రయుక్త శుభలగ్నంబున అనఁగాఁ గ్రీస్తుశకము 1553 సంవత్సరము సెప్టెంబరు నెల పదునెన్మిదవ తేదీనఁ గాంచీపురము దాఁపునఁగల "అడప్ప పాళెము" లో సదాచార సంపత్తి గల కుటుంబమునఁ బ్రభవించి క్రీస్తుశకము 1625 దవ సంవత్సరమునఁ జనిపోయినట్లు లవగత మగుచున్నది.

"ద్వా సప్తతిం ప్రాప్య సమా బుధేన్ద్రో
శ్శతం వృథా దప్పయ దీక్షితేన్ద్రః."–

అను "శివలీలార్ణవ" వచనముం బట్టియు,

"వయాంసి మమ సప్తతే
రుపరి నైవ భోగేస్పృహా
న కించి దహ మర్థయే
శివపదం దిదృక్షే పరం."

అను దీక్షితుల వాక్యముం బట్టియు—నప్పయ్య దీక్షితులు డెబ్బది రెండేఁడులు జీవించినట్లు తెలుగ నగుచున్నది. ఇతని పితామహుఁడు అచ్చన్న దీక్షితులు ఈ యచ్చన్న దీక్షితులు శ్రీ కృష్ణదేవరాయల యాస్థానమున నుండెనని (J. O. R. Madras, Vol, III, P. 158) తెలియుచున్నది. ఇయ్యచ్చన్న దీక్షితులనే యాచార్య దీక్షితులని యందురని యప్పయ్య దీక్షితుల—

"ఆసేతు బంధ తట మాచ తుషార శైలా
దాచార్య దీక్షిత ఇతి ప్రథితాభిధానమ్,
అద్వైత చిత్సుఖ మహాంబుధి మగ్న భావ
మస్మత్పితామహ మశేష గురుం ప్రపద్యే!"

అను శ్లోకము విదితమొనర్చు చున్నది. అప్పయ్య దీక్షితుల తండ్రి రంగరాజాధ్వరి. ఈ రంగరాజాధ్వరి వివరణ దర్పణము, అద్వైతవిద్యా ముకురము—అను గ్రంథముల రచించిన మేధావి. "అద్వైత విద్యాచార్య" బిరుదాభిరాముడు. కావుననే యప్పయ దీక్షితులు—

"యం బ్రహ్మ నిశ్చిత ధియః ప్రవదన్తి సాక్షా
త్తద్దర్శనా దఖిల దర్శన పారభాజః,
తం సర్వ వేద సమశేష బుధాధిరాజం
శ్రీ రంగరాజమఖినం పితరం నతోఽస్మి!"

అని యీ రంగరాజాధ్వరిని వినుతింపగలిగినాడు.

| | | | |
|---|---|---|---|
| చ | | శ రా | శు |
| | రాశి | | |
| గు | | | |
| | కే | కు | ల ర బు |

అప్పయ దీక్షితుల జాతకచక్రము.

ఈ చక్రమును బరికించినచో నారూఢ పంచమమున గురుఁడుండుట వలన ఈ జాతకుఁడు సర్వజ్ఞుఁడు, గ్రాంథికుఁడు, వ్యాకరణ వేదాంతముల నిష్ణాతుఁడు, వాజ్మి—యగునని "జాతకరాజ" మందలి :

"గురుణా త్రిత సంబంధే
సర్వజ్ఞో గ్రాంథికో భవేత్
వైయాకరణ వేదాంతి
వేత్తా వాచాలకో భవేత్
గురుణా త్రిత సంబంధే
సంప్రదాయేన వేదవిత్
శాస్త్రవి ద్గ్రంథ కర్తృత్వ
ముఖ సద్గుణవాన్ భవేత్."

అను వాక్య మవగత మొనర్చుచున్నది. ఇమ్మహాత్ముని జాతక చక్రమున గురుఁడు పరిపూర్ణ శుభుఁడు. ఆరూఢమున సూర్యుఁడుండుటవలన వేదాంతశాస్త్రముతో పాటు సంగీత శాస్త్రమును అభ్యసింపఁగలఁడనియు, నందు నిష్ణాతుఁడగుననియుఁ,—తెలియనగుచున్నది. తత్ఫలితముగ "శివార్కమణి దీపిక"ను రచించి "శివాద్వైతస్థాపనాచార్యుఁ" డయ్యెను. ఆరూఢ పంచమమునఁ గుజుఁడు అష్టమదృష్టితోఁ జూచుటవలన "ఖండదేవుని"వంటి మీమాంసా శాస్త్రజ్ఞుఁడు అప్పయ్య దీక్షితుని "మీమాంసక మూర్ధన్య" యని కీర్తించి వినుతించెను. దశమాధిపతికి స్వక్షేత్రమున నుచ్చస్థితి యొదవినందున అప్పయ్య దీక్షితులు

మహారాజసముం డయ్యెను. కావుననే యాత్తరాహుఁ డొకఁడు.

"నానాదేశ నరేంద్రమండల మహా
యత్నాతి దూరీభవ
త్పాదాచిత్ర పదారవింద వినతే
రప్పయ్య యజ్వ ప్రభోః
శైవోత్కర్ష పరిష్కృతై రహరహ
స్సూక్తై స్సుధాలాలితైః
పులకోత్కర్ణపుటస్య బొమ్మ నృపతేః
పుణ్యాని గణ్యానికిం."

అని యప్పయ్య దీక్షితులను వినుతించుటఁ దటస్థించినది. జగన్మాన్యతను బడసి యపర శివావతారమ్మని యీతఁ డుగ్గడింపఁబడుటను విలోకింపఁగా నీతని శిష్టాచార తత్పరత విదితము కాఁగలదు.

"కువలయానందము"లోని:

"అముం కువలయానన్ద
మకరో దప్ప దీక్షితః.

"శ్రీ రంగరాజ కుచివశ్రిత చంద్రమౌళి
రస్త్యప్ప దీక్షిత ఇతి ప్రథిత స్తనూజః."

అను వాక్యములఁబట్టి యప్పయ దీక్షితులను 'అప్ప దీక్షిత' అనియుఁ బిలుచుచుండురని యవగత మగుచున్నది. కాని నీలకంఠకవి.

"శ్రీ మా నప్పయ దీక్షితో విజయతే
శ్రీ కంఠ విద్యాగురుః."

అని యనేకతావుల నప్పయ దీక్షితుఁ డనియే వ్యవహరించి యున్నాఁడు. జగత్ప్రసిద్ధులగు నహోబల శాస్త్రులవారి "ఈశానస్తుతి" యందలి.

"వైకుంఠే కుంఠ కోలాహల మయ కలహో
ల్లుంఠనే ఽకుంఠ (శక్తి) శ్రీ కంఠాచార్య కం
ఠోదిత నయసరణి వ్యాకృతౌ కుంఠితోఽన."

"ఇత్యేవం శిక్షితో ఽప్యద్వయ నయభి
ద్దీక్షణామూర్తి రూపై ర్దక్షో ఽభూ
ద్దీక్షితో ఽసౌ పరిమళకృతి త
చ్ఛంకరాచార్య పక్షే...—"

అనుశ్లోకముల ననుసరించియు, భట్టోజీరామేశకృత మగు తద్వ్యాఖ్యానముం బట్టియు, నితఁడు మహాదేవునే విద్యాధికునిగా విశ్వసించినట్లు శ్రీ కంఠభాష్యమున విశ్వాసము గలిగి తన్మత ప్రతిష్ఠాపకములగు పెక్కు నిబంధముల రచించియుఁ బదంపడి శ్రీ నృసింహాశ్రమ స్వామిచే బోధింపఁబడి శాంకర మతమునఁ బ్రవేశించి పరిమళాది గ్రంథముల విరచించినట్లును ఎఱుంగ వచ్చుచున్నది. నీలకంఠ మహాకవి తన "నలచరిత్ర" ప్రస్తావనయందు—

"తస్య కిల కృష్ణరాజవందిత చరణార
విందస్య భరద్వాజకుల చూడామణే
రష్టాభిః క్రతుభి రష్టభి రాయతనై
శ్శంభో రష్టాభిశ్చ సర్వవిద్యా విశారదై
స్తనయై రష్టాపిదిశో యశోభి ర్ధవలితాపి"

అని యప్పయ్య దీక్షితునిఁ బ్రస్తుతించియున్నాఁడు. ఇతని నుద్దేశించియే బాలకవి:

"అప్పదీక్షిత కిమి త్యతిస్తుతిం
వర్ణయామి భవతో వదాన్యతాం,
సోఽపి కల్పతరు రర్థలిప్సయా
త్వద్గిరా మపసరం ప్రతీక్షతే."

అని పేర్కొనియెను. ఇయ్యప్ప దీక్షితుఁడు శ్రీ కంఠభాష్య వ్యాఖ్యానమైన "శివార్కమణి దీపిక"ను రచించినపుడు కనకాభిషేకముం బడసెనని సాహిత్యమార్గ సంప్రదాయ గురుసత్తముండయిన "పరమపుంగవయజ్వ" రచించిన:

"హేమాభిషేక సమయే పరితో నిషణ్ణ
సౌవర్ణ సంహతి మిషా చ్చినబొమ్మ భూపః,
అప్పయ్య దీక్షిత మ...రనవద్య విద్యా
కల్పద్రుమస్య కురుతే కనకాలవాలమ్."

అను వచనముం బట్టి విదితమగుచున్నది.

ఇమ్మహాభాగుఁడు శ్రీ కంఠాచార్యకృత బ్రహ్మసూత్రభాష్యమునకు "శివార్కమణి దీపిక" యను పేరితో నొక వ్యాఖ్యానమును, శాంకర బ్రహ్మసూత్ర భాష్యవ్యాఖ్యానమగు "భామతి"కి వ్యాఖ్యయైన "కల్పతరువు" అను గ్రంథమునకు "పరిమళ" మను వ్యాఖ్యానమును,— విలిఖియించుటయ గాక అన్ని శాస్త్రములలోను గ్రంథములఁ బెక్కింటిని రచియించిరి.

సాహిత్యమునఁ గువలయానందము, చిత్ర మీమాంస, వృత్తివార్తికము,—లోనగు వానిని, పూర్వ మీమాంసయందు విధిరసాయనము, ఉపక్రమ పరాక్రమము,—మున్నగువానిని, శుద్ధాద్వైతమున న్యాయరక్షామణి, శాస్త్ర సిద్ధాంతలేశ సంగ్రహము, పరిమళము,—లోనగువానిని, శ్రీకంఠ మతమున శివతత్త్వ

వివేకము, రత్నత్రయ పరీక్ష, శివకర్ణామృతము, బ్రహ్మతర్క స్తవము, శివార్కమణిదీపిక,—మొదలగువానిని, వ్యాకరణమున నక్షత్ర వాదావళి మున్నగువానిని,—ముప్పది మూఁటిని ఇట్లు నూటనాల్గు ప్రబంధముల నిబంధించెను. అట్లని "శివలీలార్ణవము"నం గల "వ్యాసప్రతిం ప్రాప్య సమా బుధేంద్రా, శ్రుతం వ్యధాదప్పయ దీక్షితేంద్రః"—అను వచనము స్ఫురింపఁజేయుచున్నది.

దక్షిణదేశమున స్వతంత్ర రాజ్యముల నేర్పఱచికొనిన నాయకరాజులు తెలుఁగు వారౌటవలనఁ దమ స్వతంత్ర రాజ్యములలో నుండి వ్యవహరించుటకుఁ దెలుఁగు దేశమునుండి పండితులఁ, గవుల, గాయకుల, నర్తకుల, మంత్రులఁ, జమూపతులఁ - గొంపోయిరి. అటులఁ గొంపోఁబడిన తెలుఁగు కుటుంబములలో అచ్చన్న దీక్షిత కుటుంబ మొకటి.

తిరుమల తాతాచార్యులు వేంకటపతి రాయల కాలములో ననఁగాఁ క్రీస్తు శకము 1585 వ సంవత్సరము నుండి క్రీ. శ. 1614 వ సంవత్సరమువఱకు నతని యాస్థానమున నుండెననియు, నయ్యాస్థానమందె యున్న యప్పయ్య దీక్షితులు తాతాచార్యుల ప్రతిపక్షి యనియు,- నందఱెఱింగిన విషయమే! అప్పయ దీక్షితుల మేనయల్లుఁడయిన యయ్యల దీక్షితులు క్రీ. శ. 1623 వ సంవత్సరము మొదలుకొని క్రీ. శ. 1659 దవ సంవత్సరముదాఁకఁ బాండ్యదేశము నేలిన తిరుమల నాయకుని మంత్రి యౌటచే నప్పయ్య దీక్షితులును తాతాచార్యులును వేంకటపతిరాయల కాలములోని వారనుట నిర్వివాదాంశము.

రాయల యాస్థానమునందు అప్పయ్య దీక్షితుఁడుండు నప్పుడు, తాతాచార్యులకును నీతనికిని శైవ వైష్ణవ మత సంబంధములగు వివాద ములుత్పన్నమై య వ్వివాదములలో, సిద్ధాంత రాద్ధాంతములలో, చర్చలలో, నితనిదే పైచేయియై విజయలక్ష్మీ కరగ్రహణము బొనర్చుచు నందఱిచే వినుతింపఁబడుచుండెడి వాఁడౌటచేఁ దాతాచార్యులు సహింపఁజాలక నీని విధమున నేనిఁ దమ వైష్ణవమతమునం గలపి కొనినం గాని ప్రయోజనము లేదనియుఁ, దమ సిద్ధాంతము వ్యాప్తము కాఁజాలదనియుఁ, దమ మతము విస్తరింపదనియుఁ,—దలఁచి యేకతము నున్న రాయలను సమీపించి చేయఁదగు కార్యము నంతయు విన్నవించి శాస్త్రోక్తమ్ముగ కొనర్పఁగా, రాయలును గురు నిర్బంధంబునం జేసి యప్పయ్య దీక్షితులను సమాశ్రయణముఁ జేసికొనవలసినదని యభ్యర్థించి, బ్రతిమాలి, వేఁడికొని, తుదకు నిరోధించి, భయపెట్టినను దీక్షితుల వారప్పని కొడంబడఁరయ్యెనట.

తాతాచార్యులు సేయునది లేక రాయలతో నాతని శాసింపవలసినదని చెప్పఁగా, రాయలు దీక్షితుల రావించి "మహాభాగా! సమాశ్రయణ మొనర్చుకొనుట కిష్టపడనివారు మా రాజ్యమున నివసించుటకే వీలులేదు. కావునఁ దాము బాగోగుల యోజించి యుచితమని తేల్చికొనుఁడు. కొన్ని ముహూర్తములు గడువొసంగితిని. ఆలో, సమాశ్రయణమునకే యంగీకరించిన సరియే! లేకుండిన మా రాజ్యమును విడిచిపోవలసి యుండును."—అని చెప్పఁగా దీక్షితులు "నృపతీ! దమ రాజ్యమును విడిచి పుచ్చుటకే నిశ్చయించితిని"—అని రాయల శాసనమునకు సుతిరియై యా రాజ్యము న్విడిచివచ్చుచుండెఁగాఁ, దాతాచార్యుల యొత్తిడి ననుసరించి రాయలు మార్గమధ్యమున దీక్షితుల బలాత్కరించి తప్తముద్రాంకనము సేయుఁడని భృత్యుల కాజ్ఞాపించెనఁట!

అయ్యెదనున నిప్పండితాఖండలుఁడు నిస్సహాయుండై చేయునది లేక పరమశివునే మార్గయునిగాఁ బ్రార్థింప నమ్మహాదేవుని కరుణాకటాక్ష వీక్షణంబునఁ దాతాచార్యులును దత్తాపి రాయలును దలపెట్టిన పని వమ్మయినట్టులా సందర్భమున దీక్షితులవారు చెప్పిన "నిగ్రహాష్టకము"నుబట్టి స్పష్టమగుచున్నది.

ఈ నిగ్రహాష్టకములోని "సహస్ర వర్తాన్తాం"—"క్వచిదవయవే దగ్ధం"-అను శ్లోకములవలన అప్పయ్య దీక్షితులయెడల నితరు లొనరించిన యొగ్గును దలపెట్టిన దురుద్యమము తెల్లమగుచున్నవి.

ఇయ్యైతిహ్యముంబట్టి వీరి యింట నిప్పటికిని బరమేశ్వరుఁడు "మార్గ సహాయుం"డను పేరితో నిలువేల్పుగా నారాధింపఁబడుచున్నాఁడు.

పూర్వోత్తర మీమాంసా శాస్త్రములలో భారతావనియందలి పండిత మండలి నెల్ల నప్పయ దీక్షితులు జయించి, విశ్వజిద్యాగ మొనర్చియుండెను. అవసానకాలమున నిప్పండితాఖండలుఁడు చిదంబర క్షేత్రమున నటరాజును వినుతించుచు నచటనే సిద్ధి నందెను.

# ఆర్యుల నివాసభూమి

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రాచీన భారతదేశచరిత్రను వ్రాయదలచేవారు దానికితగిన ఆధారాలనన్నింటిని పరిశీలించవలసి ఉంటుంది. వీటిలో కొన్నిమాత్రమే సరియైనవని, మిగిలినవి అప్రామాణికాలనీ త్రోసివేయటం యుక్తముకాదు. కాని మనచరిత్రకారులు బౌద్ధ జైన గ్రంథాలపైచూపిన ఆదరమును మన పురాణేతిహాసాదులపైన చూపకపోవటం శోచనీయము. ప్రస్తుతము ఆర్యుల ఉనికినిగురించి విచారించుదాము.

ఆర్యులు ఎక్కడనుండో బయలుదేరి మనదేశానికి వచ్చినారని చరిత్రకారులనేకులు చెప్పినారు. కానిమన సంప్రదాయంలో గాని, మనగ్రంథాలలో గాని ఎక్కడా వీరు విదేశములనుంచి భారతభూమికి వచ్చినట్లు చెప్పియుండలేదు. స్వభూమిని వదలివచ్చినవారు ఈ మహత్తరవిషయాన్ని కప్పిపుచ్చగలరా? దేశాలను వ్యాపించిన అరబ్బులు, యూదులు ఇంతవరకు వారి పూర్వ్వ లేదో దేశాన్ని వదలివచ్చినట్లే చెప్పుకొనట మున్నది గదా! అమెరికాకు వలసపోయిన పాశ్చాత్యులు నేటికిగూడా ఆవిషయాన్ని మరువలేదే! బౌద్ధ,జైనాది గ్రంథాలలోసహిత మీవిషయము కన్పించదు.

కలియుగారంభము క్రీ. పూ. 3102 వ సంవత్సర మగుటచే వైదికవాఙ్మయసంకలన మింతకుమున్నే జరిగి ఉండాలని భారతసంప్రదాయము. దీనికిఅనుగుణముగా అయనాంశలు కృత్తికలలోనున్నట్లు చెప్పు శతపథ బ్రాహ్మణకాలము కలియుగాదికి వచ్చుచున్నదని ప్రముఖభారతీయ జ్యోతిర్వేత్తలు పలికినారు. కాబట్టి అతిప్రాచీనసంహితలు కనీసము క్రీ. పూ 4000 కాలము నాటికైనా నేటిరూపమున ఉండితీరవలెను. కాని పాశ్చాత్య క్రైస్తవచరిత్రకారులు ఇంతవెనుకకు వెళ్ళటానికి సాహసించరు. వారి మతగ్రంథంలో చెప్పిన సృష్టికాలము క్రీ. పూ 4000 కాలానికి దగ్గరకావటంచేత ఇతర దేశచరిత్రలను ఈ తేదీకి తర్వాతనే పడవేయటము వారికి ఆచారమైనది. ఈసంగతి గమనించని భారతీయచరిత్రకారులు వారిధోరణికి పల్లవి నాలాపించినారు.

వైదికవాఙ్మయకాలమును గురించి గాని, ఆర్యుల ఉనికిని గురించిగాని విచారించే ముందు మనం కొన్ని విషయాలను గమనించాలి. సంహితలలో వచ్చే గాథలకు చాలవరకు సమగ్ర రూపము మన మహాభారతంలో ఉన్నదని గల్డ్నర్ అను జర్మన్ విద్వాంసుడు, ఆయన శిష్యుడు సీగ్ నిర్ధారణ చేసినారు. ఇది మొదటి విషయము. రెండవది; భారతీయులు అనాదిగా చేస్తున్న నామకరణ ప్రక్రియ. తాత ముత్తాతల పేర్లు మనుమళ్ళకు పెట్టటం మన కాచారమైపోయింది. దీనిని గమనించకపోతే ప్రాచీనుల కాలనిర్ణయంలో మనము తప్పటడుగులు వేయటం కద్దు.

---

* ఆర్యుల ఆదిమనివాసమునకు సంబంధించిన మీమాంస భారతదేశ చరిత్రయొక్క ప్రాతిపదికనేగాక ప్రపంచ చరిత్రయొక్క ప్రాతిపదికనే మార్చునదిగా వున్నది. గత ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలో (1957) శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు ఈ విషయము కొంత చర్చించియున్నారు. ఇంకా అనేకవిశేషాంశములను శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఇందు వివరించినారు. చరిత్రకారులు ఈ విషయమై తగు నిర్ణయం చేయగలరని ఆశించుచున్నాము. —సం. పా.

ఋగ్వేదంలో సుదాస దాశరాజ్ఞయుద్ధము చెప్పబడింది. నహుషుని పుత్రుడు యయాతి, మనుమడు పురు. ఈ పురువంశీయులు తృత్సుని శత్రువులు. తృత్సులకు చెందినవాడు సుదాసుడు. ఈయన పూర్వులలో ముద్గల, వధ్ర్యశ్వ, దివోదాస, శృంజయ, చ్యవనులు కన్పిస్తారు. కవషఐలూష, పురుసంవరణ, యాదవ, శివ లేక అణవ, ద్రుహ్యు, మత్స్య, తుర్వశ ప్రభృతులయిన పదిమందిరాజులతో యుద్ధము పరుష్ణీ సమీపమున జరిగినది. ఇచట పారిపోయిన రాజు పురువనబడిన పురుకుత్సుడు. పౌరాణిక మత్స్యులు సుదాసుని తర్వాత తొమ్మిది తరములకు కనిపించేవారు. కవషఐలూషుని కుమారుడగు తురకావషేయుడీ యుద్ధంలో ఒక నదిలో మునిగిపోయినాడు. ఈయన సంతతికి చెందిన మరొక తురకావషేయుడే జనమేజయుని పురోహితుడు కావటంచేత దాశరాజ యుద్ధం క్రీ పూ. 3102 కి ముందే జరిగి ఉండాలి.

ఇంతేకాక పౌరాణిక వంశ వృక్షాలలో ప్రధాన రాజ నామములే ఇవ్వబడినవని మరువరాదు. మను సంతానములో ఇక్ష్వాకు, నాభాగ, ధృష్ట, శర్యాతి, నరిష్యంత, ప్రాంశు, నాభానేదిష్ఠ, కారుష, పృషధ్ర ఇల, సద్యుమ్నులున్నారు. ఇళ పుత్రుడు పురూరవసుడు. ఈయన కుమారుడు ఆయువు, మనుమడు నహుషుడు. నహుషుని పుత్రుడు యయాతికి జన్మించిన ఐదుగురు దాశరాజయుద్ధంలో కనిపిస్తారు. సుదాసునకంటె పూర్వము కనీసము ఏడుతరాలు పేర్కొనబడినవి చెప్పవచ్చును. ఈ రీతిగా విచారిస్తే ఋగ్వేదంలో కనీసం ఇరవై ఐదు తరాలకు చెందిన ఋషులు కనిపిస్తారు. వీరికి సుమారు వేయి సంవత్సరాల కాలము చెప్పితే ఋగ్వేద సంహితా కాలము క్రీ. పూ. 4000 కు ముందే ఔతుంది.

మనుసంతతిలోని యాదవ వంశమునకు చెందిన వారిలో 93వ రాజు కంసుడు. ఒక్కొక్క తరానికి పౌరాణిక గణనలో వలభై సంవత్సరా లున్నవి. దాశరాజ యుద్ధంలో యదువుకూడ ఉన్నచో ఈ యుద్ధము కృష్ణ కంసులకంటె 8400 సంవత్సరాల పూర్వమే జరిగి తీరాలి. ఇది క్రీ. పూ. 6550 కి రాగలదు. అణవ వంశంలో 94 వ తరానికి పాండవులు, కర్ణుడు వస్తారు. మనువునుంచి 44 వ వాడైన భరతుడు సుదాసుని తర్వాత 1440 ఏండ్లకు, అనగా క్రీ. పూ. 5110 కి ఉండాలి. కాబట్టి ఉత్తర పాంచాలులలో 68 వ వాడుగా కనబడే సుదాసుడు దాశరాజ్ఞ యుద్ధంలోని వాడు కాడని నొక్కి చెప్పవచ్చును. ఈ లెక్కలను బట్టి మనువుకాలము క్రీ. పూ. 7000 కి వెళ్తుంది.

పరీక్షిత్తు క్రీ. పూ. 3076 లో రాజ్యానికి వచ్చినాడు. ఈయన మనుమడు అభిప్రతారివద్దగల ధృతి అనే పురోహితుడు కన్పించే పంచవింశతి బ్రాహ్మణము క్రీ. పూ. 3000 నాటిది కావలె. మరొక మనుమడు శతానీకుడు విదేహ రాకుమారిని పెండ్లాడినాడు. కాబట్టి బుద్ధుడు పుట్టిన రోజుననే జన్మించిన ఉదయనుడు వేరొక శతానీకుని పుత్రుడు కావాలి. మొదటి శతానీకుని మనుమడైన అధిసీమ కృష్ణుని కాలంలో (క్రీ. పూ. 2920) మొట్టమొదటి సారిగా పురాణములు నైమిశారణ్యమున చెప్పబడినవి. ఈయన సంతతికి చెందిన నిచక్షుని కాలమున పంటలు పాడైపోయినవని చెప్పు ఛాందోగ్యోపనిషత్తు క్రీ. పూ. 2850 నాటిదని గట్టిగా చెప్పవీలున్నది.

ఇంత ప్రాచీన కాలానికి చెందిన వైదిక వాఙ్మయమునకు కర్తలు ఆర్యులని, ఈ ఆర్యులు ఎక్కడనుంచో బయలుదేరి మన దేశానికి వచ్చినారని చెప్పటం మన చరిత్రకారులకు అలవాటైపోయినది. శ్రీ మున్షీగారి విద్యాభవనం ప్రచురించిన వైదికయుగమనే సంపుటములో ఒకచోట ఆర్యుల మొదటి నిలయము దక్షిణ రష్యా అని (పుట 212), వేరొక చోట మధ్య ఆసియా అని (పుట 218) చెప్పబడినది. బహుశః వీరి ప్రకారం ఆర్యులు దక్షిణ రష్యానుంచి లేచి మధ్య ఆసియాకు వచ్చి, అచటనుంచి ఇతర దిక్కులకు పోకుండా మన అదృష్టవశాత్తు ఎందుకో భారతదేశానికి వచ్చి ఉంటారు. ఊహాగానమంటే ఇదే.

భాషా శాస్త్రము ప్రకారము ఆర్యులంతా ఒకే ఒక చోట ఉండేవారని, అచటినుంచి ఇతర దేశాలకు భిన్న మార్గాల ద్వారా వలసపోయినారని, కొన్ని పదాల ప్రాచీన రూపాలు గ్రీకు, లాటిన్ భాషలలో నిలచిపోయినవని చెప్పుతారు. ఉదాహరణకు తార అనే పదం తీసికొందాము. అవెస్తాలో 'స్తర' గ్రీకులో 'అస్టెర్', లాటిన్‌లో 'అస్త్రుం' అని కనిపించే పదం సంస్కృతంలో తారవవడంచే వలస వచ్చిన భారతీయులైన ఆర్యులు పూర్వ రూపాన్ని మార్చినారని వీరంటారు. కాని ఒకే ఒకచోట ఉన్న జన సమూ

వాము ఒకే భాషను ఒకే విధముగా ఉచ్చరించేవారని చెప్పటం భాషా శాస్త్రం తెలియని వారికే తగుతుంది. ఒకే భాష ఐనా మాండలిక భేదా లుండవచ్చును. ఇంతేగాక చీలిపోయేవారు సహజంగా ఆనాటికి ఉన్న భాషా సంప్రదాయాలను తమవెంట తీసుకొని వెళ్ళటం సహజం. అరవదేశానికి 16, 17 శతాబ్దాలలో వలస పోయిన ఆంధ్రులు ఆనాటి పదాలను తీసికొనిపోయి, నేటికిగూడా వాటినే ఉపయోగిస్తున్నారు. ఆ శతాబ్దాల ప్రాచీన రూపాలు మన నేటి తెనుగులో కన్పించవు. ఇంతమాత్రాన మనమంతా తంజావూరు మొదలైన అరవజిల్లాలనుంచి ఆంధ్రదేశానికి వలసవచ్చిన వారమంటే చరిత్ర ఒప్పుకుంటుందా? ఇలాగే 'తార' అనే రూపం భారతదేశంలో రాకముందే చీలిపోయి పాశ్చాత్యదేశాలకు వలసపోయిన ఆర్యులు ఈ శబ్దపు ప్రాచీన రూపాన్ని వెంటతీసుకొనిపోవటంలో ఆశ్చర్యం లేదు.

ఆర్యులు భారతదేశంనుంచి ఇతర స్థలాలకు వలస పోయినారనటానికి ఆయా ఆర్యభాషలలోని సారస్వతం కూడా తోడ్పడుతున్నది. ఆర్యుల అతి ప్రాచీన గ్రంథాలు వేదాలని అందరు అంగీకరించిన విషయమే. వేదాల తర్వాత వచ్చినది అవెస్త. ఈ జెందవస్త తర్వాత క్రమముగా లిథువేనియన్, గ్రీక్, లాటిన్, జర్మన్ సారస్వతాలు బయలుదేరినాయి. దాదాపు స్థిరముగా నివాసముల నేర్పరచుకొన్న ప్రజలలోనే సాహిత్యం బయలుదేరటం కద్దు. దక్షిణ రష్యానుంచి ఆర్యులు బయలుదేరినట్లయితే మన వేదాలకన్న పూర్వమే లిథువేనియన్ వాఙ్మయం కనిపించాలి. యూరప్‌లోని ప్రజలు మన వేదాలు వచ్చినదాకా ఆగి, ఆ తర్వాత తమ గ్రంథాలను చెప్పసాగినారని దక్షిణ రష్యావాదు లనటం సత్యదూరము. ఇంతేగాక మూడు వందల యేండ్ల క్రిందట యూరప్‌నుంచి పశ్చిముగా ఈ జాతికి చెందినవారు అమెరికా జేరినారు. ఈ విషయాన్నిబట్టి అతి ప్రాచీనకాలంనుంచి ఆర్యులు పశ్చిమ రాజ్యాలకే వలసపోవటం సాగించారని తేలుతుంది. ట్రోజనులు పశ్చిమంగా పోయి ఇటలీ జేరినారు.

దీనికి అనుగుణంగా ఒక విషయాన్ని గమనించాలి. ఋగ్వేదసంహితలో అనేక పర్వతాలు పేర్కొన బడినవి. కాని హిమాలయము ఒక్కసారే అదికూడా నిర్లక్ష్యముగా, ప్రస్తావించ బడినది. ఈ శబ్దము కన్పించే సూక్తం చాల అర్వాచీన మయినదని పాశ్చాత్యులే అన్నారు. పశ్చిమోత్తర దిశగా ఆర్యులు భారతదేశానికి వచ్చినవారైతే వీరు హిమాలయాలను అంత తేలికగా వదలివేస్తారా? ఇట్టి కారణాలను అనుసరించి గ్యునెర్ట్, ష్రోడ్యెర్‌లు పశ్చిమయూరప్ చాల అర్వాచీన కాలమున, చిట్టచివరకు ఆర్యులచే ఆక్రమింపబడినదని వాదించినారు. భారతదేశంనుంచి వెళ్ళగొట్టబడిన ఆర్యులలో కొందరు తర్వాతి కాలంలో మనమీదికే దండెత్తి వచ్చినారు. పార్శీలు మాత్రం అరబ్బులచే నిర్బద్ధులైనప్పుడు తమ పూర్వుల దేశానికి తిరిగి వచ్చినారు. తాము భారతదేశానికి వచ్చిన పర్షియా దేశస్థులమని పార్శీలు నేటికీ చెప్పుకొంటారు. భారతీయు లిట్లా వచ్చినవారు కాక పోవటంచేత వారిట్లా చెప్పుకోవటం లేదు.

మధ్య, దక్షిణ భారతదేశమునకు చెందిన ఈ ఆర్యులు క్రమముగా తూర్పు భారతమునకు వ్యాపించి, అటునుంచి పశ్చిమమునకు, ఉత్తరమునకు పోయినారు. ఒక ఋగ్వేద సూక్తంలో భారతదేశపు నదులు పేర్కొనబడినవి (10-75), ఈ వరుసలో తూర్పునుంచి వాయవ్యంగాగల నదుల క్రమము కన్పిస్తుంది. వీరు వాయవ్య భాగంనుంచి ఇతరప్రదేశాలకు వ్యాపించి ఉంటే ఈ వరుసలో చెప్పేవారు కారు.

గంగానది అర్వాచీన మనబడే సూక్తంలో ఎందుకు కన్పిస్తున్నదని అడగవచ్చు. ఇక్కడ రెండు విషయాలను గమనించాలి. మనకు నేడు లభించే వైదిక వాఙ్మయము అసలా కాలంలో బయలుదేరిన వాఙ్మయంలో అతిస్వల్పభాగమని ఋజువుచేయబడినది. ఈ స్వల్పభాగంలో ఏదైన కన్పించనంత మాత్రాన వైదికార్యుల కా విషయము తెలియదని వాదించటం సాహసమాత్రము. మనకు నేడు లభ్యమైన భాగంలో గంగానది ప్రసక్తి బాగా ఉండిఉండవచ్చును. ఇక రెండవ విషయము. వైదిక వాఙ్మయము జీర్ణమైపోతున్న రోజులలో సంహితాది విభాగము, సంకలనము జరిగినవి. ఈ సంకలనములో కూడ చాలభాగము వదలివేయబడి ఉండ వీలున్నది. పైగా సంకలనకర్త అతి ప్రాచీన భాగాలను ఆనాటివారికర్థమైన భాషలోనికి తీర్చి దిద్ది ఉండవచ్చును. కుత్స్నత్రిత ఆప్త్యుల సూక్తాలనుబట్టి ఇట్టిది జరిగిందని గట్టిగా చెప్పవీలున్నది. ఈ రీతిగా గమనిస్తే సప్తసింధువులు భారతీయులు తర్వాత చెప్పిన సప్తమహానదులే కావచ్చును.

ఆంగ్లంలో 'బీచ్' అనబడే చెట్టు ఒకటున్నది. ఆర్యుల కీవృక్షం మతిపరిచితమైనదని, ఆర్యభాష లన్నిటిలోను ఈ వృక్ష సూచకపదములు తుల్యములని, సంస్కృతంలో దీని ప్రాచీనరూపము 'భగ' అనీ, అందుచేత ఈ వృక్షము నేను కన్పించేప్రాంతమే ఆర్యుల ప్రథమ నివాసస్థలమని ఒక వాదమున్నది. జర్మనీలోని కొయ్నింగ్స్బర్గ్ నుంచి క్రిమియా వరకు ఒక గీతగీస్తే దానికి పడమరగానే ఈ చెట్టు కన్పిస్తుంది. కాని వైదిక 'భగ' శబ్దము, ఆంగ్ల 'బీచ్' శబ్దము తుల్యములు కాజాలవని భాషాశాస్త్రమే చెప్పుతున్నది. ఈ చెట్టుతో పరిచయము పాశ్చాత్య దేశాలకు పోయిన ఆర్యులకే ఉన్నది కాని అందరకు లేదు. పైగా ఆయా దేశాలకు పోయిన ఆర్యులు ఆయాదేశాలలోని ప్రాచీనవాసుల భాషలలోనుంచి కూడా మాటలను తీసికొన్నారు. ఈ పదాలుకూడా ప్రాచీన ఆర్యభాష లోనివని యెంచ వీలులేదు. 'బీచ్' అనే శబ్దము ఇలాంటి ఋణగ్రస్త శబ్దముకావచ్చును.

వైదిక సంస్కృతంలో ఆర్యభాష లన్నిటి కంటె ఎక్కువ అచ్చులున్నవి. మనము పడమరకు పోతున్నకొద్దీ ఈ అచ్చులసంఖ్య క్రమముగా తగ్గుతుంది. నేటి భారతీయ భాషలలోకూడా ఈ అచ్చులన్నీ ఉన్నవిగాబట్టి ప్రాచీన ఆర్యుల ఆదినివాసస్థలము భారతదేశము కాదనడం సాహసప్రాయము.

ఏవో కొన్ని విషయాలు వైదికవాఙ్మయంలో కన్పించటంలేదుగనుక ఆ వస్తువు లున్న దేశంలో ఆ కాలమున వైదికఆర్యులు లేరనికూడ చెప్పవీలులేదు. మొహంజొదరో శిథిలాలలో సింహమునుగురించిన చిత్రాలు కన్పించవు. కాని దగ్గరగాఉన్న రాజస్థాన్లో చాలా సింహా లున్నవి. కాబట్టి ఈ ప్రాంతంలో కన్పించే శిథిలాలు సింహాలు లేనిచోటునుంచి ఇక్కడకు తీసికొనిరాబడినవని వాదించేవారికి ఉన్మత్తులకు భేదములేదుగదా! ఇలాగే బియ్యము వేదాలలో చెప్పబడనంతమాత్రాన వారికి వరిధాన్యమే తెలియదనటం కూడా అసంబద్ధమే. వైదిక ఆర్యులకు బియ్యమే తెలియదని వాదించేవారు ఈ వాఙ్మయంలో లవణము చెప్పబడలేదు గనుక ఈ ఆర్యులు ఉప్పులేకుండా భోజనము చేసేవారని చెప్పాలి. పాప మెందుకనో ఉప్పుసంగతిని ఈ పరిశోధకులు మరచిపోయినారు. అసలు వైదికార్యులు వారి దైనందినచర్యగా వ్రాసినదైతే ఈ వైదికవాఙ్మయంలో అన్ని విషయాలు కన్పించేవి. కాని వారు తమజీవితంలో అతి ముఖ్యమైన ధార్మికాధ్యాత్మిక సన్నివేశాలను మాత్రమే భావనా వ్యాపారశక్తిమున చిత్రించినారు.

ఏనుగును మృగహస్తి అని వైదికార్యులు పిలచి వారుగనుక వీరికి చేయిగల జంతువుగా ఏనుగు కన్పించినదని, వీరు ఏనుగులున్నచోటికి తర్వాతికాలమున వచ్చినారని మరొకవాదము. కాని మృగహస్తి అనే పదము భావనాగర్భితమైన కవిసమయాన్ని సూచించే మాట ఎందుకు కాగూడదు? మృగాలను చతుష్పాత్తులని, మనుష్యులను ద్విపాత్తులని, వైదికఋషు లన్నారు గనుక వీరికి మృగాలు, మానవులు వింతవస్తువులుగా మొట్టమొదటిసారి కన్పించారని అనలేముగదా!

ప్రాచీన ఇరాక్ దేశస్థులు తమ ఆదిమనివాసమును ఐర్యవర్జొ అన్నారు. ఇది ఆర్యావర్త శబ్దానికి అపభ్రంశము. అసురదేశంలో ఇరాక్కు ముఖ్యనగరమైన హిరణ్యపురమును రాజసూయానికి ముందు అర్జునుడు ముట్టడించినాడు. తర్వాత నివాతకవచ, కాలకేయుల నోడించినాడు. ఈ కాలకేయ శబ్దమే ఉత్తర మంగోలియాలో ఖల్ఖస్ అని నేను పిలువబడుతున్నది. మహాభారతము ప్రకారము ఇరాక్ అనే శబ్దానికి పూర్వరూపము హిరణ్యశబ్దమై ఉంటుంది. ఇరాక్ దేశస్థులు రస, సరస్వతి మొదలగు నదులను స్మరించారు, వలస పోయేజనం తమప్రాతదేశ, నగర, నదీనామాలను క్రొత్తదేశములోని వాటికి పెట్టటం మానవ సంప్రదాయం. యార్క్కు న్యూయార్క్ వచ్చింది. పష్తియుల రన్హాశబ్దంకన్న వైదిక రసశబ్దం అతిప్రాచీన మనటంలో సందేహములేదు.

అవెస్తాలో భగవంతుని అహురమజ్ద అన్నారు, ఇతడు వేదములలో అసురోమహాన్ అని కనిపిస్తాడు. ఈ అసురుని అనుయాయులాక్రమించిన దేశము అస్సీరియా. వీరు కశ్యైటి పాలనకాలంలో అక్కడకు చేరినారు. చాల్డియా రాజగు సర్గోన్ (క్రీ. పూ. 3800) సిరియాను అమురు అని పిలిచినాడు. సురశబ్దము సిరియాగాను, అమరశబ్దము అమురుగాను మారినవి. ఇవి మనకు పర్యాయపదములే గదా; కావుననే ఈ దేశానికి రెండుపేర్లు వచ్చినవి.

యజ్ఞయాగాది క్రతువులపై ధ్వజమెత్తిన ఉపనిషద్ఋషుల వలెనే జరథుశ్త్ర కూడా దండెత్తినాడు.

అస్సురబనిపాల్ (క్రీ. పూ. 700) నకు ఇతని సంస్కరణలు పరిచితములే. దేవుని ధ్యానించు వారిని జరథుష్ట్రి నిందించి నపుడు అతని దృష్టిలో వైదికార్యులే ఉన్నారు. కావున ఆయన చేతులలో మన ఇంద్రుడు దైత్యుడైనాడు. దీనినిబట్టి అపర్షియాకు వలసపోయిన ఆర్యులకు భారతదేశములోని ఆర్యులపై క్రోధము వచ్చినదని ఎంచ వీలున్నది. భారతీయులు వారిని తమ దేశమునుంచి వెడలగొట్టి యుండవచ్చును. అందుచేత వారికి ఆగ్రహము వచ్చినదని, తద్వారా భారతదేశము నుంచి తాము తెచ్చుకొన్న ఆచారవ్యవహారములను వారు సంస్కరించ సాగినారని భావించ వీలున్నది. మీడియా దేశపువారినుంచి పర్షియా దేశస్థులపుడు శవములను పాతిపెట్టటం కూడా గ్రహించినారు. తమను వెళ్ళగొట్టినవారి దేవతలు వీరికి రాక్షసులైనారు. అవెస్తాలోని గాథలు మొదలైనవి సంహితలు బ్రాహ్మణములు వచ్చిన కొంతకాలానికి బయలుదేరినట్లు దీనివలన స్పష్టమౌతున్నది.

భారతదేశంనుంచి లేచిపోయిన ఆర్యులలో కొందరు పర్షియాలో స్థిరపడిపోయినారు. వీరు తెచ్చిన సంస్కరణలతో తృప్తి చెందనివారు వీరిని వదలి ఇంకా పడమరగా పోయినారు. ఇండోయూరోపియన్ల శబ్దాలను, శబ్దార్థములను బాగా శోధించిన బ్రాండెన్ స్టైన్ అనే పండితుడు అతిప్రాచీన ఆర్యకుటుంబము నుంచి మొటమొదట బయటకు వచ్చినవారు భారత పర్షియా దేశాల ఆర్యులని స్థిరపరచినాడు. కాని ఆయన ఇచ్చిన వాదాలద్వారా మొటమొదట స్థిరనివాసముల నేర్పరచుకొన్నవారు భారతదేశములోని ఆర్యులని తేలుతున్నది. ఇతరులు ఆ సమయానికి ఇంకా ఉచితస్థలాన్వేషణలోనే నిమగ్నులై ఉన్నారు. భారతీయుల నుంచి లేచిపోయినవారిలో మొదట స్థిరపడినవారు పర్షియా దేశములోని ఆర్యులు.

భారతదేశమే ఆర్యుల నిజమైన నివాసభూమి. ఐతే ఈ దేశాన్ని పూర్తిగా ఆర్యమతంలోకి మొట్టమొదటనే మార్చకుండా, ఎందుకు ఇతర దేశాలకు వీరు పోవలసి వచ్చినది? అని అడుగవచ్చును. కాని జాతికి మతమునకు ఎలాంటి సంబంధం లేదని వైజ్ఞానికులందరును అంగీకరించిన విషయమే గనుక ఈ ఆశంకకు ఆధారము లేదు. విభిన్న సంప్రదాయాలను, ఆచార వ్యవహారాలను సమన్వయపరచే శక్తి ఆర్యుల విశిష్ట స్వభావంలోనే ఉన్నది. కత్తి కట్టుకొని, మోసగించి తమమతాన్ని ఇతరులపై రుద్దటం ఆర్యుల స్వాభావిక గుణము కానేకాదు.

ఐర్యానవైజొ అని పిలువబడిన ఆర్యావర్తము మొటమొదట అహురమజ్ద సృష్టించెనని వెందిదాద్ లో మొదటి ప్రకరణమున గలదు. ఈ ఆర్యావర్తమున చలికాలము సుదీర్ఘమైనది. తమ పూర్వులా దేశాన్ని వదలి వచ్చినారని చెప్పబడినది. ఆర్యశబ్దము రూపాంతరాలను పొంది ప్రపంచమంతట వ్యాపించినది. కాని ఆర్యావర్త శబ్దము కేవలము మన దేశంలోనే కన్పిస్తుంది. దివ్యశిరములను సాధించటానికి ఉత్తర ధ్రువానికిగాని, రష్యాకుగాని, మధ్యఆసియాకు గాని పోనక్కరలేదు. భూమి తీవ్రంగా కంపించినదని ఋగ్వేదము చెప్పుచున్నది. (2.12.2). ఈ కంపాదులవలన శీతోష్ణపరిస్థితులు చాలవరకానాడు తారుమారైనవి. కొండలలో బయలుదేరి సముద్రములోనికి ప్రవహించిన సరస్వతీనది (ఋ. వే. 7. 95. 2) మాయమైనది. ఈ భూకంపాదులవలన కూడ కొందరు మన దేశాన్ని వదలవలసి వచ్చినది.

మధ్యఆసియావాదము దోషభూయిష్ఠము. ఎత్తైన కొండలుగాని, ఎడారులుగాని, దాటశక్యం కాని అడవులుకాని అక్కడ లేవు. పైగా విరివిగా ఆవులు, గుర్రాలు ఉన్న మధ్యఆసియా పాడిపంటలకు పుట్టిల్లుగా ఉండేది. గొడ్లకు మేత, మానవుల కాహారము సమృద్ధిగా అక్కడ లభించేది. అలాంటిదేశాన్ని ఆర్యులెందుకు వదలివేయగలరు? భూకంపాదులవలన లేచిపోయినారంటే, అవి భారతదేశంలోనే ఆనాడు వచ్చినవనటానికి మన కాధారాలున్నవి. పైగా తూర్పు పడమరలలోని సముద్రాలలోనికి సూర్యుడు వెళ్తున్నాడని ఋగ్వేదమన్నది (10. 136. 5). మధ్య ఆసియా వారికీసముద్రాలెలా కన్పించగలవు? ఉత్తరధ్రువ ప్రాంతంవారికి మాత్ర మీ రెండు సముద్రాలు ఎలా కన్పించగలవు? పంజాబులో ఆర్యులుంటే వారికి మాత్రం ఈ రెండు సముద్రాలు కాని, నాలుగు సముద్రాలు (ఋ. వే. 9. 33. 6) కాని, కన్పించటానికి వీలేమాత్రం లేదు. భూపంకమే (ఋ. వే 2-12-2) కాకుండా, స్వైరవిహారము చేస్తున్న కొండలు (ఋ వే 2-17-5) కూడా ప్రస్తుతింపబడినవి. ఇవి అగ్నిపర్వతాలు. ఈ ప్రమాణాలకు

సరియైన భారతీయులు క్రొత్త క్రొత్త నివాసభూములకు లేచిపోసాగినారు.

'తోకం పుష్యేమ తనయం శతంహిమాః' (ఋ. వే. 1-64-14) అని, 'పశ్యేమ శరదః శతం, జీవేమ శరదః శతం' (7-66-16) 'స హా ఏష న కదాచనాస్తమేతి నోదేతి' (ఐ బ్రా. 3-4-6) అని పంక్తులున్నవి. పుత్రపౌత్రులను నూరుమంచుకాలాలవరకు జీవించేటట్లు పెంచాలి; నూరు శరదృతువులను చూడాలి; సూర్యున కెలాంటి ఉదయాస్తమయాలు లేవు—అని వీటి భావము. ఇలాంటి వాక్యాలవలన ఆర్యులు ఉత్తర ధ్రువప్రాంతంవారని చెప్పవచ్చునని ఒక వాదమున్నది. కాని మంచుకురిసే రోజులు అనాదికాలంనుంచి భారతదేశంలో మామూళ్ళరోజులు. పండిన ధాన్యాన్ని బాగుచేసి ఇంటికి తెచ్చే కాలమది. శరత్కాలం భారతదేశంలో ఎలా ఉంటుందో బాగా అర్థంచేసికోవాలంటే మన ప్రాచీన మహాకవులను ఒక్కసారి తిరగవేస్తేచాలు. మంచుకురిసే ధ్రువప్రాంతంలోనే ఆర్యులుంటే, చలిబాధ దుర్భరము కాకతప్పదు. అలాంటి సమయంలో మేమేకాకుండా, మా కొడుకులు, మనుమళ్ళుకూడా నూరు చలికాలాలను చూడాలి అని ఎవరు కోరుకోగలరు? తమ సంతానంపైన తమకే ఈర్ష్య, ద్వేషము ఉన్నవాడే ఇలాంటి కోరికను గ్రంథస్థం చేయగలడు. పైగా పైపంక్తులలో ఒకచోట 'పుష్యేమ' అనే క్రియాపదమున్నది. దీనికి పోషించటమని అర్థం. ఈ పోషణకు కావలసినది ధాన్యము. మనకు ధాన్యము కన్పించేది హేమంత, శిశిరాలలో గదా! సూర్యున కుదయాస్తమయాలు లేవనటం జ్యోతిస్సిద్ధాంతములో ప్రాథమిక సూత్రము. ఈ సూత్రము బ్రాహ్మణాల కాలానికిగూడా ఆర్యులకు తెలియదనటానికి ఆధారాలు లేవు. ఒకవేళ తెలియదంటే, ఈ వాక్యం కవి ప్రతిభాసిద్ధమైన సత్యంగా మనమెందుకు గ్రహించరాదు? నూరు చలికాలాలవరకు మా సంతతి పోషింపబడాలి అనే కోరికగలవారు, తమ నివాసము ధ్రువప్రాంతమైతే దానిని ఎందుకు వదలివారో మన కెక్కడా చెప్పలేదే.

ఋగ్వేదం 1-30-9 లో తన ప్రాచీన నివాసంనుంచి రావలసిందని ఇంద్రుని కోరినారు. ఈ ప్రాచీననివాసము భారతదేశానికి ఉత్తరంగా ఉన్న దేశం కాదు. తానిదివర కెక్కడనుంచి వస్తున్నాడో ఆ ప్రాచీననివాసంనుంచి రావలసినదని మాత్రమే కోరిక. వైదికవాఙ్మయంలోని పదాలకు వాచ్యార్థాన్ని చెప్పితే చాలాభాగము మనకు అగమ్యమౌతుందని అందరూ అంగీకరించిన విషయమే. మేరుపర్వతాన్ని చుట్టివస్తూ, దానికి పైగానే నక్షత్రాలు తిరుగుతున్నవి. (తై. బ్రా 3.9.22.1; మ. భా. వన 163; మను 1.67) అనే మాటలు కవి ప్రతిభాసిద్ధమైన సత్యములని ఇందువలననే చెప్పాలి. ఇలాంటివే ఉపన్యాసాలు.

కౌషీతకిబ్రాహ్మణంలో (7.6) ఉత్తరప్రాంతపు భాష ఆదర్శవంతమైనదన్నారు. ఈ ఉత్తర ప్రాంతాన్ని ధ్రువప్రదేశానికి తీసికొని వెళ్ళటంలో ఊహాగానమే కన్పించగలదు. చాల ప్రాచీనకాలంలోనే ఉత్తరభారతానికి ప్రాముఖ్యము వచ్చినది. కైలాసశిఖరము, పవిత్రగంగానది, బదరికాశ్రమము, నైమిశారణ్యము మొదలైనవన్నీ ఉత్తర భారతంలోనే వెలసినవి. ఈ హిమాలయాలకు ఉత్తరతీరాన పరలోకమున్నదని భారతం (శాంతి 192.8-25) చెప్పుతున్నది. అనగా భారతదేశాన్ని వదలి లేచిపోయినవా రవలంబించినమార్గ మిదని భావము. కాశికిపోయినవాడు కాటికి వెళ్ళినవాడు సమానమే అనే సామెత మనకున్నది. ఇలాగే భారతదేశాన్ని వదలి బయటకు వెళ్ళినవాడు చచ్చినవాడితో సమానుడని చెప్పటానికి మాత్రమే హిమాలయాల ఉత్తరతీరమును పరలోకంగా చెప్పినారు. కావుననే హిమాలయాల కుత్తరంగా ఉన్న భూములలో మానవుడు పాపవినిర్ముక్తుడై, మోక్షాన్ని పొందుతాడని మహాభారతము (ఉద్యో 3.27.1) చెప్పింది.

ఆర్యధర్మానికి వ్యతిరేకంగా ప్రవర్తించినవారిని దేశంనుంచి వెళ్ళగొట్టేవారు. నహుషుడిని బయటకు తరిమినారు. (ఆది 75.26 29; వన 181.30-43; ఉద్యో 11.17; శాంతి 342.44-51) నహుషుని సోదరుడు ఇంద్రుని జయించగా, ఆయన కుమారుడు దేవతల దేశాలను నాశనము చేసినాడు (వాయు 92.75-99; మత్స్య 24.35-49; భాగ 9.17,12-16). వీరు అందరు ఇళాసంతతివారు. ఈ ఇళావంశీయులు భారతదేశాన్ని వదలి మధ్య ఆసియా చేరుకొన్నారు. ఇళాపుత్రుడైన పురూరవసునకు గంధర్వులతో సంబంధమున్నది. ఇళాభర్త జారజుడైన బుధుడు. అంగిరసవంశజుడైన

తారయొక్క జారుడు సోముడు. ఉత్తరదేశపు బ్రాహ్మణులకు రాజు సోముడు (ఉద్యో 8.8; విష్ణు 4.6) తన కర్మవలన పురూరవసుడు క్షత్రియుడైనాడు (బ్రహ్మ 108.69.70). ఇళాసంతతి వర్ణసాంకర్యమును తెచ్చినది గనుకనే ఈ సంతతికి చెందిన నహుషుడు దేశభ్రష్టుడైనాడు. ఈ సంతతి వారికి హిమాలయ భూములలో నున్న గంధర్వాదులతో సంబంధాలు వచ్చినవి.

అయోధ్యలో పాలించిన క్షత్రియుల మూల పురుషుడు ద్రావిడదేశమునుంచి వచ్చినవాడని భాగవతమన్నది. దీనినిబట్టి ఆర్యసాంఘిక వ్యవస్థకు బాహ్యంగా ఉన్నవారు ద్రావిడులు కానేకారని దృఢపడుచున్నది. ద్రావిడశబ్దము జాతిని సూచించేది కాజాలదు. ఇది దేశనామము, లేక భాషానామము. ద్రావిడులు వేరు, దస్యులు వేరు. దస్యులకు భూములున్నవి. (ఋ. వే. 1.100.18). వైదికార్యుల శత్రువులైన దస్యులు (2.11.19) యజ్ఞయాగాదులపై నమ్మకము లేనివారు (10.22.8). వారికి లోహకోటలుండేవి (3.12.6). దస్యురాజుకు కృష్ణునకు పదివేల అనుయాయులున్నారు (8.85.13 15). మొదట దానవులవద్ద నుంటినని, తర్వాత దేవతలవద్దకు వచ్చితినని శ్రీ చెప్పినట్లు మహాభారతము (12 225,228) చెప్పుచున్నది. పర్షియా భాషలో దహ్యుశబ్దానికి గ్రామమని అర్థము. వీరే ఇటలీలో దాచి అని, గ్రీసులో దకోఇ అని పిలవబడినారు. కాబట్టి దస్యులు బానిసలుగాని, ద్రావిడులుగాని కారని, ఆర్యుల ప్రబలశత్రువులైన వీరు గ్రామజీవన సక్తులని చెప్పవలెను. మొటమొదట బ్రాహ్మణులని పిలువబడ్డ ఒకేఒక వర్ణముండేడిదని, ఈ బ్రాహ్మణులే చాతుర్వర్ణ్యముగా మారినారని శాంతిపర్వమున (188. 10-17) కలదు. ద్రావిడులు వ్రాత్యక్షత్రియులని మనువు (10-20-22) పలికినాడు. తమ వేదోక్త ధర్మాలను వదలివేయుటంచేత వీరికి క్షత్రియవాసన నశించినదని చెప్పినారు. (మను 10 43-44; అనుశాసన 33-21.22, 37-17.18). ఈ ద్రావిడులు కూడా ఆర్యులతో బాటు భారతదేశం నుంచి బయటకు వెళ్ళినారు. ద్రావిడులైన చుమురి (=సుమ్రి) తెగ యూఫ్రటీస్ నదీ ముఖమున ఉండేవారు. ధుని అనే ద్రావిడుడు దక్షిణ బాల్డియా రాజు దుంగి (క్రీ॥ పూ॥ 2900) అనువాని పూర్వపురుషులలో కన్పిస్తాడు. లైసియా ప్రజలు తమనుతామే తెర్మిలై అని శాసనాలలో పిలుచుకొన్నారు. తెర్మిలై, ద్రమిళ, ద్రవిడశబ్దాలు పర్యాయపదాలు. ఆర్యసంప్రదాయాలను త్రోసిపుచ్చుకొని ధర్మభ్రష్టులైన వారు ఆయా ఇతర దేశాలకు వెళ్లినారు, అప్పుడక్కడ వీరిని పర్షియాలో సిద్రిఅని, ఆర్మీనియాలో సొగుచెన అని, చీనాలో చూదఅని, చౌఅని పిలచినారు. వీరినే శూద్రులని మనదేశంలో వ్యవహరించి ఉండవచ్చును.

కశ్యపభూమియన్న కశ్మీరమునుండి లేచిపోయిన ఆర్యులు స్థిరనివాస మేర్పరచుకొన్న ప్రాంతమునగల సముద్రమును కశ్పియన్ సముద్రమన్నారు. కసులు, కస్సైటి వంశము అనేవి ఈ కశ్మీర ఆర్యులతో సంబంధముగలవని చెప్పవచ్చును. పశ్చిమ ఆసియాలో క్రీ. పూ. 1756 నుంచి 1170 వరకు పాలించిన రాజులు కస్సైటివంశజులు. వీరికి సూరియస్ అనే సూర్యదేవుడున్నాడు. మరుత్తస్ కూడా ఇక్కడ కన్పించటంకాక నజిముఋత్తస్ అనే వ్యక్తి వీరిలో ఉన్నాడు. సుమలియ (=సుమాలి, సుమాల్య) అనే పర్వతదేవత, శుగమున (=శుచమున) అనే తేజోదేవత కలరు. ఐదవరాజు పేరు అభిరత్తస్ (=అభిరథ). అన్యాయంగా రాజ్యమాక్రమించుకొన్న సుజిగ అనువాడున్నాడు. చేయువాడు అనే అర్థంలో కరశబ్దంవచ్చే పేర్లు కరఇందస్, కరబురియస్, కరహార్దస్. వైదికభగశబ్దమిక్కడ బుగస్ గా మారింది. గుర్రాన్ని వీరు శిసు అని పిలచారు. బాబిలోనియా, అస్సీరియా ప్రజ లీమాటను వీరినుంచి గ్రహించారు. బాబిలోనియా భాషలో గుర్రానికి శుర అనే పేరు కన్పిస్తుంది. శిసువుకు అర్థం చెప్తూ ఇది తూర్పు పర్వతాలలో కన్పించేగాడిద అని బాబిలోనియావారన్నారు. అనగా గుర్రం కొత్తగా తూర్పు దిక్కునుంచి ఈ ప్రాంతాలకు వచ్చినదని భావము. దీనితోబాటు ప్రజలుకూడా అక్కడనుంచి వచ్చినారని తాత్పర్యము. పర్షియావారు మన సకారాన్ని హకారంగా మార్చినప్పటికీ, కస్సైటీలు సకారాన్ని సకారంగానే ఉంచారు. పర్షియాభాషలో ఈ హకార పరిణామం రాకముందే కస్సైటీలు వారినివదలి వెళ్ళినారు. బహుశ పర్షియనులు తెచ్చిన సంస్కరణలు వీరికి రుచించక పోవటంచేత వీరిలా పోయినారేమో! క్రీ. పూ

1756 లో రాజ్యానికి వచ్చినారంటే ఈ కశ్శైటీలు అక్కడకు క్రీ. పూ. 2000 లకే చేరివుండాలి.

క్రీ. పూ. 1675 నుంచి 1575 వరకు ఈజిప్టును పాలించిన హైక్సోస్ అనే వంశము విదేశవంశమని ఈజిప్టు సంప్రదాయము. హాత్షెప్సుట్ రాణి వీరిని ఆము అని, సశ్వ అని పిలచింది. ఆము అంటె ఆసియా వారని అర్థము. వీరి నాయకులను హీక్షసుత్ అని పిలచారు. దీనికి ఎడారులలోని రాజకుమారులని అర్థము. వీరు ఆర్యులైనా కావాలి, లేక ఆర్యసంస్కృతిని అవలంబించిన పశ్చిమ ఆసియావారు కావాలి. వీరి భాషలో బ్నొక్ (=వసన), అభ్నక్ (=అపఘ్నక్), అపోఫిస్ (=అపభిస్), అశెఫ్ (=వశిత), కెర్తోస్ (=కర్త) అనే సంస్కృతపదాలున్నవి. వీరి ముఖ్య పట్టణాన్ని ఆవరిస్ అన్నారు. ఇది మన ఆవర శబ్దము. సెంకెన్ (=సువఘన్), కర్ (=కర), తవ్తి (=తవతి) అనే పేర్లు వీరిలో కన్పిస్తున్నవి. వీరి దేవుడు సుతేఖ్ అనుబడు సుతేక లేక సుతేజస్. యుద్ధరథాన్ని వరఅర్థమన్నారు. తూఘలమును కాటుకను తుతెక్నమన్నారు. పరశుధారుడైన రామక్ అను దేవుడు ఈజిప్టులో ఉన్నాడు. ఈయన పరశురామునికన్న వేరుగాడు. క్రీటుదేశపు మైసీనియా ప్రజలకు పరశురాముని జంటగొడ్డలి పరమపవిత్రమైనది. రామ పరశురాములకు జరిగినయుద్ధంవలన పరశురాముని అనుయాయులు ఈజిప్ట్, క్రీట్ దేశాలదాకా వెళ్ళారనటంలో సందేహంలేదు.

పాలస్తీన్, సిరియాలలో దొరికిన అమర్న అనబడు లేఖలలో (క్రీ. పూ. 1380-1350) అర్తమనియా, (అర్తమన్య, ఋతమన్య), అర్జలియ (ఆర్జవ్య), ఓరియవాజ (=వీర్యవాజ) బిరిదశ్వ (బృహదశ్వ, వృద్ధశ్వ), బిరిడియ (బృహదియ), బిసితను, దర్సు (దర్న), సుతర్న వితగమ, ఎందరూత (ఇంద్రోత) అను సంస్కృతపదాలున్నవి. ఫారోయొక్క వార్తావహుని పేరు ఇరిమయస్స. సొమ్మదియైన గుర్రము గలవాడని ఈమాటకు అర్థము. ఈపదం చివరఅశ్వశబ్దం కన్పిస్తుంది. హాజినాయకుని పేరు మాయర్జన. దీనిలో మొదటి మాకారము మాసశబ్దములోనిది. మాసదేవత ఐన చంద్రునిచే రక్షింపబడువాడని ఈ మాటకు అర్థము. ఫారో ప్రతినిధి కొడుకైన నమ్యావాజ తండ్రి కుతిర్జడు. రుస్మన్య (రుచిమన్య), సతియ (సత్య), సుబంధు, సుమిథ (సుమిత్ర), సుతర్న సుతత్న (సుతతనయ), సువర్దత (స్వర్దత్త), తెవ్వత్తి (దేవత్తి), తుర్యజా (తుర్వసు, తురబాహు), విద్య, యశ్దత (యశోదాత), జిర్దమ్యస్ద (హృదయమేధ). జిత్రియర (చిత్రవార). జురస్తర (సురాష్ట్ర), జురత (సురథ), ఆమయు, అను మానవ నామాలిక్కడ కన్పిస్తున్నవి. అక్షప, సునామ అను పేరుగల నగరాలు పాలస్తీనాలో వున్నవి. దీనినిబట్టి ఆర్యసంస్కృతి సిరియా, పాలస్తీనాలలో ఎంతబాగా పాతుకుపోయినదో తెలియగలదు. ఈశబ్దాలన్నీ సంస్కృతపదాలకు అపభ్రంశాలుగా ఉండటంచేత భారతీయులే ఇచటకు వచ్చినారని విశదము కాగలదు. పాలస్తీనాశబ్దానికి పులస్త్యశబ్దంతో సంబంధము లేదని ఎవరనగలరు?

యూఫ్రటీస్ నదియొక్క పైలోయలో మితన్ని అనే వంశము క్రీ. పూ. 1475 నుంచి 1280 వరకు పాలించినది. అర్తసుమర (ఋతస్మర), అర్తతమ (ఋతుధామ) తుశ్రత్త(సుశ్రీథ), దసాత్త(దాసాత్తి), మత్తియువాజ (మధివాజ) సుస్సతర్ (సంతుత్ర), సుత్తర్న (సుథర్న) అనే రాజులిక్కడ పాలించారు. ఇంద్ర, మిత్ర, వరుణ నాసత్య దేవతలు వీరికున్నారు. వష్టియనులు ఇంద్రునిదానవునిగా మార్చకముందే వీరు అక్కడనుంచి తప్పుకొని వచ్చినవారు. వీరి ముఖ్యనగరము వశ్శన్ని (వసుక). యుద్ధవీరుని మర్య శబ్దంతో పిలిచినారు. ఇది వైదిక పదము. రాష్ట్రపాలకులను విరాట్ లన్నారు. మనము కొరడా అని అర్థము చెప్పు పరితత్ను అనే పదానికి భాషలో పరితతిను అని ఉన్నది. మనరుక్మ శబ్దమునుంచి ఉరుక్మన్న అనేమాటను కల్పించినారు. ఇలాంటి మాటాడిన వారితో కొంతకాలముండిన ఆర్యులు ఆ తర్వాత భారత దేశానికి వచ్చారనటం భాషాశాస్త్ర మర్యాద తెలియని వారికే తగుతుంది.

ఆసియా మైనరుకు చేరిన హిత్తైతీలు క్రీ. పూ. 1400 నుంచి 1200 వరకు అక్కడ పాలించారు. వీరి కాలంలో ఎందర్ (ఇంద్ర), లుపక (లోపక,లోపశ) సుమిత్తరస్ (సుమిత్ర), అబిమర్దస్ (అభిమర్ద) అనేవారున్నారు. సువర (స్వర్) పర్వత మొకటి చెప్పబడింది. ఐక (ఏక), తెరవర్తన్న (త్రివర్తన), పంజ వర్తన్న (పంచవర్తన), సత్త (సప్త) వర్తన్న, నవ వర్తన్ని అనే ద్విగు సమాసాలుకూడా ఇక్కడున్నవి.

సప్తశబ్దము పర్షియన్‌లో ఐనట్లు హప్త కాకుండా, మన ప్రాకృతాలలో వలె సత్త ఐనది. అనగా వీరు పర్షియాలో ఎక్కువకాలం నిలవకుండా ఆసియామైనరును చేరినారని భావము. వీరిభాషలో ఔజమేధ (అవాజమేధ), నిసువన్ని (నిషువన), సితిన్న (సేధన) తపసస్, వసన్న శబ్దాలు కూడా ఉన్నవి. గుర్రానికి వేసే తింపిలో చక్రము నేది ఒక వేరున్నది. దీనిని వీరు జుక్రీహా అన్నారు. గంజాయికి వీరి భాషలో గంజ శబ్దమున్నది.

హిత్తైతీలు ఆసియా మైనరు క్రీ. పూ. 1950 లో ఆక్రమించినారు. ఎడ్వర్డ్ మేయరు వీరు తూర్పు దిక్కు నుంచి ఇచటకు వచ్చిన వారని సిద్ధాంతించుచు, ఇండో ఇరానియనులు పశ్చిమముగా పోవు మార్గమును ఇంకా పడమరకు తరిమి వేసినారన్నాడు. అక్కడ్ దేశపు నరంసిన్ అను నాతను పురుష ఖత్తితో క్రీ. పూ. 2401 లో యుద్ధం చేసినాడు. ఖత్తియనగా క్షత్రియుడు. ఈ క్షత్రియరాజులు క్రీ. పూ. 1740 నాటికి అమొరైటిప్రభుత్వమును హతమార్చినవి. వీరు పురు క్షత్రియులు. ఈ ఖత్తి శబ్దమే హత్తి, హిత్తి, హిత్తైతిగా మారినది.

తోఖరియాభాష ఒకటి ఈమధ్య బయట పడింది. వీరిని తూర్కారి, తూర్క్రి, తిక్కర అని పిలుస్తారు. వేదాలలోగల తుజవంశమునుంచి వచ్చిన వారు తాజికులు. ఈ తాజికశబ్దము తక్షక శబ్దభవము. తక్షశిలా ప్రాంతమునుంచి లేచిపోయి తూర్పు తుర్కిస్తాన్‌ను ఆక్రమించుకొన్న ఈ తాజికులే తర్వాతి కాలములో బౌద్ధమతానికి ప్రబలమైన ఆశ్రయమిచ్చారు. ఇచటివారు తమ ప్రాచీనుల నివాస భూమి ఐన భారతదేశానికివచ్చి విద్య నభ్యసించారు.

ప్రాచ్య ఆర్యభాషలతో సన్నిహిత సంబంధం కలది లిథువేనియన్ భాష. ఈ భాషనుంచి అనేక పదాలను ఫిన్లండుభాష గ్రహించినది. భారతదేశం నుంచి బయటకుపోయిన మొట్టమొదటి సమూహంలో కొందరు ఆర్యులు లిథువేనియాకు, కొందరు ద్రావిడులు ఫిన్లండు, హంగేరియాలకు వలసపోయినారని చెప్పవీలున్నది. ఎక్కడనుంచో గ్రీసుదేశానికి వచ్చి, అక్కడవున్న పల్లని మిహోవన్లను ఎదుర్కొనినవారు గ్రీకులని పరిశోధకులొప్పుకొన్నారు. కావుననే గ్రీకు భాషలో చాల అనార్యశబ్దాలున్నవి. క్రీ. పూ 1200 కు అఖయియన్లను గ్రీకుభాషను మాట్లాడినవారు గ్రీసు దేశాన్ని చేరినారు. వీరిని హిత్తైతీలు అఖియవులని, ఇటలీవారు అఖిలి అని అన్నారు. ఈజిప్టు శాసనాదులలో క్రీ. పూ. 1229 నాటికి వీరినే అకైవషులని పిలచినారు. వీరు నావికులని, వీరి నాయకుడు అత్తర్సియస్ అని హిత్తైతీలన్నారు. ఈయన తర్వాత అత్రియస్ ఐనాడు. ఈ శబ్దంలో అత్రి, ఆత్రేయ శబ్దాలు కన్పిస్తున్నవి. అఖయియన్లే ఒక్కకులని కూడ పిలువబడిన ఇక్ష్వాకులు. భాగవతం ప్రకారము ఇక్ష్వాకులు ద్రావిడదేశమునుంచి వెళ్లినవారు. కావుననే గ్రీసుదేశమును చేరిన ఇక్ష్వాకులద్వారా ద్రావిడపదాలు గ్రీసు భాషలోకి చేరినవి. గ్రీక్ లోని లిథోస్ శబ్దానికి ‘రాతి’ అనే పదానికి భేదమేమీ లేదు. ఏకశబ్దానికి ఐకోస్ అని గ్రీకులోవున్నా జర్మన్, ఆంగ్లభాషలలో వన్ అని రావటం ద్రావిడభాష ప్రాబల్యమే అనకతప్పదు. గ్రీకులో కన్పించు దానాయ్ తెగ దానవశబ్దభవము. పెలాస్గి అనే తెగకు ఫిలిస్టైన్లకు, ఈజిప్టులోని ఫులసేతికి, అస్సీరియాలోని పులస్తుకు మన పులస్త్యునకు సంబంధమున్నదని స్పష్టము. గ్రీకు గాథలలో కన్పించు అద్రాస్టస్ (ద్రష్ట) డయామీడ్ (ద్వమీఢ), అజక్స (అజ) అనువారి పూర్వులు భారతీయులే. ఇల్లీరియాలోఉన్న దర్దనీతెగ మన దరదులే. థ్రేస్ లోని బ్రీగేస్ (భృగు), అగమీడెస్ (అజమీఢ), ఒరెస్టిన్ (వరిష్ట), దోరున్ (ద్రోహ్య), దొలోపాన్ (దిలీప), ఫ్రుథేన్ (పృథు) అనువారు మనపూర్వుల సంతతివారే. దిలీప శబ్దానికి చెందిన గ్రామమే డెల్ఫీ. యౌవనాశ్వ శబ్దమే ఇవన్ యవన్ శబ్దాలను తెచ్చినది.

ప్రాచీన భారతీయులకు సుమేరియాతో వ్యాపార సంబంధాలుండేవి. సుమేరియనులకు కన్యాకుమారి దేవత ఉండేది. మన దుర్గవలెనే ఈమె వాహనము సింహము; ఈమె భర్త మన శివుని వలె వృషభవాహనుడు. మెసపొటేమియా శాసనాలలో ఈమె రణరంగమందలి సైనికసమూహాలకు నాయకురాలని కొనియాడబడినది. ఇది మహిషాసుర మర్దనాన్ని స్పష్టంగా సూచిస్తున్నది. మెసపొటేమియావారు ఈమెను పర్వతదేవతగా స్తుతించారు. ఈమె మన హైమవతి, వింధ్యవాసిని. గుజరాతులో నానా దేవి ఆలయమున్నది. సుమేరియావారికి నానా అనే దేవత ఉన్నది. కేశసంస్కారాన్ని భారతదేశమునుంచి వీరుగ్రహించారు. అనేకవస్తువులు సింధునదీ లోయలోని మొహెంజోదరో సంస్కృతినుంచి ఇక్కడకు తీసికొనిపోబడినవని గార్డన్ చైల్డ్ కూడా ఒప్పుకొన్నాడు. పర్షియా సింధుశాఖను ఈదుకొని ఎరిదు అనేచోటికి వచ్చిన సుమేరియా గాథలలోని నాయకుడు సగము మనిషి, సగము చేప. ఇది శతపథంలోని మత్స్య గాథను జ్ఞప్తికి తీసికొనిరాగలదు.

ఇంత ప్రబలాధారము కన్పిస్తున్నప్పుడు ఆర్యులు భారతదేశానికి ఎక్కడనుంచో వచ్చినవారని చెప్పటం యుక్తియుతము కాదు. అసలు ఆర్యుల నివాసభూమి భారతదేశమని, ఇక్కడనుంచి ఉత్తరముగాను, పశ్చిమముగాను బయలుదేరిపోయి విదేశాలలో వీరు నివాసముల నేర్పరచుకొనినారని స్పష్టముగా చెప్పవచ్చును.

# బ్రతికి చెడిన జీవి

## శ్రీ వీరమల్లు రామకృష్ణ

శివరామయ్య ఇప్పుడంటే దరిద్రుడయ్యాడుగాని, ఒకప్పుడు బాగా బ్రతికినవాడే! తనచుట్టూవున్న సమాజంలో ఎంతో గౌరవంగానూ; సుఖంగానూ బ్రతికాడు. తనను ఆశ్రయించినవాళ్ళను ఎంతగానో ఆదరించాడు. పదిమందికి ఇంత పెట్టాడు; పదిమందిచేత ఇంత మంచివాడనిపించుకొన్నాడు. అట్లాంటి రోజుల్లోనే తనకూతురు సుగుణకూడా ఎంతో వైభవంగా పెళ్ళిచేశాడు. ఆ పిల్ల తరువాత చాలాకాలానికి పుట్టిన మగపిల్లవాడికి, అప్పటికి నాలుగేళ్లు.

అయితే, ఇదంతా ఆనాటిమాటే! ఇప్పుడా శివరామయ్యకు ఆ ఆస్తిపాస్తులేమీ లేవు. ఉన్నదంతా వ్యాపారంలో ఊడ్చుకుపోగా, ఆయనకు మిగిలిందల్లా ఆరోజుల్లో సంపాదించిన పేరూ; ప్రతిష్ఠానూ. అంతమాత్రంచేత తిండీ గుడ్డా వొస్తాయా అంటారు? అది కొంతవరకే నిజం. ఎందుకంటే ఆయన బాగా బ్రతికిన రోజుల్లో ఆయనసహాయం పొందినవాళ్లు చాలా మంది ఎటుగూడీ వున్నారు. అందులో అందరూ విశ్వాసఘాతకులే ఉంటారా మరి? పుండరీకాక్షయ్య, వల్లభయ్యలాంటి ఒకరిద్దరు మంచివాళ్లు ఉంటారుగనుకనే, శివరామయ్య ఎంత దరిద్రుడయినా, అట్టే యిబ్బంది లేకుండా బ్రతకకలుగుతున్నాడు. అదైనా వాళ్లుచేసే సహాయమేగానీ, తనకుతానై ఆశ్రయించిందేమీ లేదు. చిత్రమేమిటంటే, చెడిబ్రతికినవాడైతే ఎక్కడయినా ఎందుకైనా చెయ్యి చాపగలడుగానీ; బ్రతికిచెడ్డవాడు ఆపని చెయ్యలేడు. శివరామయ్య అసలే చెయ్యలేడు. అంతేగాకుండా ఇతరులు తనను ఆస్థితిలో ఊహిస్తున్నారన్నా భరించలేని ఆత్మాభిమాని. కాబట్టే కన్నకూతురూ, గౌరవనీయుడైన అల్లుడూ, ఆయనను ఏనాడో ప్రాధేయపడ్డారు; మాదగ్గరకు వచ్చి వుండిపొమ్మని. పోనీ, కనీసం అమ్మనీ, తమ్ముణ్ణీ అయినా తీసుకెడతానని అనేకసార్లు అడిగింది సుగుణ.

ఆ సందర్భంలో మరొకళ్ళయితే నిరభ్యంతరంగా వెళ్లిపోయేవాళ్ళు. కాని, కాస్త దూరదృష్టీ, ఆలోచనా కలవాళ్ళు ఆ పని చెయ్యగలరా? శివరామయ్యలాంటివాళ్లకు అసలు సాధ్యంకాదు. అదీగాక, ఇక్కడనుంచి వలసపోయేటంత దరిద్రం ఏమున్నదిగనుక? పాతికమంది పిల్లలా? అప్పుల బాధలా? రోగాలా? ఏమున్నయ్? ఉన్న ఒక్కగానొక్క నలుసు, తనూ, తన భార్యాను. ఈ భాగ్యానికి ఇంత అనవసరపు ప్రయాసదేనికి? అని ఆయన అభిప్రాయం.

పిల్లవాడి చదువుసంధ్యలకా ఇప్పట్లో అట్టే ఇబ్బందిలేదు. తనకూ, పంతులు సత్యన్నారాయణకూ వున్న మంచితనంవల్ల ఒక్కదమ్మిడీ తీసుకోడు. ఆతరువాత అయినా హైస్కూల్లో చేర్చినప్పటిమాటకదా! ఆ సంగతి అప్పుడాలోచించుకోవచ్చు. చెడిబ్రతికినవాడికైతే రేపటిసంగతేమిటని ఇవాళే ఆలోచనగాని, బ్రతికిచెడినవాడికి, ముఖ్యంగా శివరామయ్యకు, ఎప్పటివిషయాన్ని అప్పుడే ఆలోచించడం అలవాటు. అందుకే ఆనాడే సుగుణకు మంచితనంగా నచ్చచెప్పి తప్పుకున్నాడు. అంతకుమినహా ఆయనకు మరోదారి నచ్చదు. ఎందుకంటే దరిద్రులయినంతమాత్రంచేత తనకున్న దారిద్ర్యాన్ని పదిమందికీ బహిర్గతం చేసుకోవాలని ఎక్కడా లేదంటాడు. జీవితావసరాలను వీలయినంతవరకు సంక్షిప్తపరచుకుంటే. ఆ సమస్యను తేలిగ్గా పరిష్కరించుకోవచ్చునంటాడు.

అయితే, ఇది ఎంతమందికి సాధ్యమవుతుందనేది వేరే విషయం. కానీ, శివరామయ్య వీలైనంత మేరా, ఆ పద్ధతినే ఆచరణలో పెట్టుకొంటున్నాడు. అయినా కొన్ని కొన్ని సమయాల్లో, ముఖ్యంగా—పండుగపర్వదినాల్లో; ఎంత ప్రయత్నించినా మనస్సులో ఏదో తపనగా వుండకపోవడం లేదు. ఇదివరకు బాగా బ్రతికిన రోజుల్లో అయితే, పండగ రావడం ఆలస్యం,

ఎంతో సంతోషంగా గడుపుకునేవాళ్లు. అంతదాకా ఎందుకు; సుగుణ పుట్టినరోజు పండుగలు ఎంతో వైభవంగా జరిపేవాడు. అంతే!

అవన్నీ ప్రస్తుతం ఏవో జ్ఞాపకాలుగానే వుండిపోయినయ్. తను దరిద్రుడైనంత మాత్రంచేత కాలం దరిద్రగొట్టు దవుతుందా? అయినా కాకపోయినా తనదారిన తాను పోతూనే ఉంటుంది. కనుకనే వొచ్చే పండుగకు సుగుణను తీసుకురావడమనేది చాలా పెద్ద సమస్యగా తయారయింది. ఏం చెయ్యడానికీ తోచదు. కూతుర్ను తీసుకొస్తే అల్లుణ్ణీ తీసుకురావాలి. వీళ్లిద్దరనూ తీసుకొస్తే, ప్రస్తుత స్థితిలో తను భరించలేడు. వాళ్లిద్దరినీ కళ్లలో చూసికూడా చాలాకాలమైంది. భగవంతుడు సరిగ్గా చూడలేదు గానీ, లేకపోతే, ఈపాటికి సుగుణ ఇద్దరుపిల్లల తల్లి కావలిసింది.

ఇలాంటి భావనలు మనసులో మెదిలినప్పుడల్లా ఎంతో కొంత బాధపడక తప్పదు! కన్నకడుపు తీపి ఎంత చెప్పుకున్నా తరగదుగదా మరి! అట్లాగని, తన మనసులోని బాధను నివృత్తి చేసుకోడానికి ఓ కార్డు ముక్క రాసిపడేస్తే, వాళ్లిద్దరూ వొచ్చేస్తారు. అయితే, సుఖంగా బ్రతుకుతున్న వాళ్ళను తాత్కాలికంగానైనా సరే ఈ దరిద్రంలో కాలు నిలపనివ్వడం తనకు మరింత బాధ. అందుకని ఎంత బాధైనా దిగమ్రింగుకోడానికే ప్రయత్నం చేసి, పోయిన రెండుమూడు పండగలకు మెదలకుండా వూరుకొన్నాడు. ఆ ఒకటి రెండు రోజులూ, వాళ్ళిద్దరూ, కళ్లల్లో కనుపిస్తూనే వున్నారు. అయితే, ఈ పండగకూడా అంతేనా అని మళ్ళీ దిగులు ప్రారంభమైంది.

ఏ ఆలోచనా తోచక, ఆ రాత్రి భార్య సుభద్రమ్మను పిలిచి ఈ సంగతే అడిగాడు. అంతా విని, "ఏం చేద్దామంటారు?" అనడిగింది సహజంగా. ఆమెమాత్రం అంతకంటే ఏమని చెబుతుంది? డబ్బు అనేది వుంటే దాన్ని ఖర్చుపెట్టే మార్గాలూ ఆలోచనలూ అనంతంగా వుంటయ్. ఏమీ లేనప్పుడు తెలివిగలవాళ్ల ఆలోచనలుకూడా మందకొడిగానే వుంటయ్ ఇట్లాంటి వాటిల్లో.

ఆ రాత్రి శివరామయ్య చాలాసేపు ఆలోచించాడు. ఆడపిల్ల అన్న తరువాత పుట్టింటికి అంతో యింతో ఆశతోనే బయలుదేరుతుంది. కానీ ఇది సుగుణ విషయంలో వర్తించకపోయినా, ఆడపిల్లను పుట్టింటి నుంచి వట్టి చేతుల్తో తిప్పి పంపడం తను సహించలేడు. తన జీవితకాలంలోనే ఒకరోజున ఎంతో వైభవంలో తన కూతురును అత్తవారింటికి పంపాడు. తిరిగి ఈ రోజున అదే ఆడపిల్లను వట్టిచేతుల్తో పంపడం బ్రతికి చెడవాని అంతరాత్మకు ఎంతమాత్రము నచ్చదు. ఏది యేమయినా ఈ స్థితిలో వాళ్ళను తీసుకురావడం మంచిదికాదనిపించింది. చాలా ప్రయత్నంమీద తనను తాను సమాధానపరచుకొన్నాడు.

అట్లా సమాధానపరుచుకొన్న అయిదవరోజున సుగుణ దగ్గర్నుంచి ఓ వుత్తరం వచ్చింది. ఆ వుత్తరాన్ని తాపీగా చదువుకున్నాడు. అందులో సుగుణ రాసిందేమిటంటే, 'వొచ్చే పండుగకు మేమిద్దరం బయలుదేరి వొస్తున్నా'మని రాసింది! రెండు మూడు నిమిషాలవరకూ ఆయనకు ఏ ఆలోచనా లేదు. ఆ వుత్తరానికి సంతోషించాలో, విచారించాలో కూడా అర్థం కాలేదు.

సరిగ్గా అదే సమయానికి బడినుంచి పరుగెత్తుకుంటూ వస్తున్న శంకరం ఒక్కక్షణం ఆగి తండ్రి చేతుల్లోని వుత్తరాన్నీ, ఆయన ముఖాన్నీ ఒక్కసారి పరిశీలనగా చూశాడు. నాన్న అట్లా ఎందుకున్నాడో అర్థంకాలేదు. అయినా అడగడానికి అట్టే సాహసించలేకపోయాడు. అదీగాక, శివరామయ్యే ఆత్మాభిమాని ఆయన కొడుకు మాత్రం అంతకంటే తక్కువ తిన్నవాడా ఏమిటి?

ఇదంతా గమనిస్తున్న శివరామయ్య ఆసక్తితో చూస్తున్న శంకరాన్నుద్దేశించి, "అక్క ఉత్తరం రాసింది" అన్నాడు సంక్షిప్తంగా.

ఆ ఒక్కముక్కతో వాడి చిన్నపెదవుల మీద చిరునవ్వు వికసించింది. వాడి దృష్టిలో పిప్పరమెంటు బిళ్ళలకంటే అక్కవుత్తరం చాలా కమ్మగావుంటుంది. చాలాకాలం తరువాత అక్కను గురించి మళ్లీ వినడం జరిగింది. వాడి పసిహృదయంలో, ఏనాలో నిక్షిప్తమయివున్న అక్క తాలూకు మధురస్మృతులు మళ్ళీ మెదిలినయ్. అంతేగాకుండా తల్లి తరువాత అలాంటి గౌరవనీయమైన స్థానం ఆ ఒక్క అక్కకే ఇచ్చాడు. అందుకే తన సంతోషాన్ని ప్రకటించుకొనేందుకూ, తను ఏదిచెప్పినా వినే తల్లిదగ్గరకు మళ్ళీ పరుగెత్తాడు.

"అమ్మా, అక్క ఉత్తరం ఎప్పుడురాసింది?. ఎప్పుడొస్తుంది? అందులో నాపేరుందా?" అనడుగుతున్నాడు.

వంటపనిలోవున్న తల్లికి ఇదేమీ అర్థంకాలేదు.

"అక్క ఉత్తరం రాయడమేమిటి, రావడమేమిటే?" అని అంటూ చెయ్యికడుక్కొని అసలు సంగతేమిటో కనుక్కుందామని బయలుదేరింది.

ఈలోగా శివరామయ్యే వంటగది దగ్గరకొచ్చి, వీడి ప్రశ్నలన్నీ వింటూనే వున్నాడు. భార్య ముఖం చూసి ఒక్కక్షణం ఆగి, "ఆఁ! సుగుణ ఉత్తరం రాసింది. వాళ్లిద్దరూ నాలుగైదురోజుల్లో వొస్తారుట" అన్నాడు.

ఆది విని ఆయనవేపు ఒక్కసారి మళ్ళీచూసి తల క్రిందికి దింపుకొన్నది. శివరామయ్య ముఖంకూడా నిండుకుండలాగా ఏ భావాన్నీ చిందనివ్వడంలేదు. వీళ్ళిద్దరినీ చూస్తున్న శంకరానికి ఇదేమీ అర్థంకాలేదు. అక్క వొస్తుందనే సంగతి, తనలాగ వీళ్ళకెందుకు సంతోషం కలిగించడంలేదో అతనికి తెలియదు.

అట్లా నిల్చున్న శంకరాన్నుద్దేశించి, "చూడు చిన్నా, అక్క నిన్ను బాగా చదువుకోమంది. నాలుగైదు రోజుల్లో వొస్తుందిట. ఆఁ!...సరేనా! పో ఆడుకో..." అని వీపుమీద తట్టి బయటికి పంపించాడు శివరామయ్య. మరికొంతసేపాగి, "నాకు తెలియకడుగుతాను...సుగుణకు రానురాను తెలివి తగ్గిపోతోందనుకుంటాను." అన్నాడు భార్యనుద్దేశించి నెమ్మదిగా.

ఆమె కీమాట చాలా కొత్తగా వినిపించింది. చిన్నప్పట్నుంచీ ఎంతో గారాబంగా చూసుకునే సుగుణను గురించి, ఆయన నోటిమీదుగా ఇట్లాంటి మాట వినడం ఇదే మొదటిసారి. రవ్వంత ఆశ్చర్యపడుతూ—"అదేమిటండీ, అట్లా అంటారూ?"అన్నది.

"మరి కాకపోతే ఏమిటి చెప్పూ—ఇట్లాంటి ఉత్తరం సుగుణ రాస్తుందని ఎప్పుడైనా అనుకొన్నావా? కనీసం రాసేప్పుడయినా ప్రస్తుతం మనస్థితి ఏమిటో జ్ఞాపకం రాలేదా అని," అన్నాడు కొంచెం చిరాగ్గా.

"సరే. మీరు చెప్పేది మరీబావుంది. ఇప్పుడంటే మనం దరిద్రులమైపోయామని, ఆత్మాభిమానంకొద్దీ బిడ్డలమీద మమకారాన్ని కూడా చంపుకొంటున్నాం గానీ, మనంత తేలిగ్గా వాళ్ళు నిగ్రహించుకోగలరా? పండగలకీ పబ్బాలకీ మనం తీసుకురావడం మానేశాం సరేసరి. తనకుతానై లక్ష్మీదేవిలా ఇంటికొస్తానన్నా మనం బాధపడడం దేనికి? దాన్ని చూసికూడా ఎన్నాళ్ళో అయిపోయింది. చిట్టితల్లి కళ్ళల్లో కనుపిస్తుంది" అన్నది దీనంగా.

ఆ చివరిమాట అనేప్పుడు ఆమెకళ్ళల్లో నిజంగానే నీరు తిరిగింది. చప్పున ఆమె తలవొంచుకొన్నా, ఈ సంగతి ఆయన గమనించకపోలేదు. రెండు నిమిషాలాగి ఆమెను సమాధానపరచే ధోరణిలో: "నువ్వనేది నిజమేననుకో. వాళ్లను చూడాలనే కాంక్ష నీకంటె నాకు ఇంకా ఎక్కువగానేవుంది. కానీ ఏంచేస్తాం చెప్పు. చూస్తూ చూస్తూ, ఈదరిద్రంలోకి వాళ్ళను ఆహ్వానించడం దేనికి? తీసుకొచ్చి మనం ఉద్ధరించే దేముంది? నీమటుకు నీవు ఎన్నడన్నా అట్లాంటిచీర కట్టుకున్నావా?" అనడిగాడు. ఆమె నోరెత్తలేదు.

"పిచ్చిదానా, బిడ్డలమీద మమకారం నీ ఒక్కదానికే కాదు. దరిద్రులమయినంతమాత్రంచేత మనకున్న దరిద్రాన్ని పదిమందికీ తెలియపరచుకోవలసిన అవసరమూ లేదు. నేననేదేమిటంటే, మనకంటె వాళ్ళు సుఖంగా బ్రతుకుతున్నారుగదా! వాళ్ళను అలా బ్రతకనిద్దాం. ఈ దరిద్రంలో వాళ్ళను మనం ఏంసంతోషపెట్టగలం? మన దరిద్రాన్ని వాళ్ళముందు మరోసారి పెట్టకోడం దేనికి? తీరా వాళ్ళను తీసుకొచ్చి, ఏరకంగానూ సంతోషపెట్టలేక, సిగ్గుతో తలవొంచుకుని, బాధతో విలవిలలాడిపోతూ కళ్ళనీళ్ళు పెట్టుకోడం దేనికి? ఈ అవస్థంతా ఎందుకు చెప్పు?" అనడిగాడు.

"అందుకని, కన్నబిడ్డను పుట్టింటికి రావద్దంటారా?" అన్నది చాలా ప్రయత్నంమీద, లోలోపల కుమిలిపోతూ. ఆయన ఆమాటకు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. ఒక్కక్షణం ఆగి, "చూడూ, నువ్వుకూడా అట్లా నిష్కర్షగా మాట్లాడితే ఏంచెప్పను? ఇంతకాలం కాపరంచేసిన నీకే నా అంతరాత్మఘోష అర్థంకాకపోతే, ఆ భగవంతుడికికూడా అర్థమవుతుందనుకోను. నువ్వనవసరంగా బాధపడకు. ఏదో బ్రతికినంతకాలం సుఖంగా బ్రతికాం, అయిపోయింది. ఆనాడు సుఖపడినప్పుడు గర్వపడిందీలేదు—ఇవాళ

చింతపడడమూ అనవసరం. లోకంలో మనమేనా; ఇంకెంతమంది లేరు? నువ్వు బాధపడి, నన్ను బాధించకు. సుఖాలు అనుభవించడానికి అందరూ ఇష్టపడతారు, సాయపడతారు. కాని కష్టాల్లోనే పరస్పరాభిమానాలూ—వ్యక్తిత్వాలూ బయటపడేది. రేపు సుగుణకు ఉత్తరం రాసిపడేస్తాను. అంతగా నీకు చూడాలనివుంటే, ఈ పండగకాస్తా వెళ్ళిపోయాక, ఏదో విధంగా నువ్వే వెళ్ళిరా" అన్నాడు.

ఆమె సమాధానం చెప్పలేదు. ఆయన ఇష్టాయిష్టాలకు వ్యతిరేకంగా చెప్పడం, ఆనాడు బాగా బ్రతికిన రోజుల్లోనే అలవాటు లేదు. ఇవాళ కొత్తగా ఆమె మారిందిలేదు.

పూర్తిగా నిండిన కళ్ళనీళ్ళు పైటచెంగుతో వొత్తుకుంటున్న ఆమె నుద్దేశించి "చూడూ, అన్నీ తెలిసిన నువ్వుకూడా అట్లాంటిపనే చేస్తే ఎట్లా? పండగరోజుల్లో నీలాంటి మనిషి నట్టింట్లో కూర్చుని కళ్ళనీళ్ళు పెట్టుకోవడం ఏమంత మంచిపనికాదు," అని అనగలిగాడే గాని ఆయన కళ్ళల్లో నీళ్ళు నిండకుండా నిగ్రహించుకోలేకపోయాడు.

* * * *

ఆ మరుసటిరోజున సుగుణకు వుత్తరం రాశాడు.

"చిరంజీవి సౌభాగ్యవతి సుగుణకు—

మీ నాన్న దీవించి వ్రాయునది. నీవు వ్రాసిన ఉత్తరం అందినది. ఒకప్పుడయితే అట్లాంటి వుత్తరం చూసి సంతోషించి ఉండేవాణ్ణి. కాని ఆ రోజులు గతించిపోయినయ్. నా జీవితంలో చివరిపాదం యింతదరిద్రంతో నిండి వుంటుందని నేనెన్నడూ అనుకోలేదు. నువ్వు పుట్టినప్పట్నుంచీ కాకపోయినా కనీసం ఊహ తెలిసినప్పట్నుంచీ నువ్వెంత గారాబంగానూ, సుఖంగానూ బ్రతికావో నీకు తెలుసు. చక్కగా చదువుకొన్నావు. భగవంతుడిచ్చిన అందచందాలతోపాటు, గుణవంతుడైన భర్త లభించాడు. నీ జీవితంలో చెప్పుకోదగిన ఒడుదుడుకులనేవి లేకుండా సుఖంగా బ్రతుకుతున్నదానవు. కాని నీ తల్లిదండ్రుల స్థితి నీకు భిన్నంగా వున్నదనే సంగతి నీకు బాగా తెలుసు. అట్లా తెలిసివుండి కూడా, నీవు వ్రాసిన ఉత్తరం చూస్తే నాకు నిజంగానే బాధకలిగింది. అదీగాక, నా అదృష్టాన్ని ఎంతమంది పంచుకొన్నా నేను చింతపడలేదు. కాని నా దురదృష్టాన్ని ఇతరులు కాదుగదా కనీసం కన్నకూతురైనా పంచుకోవడాన్ని నేనెంతమాత్రం భరించలేను. నేనెంత ఆత్మాభిమానినో నీకు తెలుసు. ఇతరులచేత వేలెత్తి చూపించుకోవడమనేది, నాకే కాదు, నా పూర్వులకూ కూడా లేదు. అటువంటివాణ్ణి, ప్రస్తుతం ఎట్లా కాలంగడుపుతున్నానో నీకు తెలుసు. ఈ ఉత్తరం నా మనసులోని బాధను కొంతవరకు వ్యక్తం చేస్తుందనుకొంటాను. అయినప్పటికీ, నీకు రావాలని వుంటే, నేనేమీ చెప్పలేను.

మీ అమ్మా-తమ్ముడూ బాగానే వున్నారు.

మీ నాన్న"

ఆ విధంగా రాసిన ఉత్తరాన్ని మళ్ళీ ఓసారి పూర్తిగా చదువుకొన్నాడు. తన మనసులోని అస్థిరత్వానికి ప్రబలమైన తార్కాణంగా కనుపించింది. సుగుణ రాసిన ఉత్తరంతో పోల్చి చూసుకుంటే, తను ఎంతకఠినంగా సమాధానమిస్తున్నదీ అర్థమయింది. దరిద్రం మనుషుల్ని తినేస్తే మిగిలిన అస్థిపంజరంలా అసహ్యంగా కనుపించింది. ఈ ఉత్తరం ఆ సుగుణ చేతుల్లో పడితే ఎంత ఘోరంగా, బాధతో విలవిలలాడిపోతుందో వూహించుకుంటే వొళ్ళు జలదరించింది. తల్లిదండ్రులమీది మమకారంతో దగ్గరకొస్తున్న బిడ్డను, కాళ్ళతో తన్నడంకంటే ఘోరమైన పాపం మరొకటి కనుపించలేదు. కసాయివాడి కత్తికీ, తన ఉత్తరానికీ ఆట్టే భేదమున్నట్టులేదు. వెంటనే ఆ ఉత్తరాన్ని నిలువునా, అడ్డంగా చీల్చి ముక్కలు ముక్కలుగా చేశాడు. గుర్తుపట్టడానికి వీల్లేకుండా నలిపి అవతల పారేశాడు. వెంటనే లోపలికివోయి, విచారంతో తల వొంచుకొని బియ్యంలో రాళ్ళు ఏరుకొంటున్న భార్యనుద్దేశించి, "నీకో మంచిసంగతి చెప్పనా?" అన్నాడు.

"ఏమిటి?" అన్నది ఆత్రంగా.

"సుగుణకు నేను ఏ ఉత్తరమూ రాయడంలేదు. రాసిన ఉత్తరం చింపేశాను. వాళ్ళిద్దరు తప్పకుండా వొస్తారు." అన్నాడు.

ఆమె చాలారోజులతరువాత మళ్ళీ యివాళ హృదయపూర్వకంగా సంతోషించింది. ఆక్షణాన తనభర్త శివరామయ్య, శివరామయ్యలా గాకుండా సాక్షాత్తు శ్రీమన్నారాయణమూర్తిలా కనుపించాడు ఆమెకు!

* * *

రాసిన ఉత్తరం ప్రకారం తెల్లవారితే పండగనగా సుగుణ తనభర్త జయరావుతో సహా వొచ్చింది. జట్కాబండిలో సామానంతా బండివాడు లోపల పెట్టాడు. వాడికి జయరావు ముందే డబ్బిచ్చి పంపేశాడు. లాంఛనంగా మామూలుమర్యాదలన్నీ జరిగినయ్. ఇంతకాలానికి కన్నకూతురును చూసేంతల్లి, తల్లితండ్రు లిద్దరూ సంతోషంతో కళ్ళు నీళ్ళతో నింపుకొన్నారు. ప్రొద్దుట్నుంచి ఎదురుచూస్తున్న శంకరం అక్క కొంగు విడవటంలేదు. ముందు వాణ్ణి మనసారా కౌగిలించుకొని ఒక్క ముద్దు పెట్టుకొంటేనే గాని ఆమెకు సంతృప్తి కలగలేదు.

"ఏంరా చిన్నా, ఇవాళ తల దువ్వుకోలేదేం?" అని పలుకరించింది కూడాను!

సంతోషంతో వాడు సమాధానం చెప్పలేక పోయాడు.

"ప్రొద్దుట్నుంచీ ఒక్కటే ఎదురుచూడటం! చద్దిఅన్నంకూడా తినలేదింకా" అన్నది తల్లి వాడి తరఫున.

సుగుణ తండ్రిదగ్గరగా తల వొంచుకు నిల్చుంది. ఆయన సంతోషం చెప్పనలవిగాకుండా వుంది. భరించలేక బొంగురుపోయిన గొంతుతో "బావున్నారా, అమ్మా..." అన్నాడు, అతిప్రయత్నంమీద తల నిమురుతూ.

"ఇంత చిక్కిపోయావేం తల్లీ?" అని వొళ్ళంతా తడువుతూ అడిగింది తల్లి.

రెండునిమిషాల తరువాత కొడుకునూ, కూతురునూ తీసుకొని లోపలికి వెళ్ళిపోయింది సుభద్రమ్మ.

శివరామయ్య అల్లుడుదగ్గర కూర్చుని; మంచి చెడ్డలు మాట్లాడుతున్నాడు. సందర్భవశాత్తూ:

"మీ పైఆఫీసరు మంచివాడేనా?" అనడిగాడు.

"ఓ, ఆయనకేం. యమధర్మరాజు. చాలా మంచి వాడే పాపం!" అన్నాడు ఛలోక్తిగా జయరావు.

శివరామయ్యకూడా సన్నగా నవ్వాడు. అదీ జయరావుకోసరం. మనస్సంతా ఇంట్లో వంటింటి చుట్టూ తిరుగుతూ వుంది. ఈ నాలుగురోజులూ గౌరవంగా బ్రతికి బయటపడటం ఎట్లాగా అనేది ఆయనకు గుండెల్లో పెద్ద బండగానే వుంది. రెండుపూటలా ఓవల్టీన్ గురించీ, టిఫిన్ గురించీ సందేహాలున్నయ్. ఉన్నబట్టల్లో ఇస్త్రీచేసిన దుప్పటి ఒక్కటికూడా లేదు. తలగుడ్డలుకూడా అంతంతమాత్రంగానే వున్నయ్. సబ్బులూ, పాలూ, పెరుగూ, నెయ్యి, యిత్యాదయః వాటినిగురించి మరీ సందేహంగా వుంది. తనింట్లో ఒక్క అల్లుడేగాని; వల్లభయ్యగారింట్లో ముగ్గురు అల్లుళ్ళు వున్నారు. అందులోనూ; మరీ పెద్దపెద్ద ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళు. విడిరోజుల్లో అయితే ఏదో ఒకరకంగా సర్దుకోవచ్చు. ఈ పండగరోజుల్లో అందరికీ అన్నీ అవసరమే. ఇట్లా అన్నిసమస్యలూ చుట్టూ ముసురుకొనివుంటే; ఏచింతా లేకుండా; వంటింట్లో కూర్చున్నది భార్య. ఏంచేస్తున్నదో తెలియదు.

ఇట్లా ఆలోచిస్తూ పరధ్యానంగావున్న మామ గారినిచూసి, "మీరు మరీ సన్నబడి పోతున్నారు. వొంట్లో బావుండటంలేదా ఏమిటి?" అనడిగాడు జయరావు.

"ఆఁ ఏంలేదు. బాగానే వుంటున్నది" అన్నాడు అప్రయత్నంగా.

"మరి ఏమిటి ఎప్పుడూ ఆలోచిస్తున్నట్టు కనుపిస్తారు?"

"ఏముంది ఆలోచించడానికి. ఏంలేదు" అని ఏదో ఒకరకంగా తప్పుకోడానికి ప్రయత్నించాడు.

కొంతసేపాగి, శంకరాన్ని పిలిచి, "పెందలాడే బావకు వేన్నీళ్ళు అవీ పెట్టమను. రైల్లో నిద్రా పాడూ సరిగ్గా వుండివుండదు. మధ్యాహ్నం అట్లా ఒక్క అరగంట నిద్రపోతే కొంత బడలిక తగ్గుతుంది. అన్నట్టు, అమ్మ వాళ్లు లోపల ఏంచేస్తున్నారూ?" అనడిగాడు. కాని శంకరం సమాధానంచెప్పకుండా లోపలకు పారి పోయాడు.

మామూలుకంటే అరగంట ఆలస్యంగా భోజనాలకు పిలుపువచ్చింది. స్నానాలుచేసి భోజనందగ్గర కూర్చునేసరికి, శివరామయ్యకు ఆశ్చర్యం కలిగింది. తను ఇంతవరకూ ఊహించనివిధంగా భోజనం వడ్డన జరిగింది. ఈ పిండివంటలూ, భోజనం, ఇదంతా ఎట్లా సమకూరిందో ఆయనకు అర్థంకాలేదు. ప్రతిదాన్నీ డబ్బుతో ఖరీదుకట్టేటయితే; ఇంత డబ్బు రహస్యంగా తాను ఏమూలా దాచిపెట్టలేదు. దీనికి మూలం ఏమిటో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు. భార్యను పిలిచి

అడగడానికా సమయంకాదు. ఏ ఆలోచనాలేని జయరావు నిరభ్యంతరంగా భోజనంచేస్తున్నాడు. తను మాత్రం ఎందుకు వెనకపడాలి? అందుకని శివరామయ్య మాట్లాడకుండా భోజనంచేశాడు. ఇంత సంతృప్తిగా తినికూడా చాలాకాలమయింది. కాని, ఆయనకా సంతోషంలేదు. ఏదో పెద్దదిగులు, మనస్సంతా కమ్ముకొన్నది. ఎవరినడిగేట్టు. భార్యకు ఇంట్లో పని తీరటం లేదు. అసలే భోజనాలు ఆలస్యం అయినయ్. మళ్ళీ జాగ్రత్తపడకపోతే, మధ్యాహ్నం కాఫీలుకూడా అంతే అవుతయ్. అందుకని శంకరంతోపాటు తల్లీ కూతుళ్ళిద్దరూకూడా ఒకేసారి భోజనానికి కూర్చున్నారు. తండ్రికీ, భర్తకూ మధ్యాహ్నం నిద్ర పోయేందుకు అంతకుముందే పడకలు సిద్ధంచేసింది సుగుణ. ప్రయాణపు బడలికతో జయరావు బాగానే నిద్రపోయాడు. ఏ నిద్రా లేకుండా అటూ యిటూ దొర్లిందల్లా శివరామయ్యే.

ఎంత ప్రయత్నించినా భార్యతో ఏకాంతంగా మాట్లాడే వీల్లేకపోయింది. దీనికితోడు సుగుణను చూడ్డానికొచ్చిన ఆమె పాత స్నేహితురాండ్రతో ఇల్లంతా మూడవతరగతి రైలుపెట్టెలా తయారయింది. తన ఇల్లు ఇంత సందడిగా కలకలలాడి ఎంతోకాలమయింది. నిజంగా ఇది హర్షింపదగిన సంగతే! కాని ఆయన మనసు ప్రతిదీ శంకిస్తూనేవుంది. కనుపించిన ప్రతి కొత్తదనాన్ని గురించీ ఇది ఎక్కడిది? ఎట్లా వొచ్చిందనే ప్రశ్నలు తలలో పేరుకొంటున్నయ్. వాటికి సమాధానాలు చెప్పేవాళ్లిమాత్రం ఆయనకు దొరకడంలేదు.

అట్లా పండగరోజు మధ్యాహ్నంవరకూ గడిచిపోయింది. భోజనాలవీ అయ్యాక, దక్షిణపుగదిలో మంచంమీద పడుకొని శివరామయ్య మళ్ళీ ఆలోచనలు మొదలుపెట్టాడు. పదినిమిషాలతిరువాత గదిలోకి ఎవరో అడుగుపెట్టిన చప్పుడయింది. అనుభవంవున్న మనిషిగనుక గమనించి "ఎవరదీ-సుగుణా!" అన్నాడు.

"నేనే నాన్నా..." అని తలవైపుగు వొచ్చి నిల్చుంది.

తల వెనక్కుతిప్పి సుగుణ ముఖాన్ని ఒక్కసారి చూసి, "ఇట్లారామ్మా, ఇక్కడ కూర్చో." అని మంచంమీద ఒకప్రక్కగా జరిగాడు.

తండ్రి పొట్టదగ్గర చిన్నప్పటి భయంతోపాటు వినయంగా కూర్చుంది.

"ఏమ్మా ఇట్లావొచ్చావు? అమ్మ ఏంచేస్తోంది?" అనడిగాడు.

"అమ్మ యింట్లో పనేదో చూస్తోంది..." అని ఒక్కక్షణం ఆగి "నాన్నా" అని ఆగిపోయింది.

సుగుణ ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నదని ఆయన గమనించి, "చెప్పమ్మా, ఏంకావాలి?" అనడిగాడు ఆప్యాయంగా. "ఏంలేదు నాన్నా. ఇంటిల్లిపాదీ అందరూ కొత్తబట్టలు కట్టుకొన్నారు. నువ్వుకూడా ఆ బట్టలు కట్టుకో నాన్నా. పండగపూట మీరొక్కరూ అట్లావుండిపోవడటం..." అని ఆపైన చెప్పలేకపోయింది.

శివరామయ్య మనస్సు ఒక్కక్షణం సముద్రంలా అల్లకల్లోలమైపోయింది. తను మొదట్నుంచీ ఏదైతే ఊహిస్తున్నాడో అదే నిజమై పూరుకున్నది. తన గారాబుబిడ్డ, సుగుణ. ఆమెను ఏమంటాడు? అనలేడు. ఆపని చెయ్యలేడు. ఆ రెండింటిమధ్య ఇరుక్కుపోయి, మళ్ళీ ఆలోచనలోపడ్డాడు. సుగుణ చేతుల్లోని కొత్తబట్టలు ఇంకా అల్లాగేవున్నయ్.

"నీకేంకావాలమ్మా అనడిగావుకదా నాన్నా. నాకింతకంటే ఏమీఅక్కర్లేదు. ఇంకేమీ అడగను నాన్నా." అన్నది గద్గదస్వరంతో. సుగుణ కళ్ళల్లో నీళ్ళునిండడం తండ్రి స్పష్టంగా చూశాడు. లోలోపల ఆయనహృదయం కుమిలిపోతున్నది. కనురెప్పలు రెండూ ఒక్కదగ్గిర చేరినప్పుడు అశ్రుబిందువులు చెవులుప్రక్కగా జారిపోయినయ్. "సుగుణా! భగవంతుడు నాకు మొదటిసారిగా ఆడపిల్లనే ఎందుకిచ్చాడో నాకిప్పుడర్థమయింది. నా జీవితంలో ఇట్లాంటిరోజు ఒకటున్నదనే సంగతి నేనెన్నడూ ఊహించలేదు. ఆ బట్టలు నేకట్టుకున్నందువల్ల నీకు సంతోషమేకలిగితే, తప్పకుండా కట్టుకుంటానమ్మా! పండగపూట కంటతడిపెట్టకు సుగుణా! నేనెంత దరిద్రాన్నయినా భరిస్తానుగాని; కన్నీళ్ళనుమాత్రం భరించలేను" అని తడీపొడిగావున్న ఆమెతల నిమురుతూ కళ్ళు తుడిచాడు.

ఇదేసమయమని, "మరొక్కమాట నాన్నా." అన్నది సుగుణ.

"ఏమిటమ్మా?" అన్నాడు తండ్రి వాత్సల్యంతో.

"ఈసారి నాతోపాటు తమ్ముణ్ణికూడా తీసుకెళ్తాను నాన్నా."

ఒక్క క్షణం ఆగి, "నీయిష్టం. నేకాదంటానా తల్లీ." అన్నాడు శివరామయ్య.

సుగుణ పెదవులమీద చిరునవ్వు చిందింది. "చాలు నాన్నా. ఇక నే వెళ్తాను. మళ్ళీ మీకు కాఫీల వేళవుతుంది. అమ్మవొక్కర్తే అవస్థపడుతున్నది." అని తండ్రి ముఖం మరొక్కసారి సంతృప్తిగా చూసి కొత్తబట్టలు అక్కడపెట్టి వెళ్ళిపోయింది.

అరగంటతర్వాత కొత్తబట్టలు కట్టుకొన్న శంకరం గదిగుమ్మానికి చాటుగా నిల్చొని; "నాన్నగారూ, అమ్మ కాఫీకి రమ్మంటోంది." అని దీర్ఘం తీస్తూ చెప్పి పారిపోయాడు. శంకరం అట్లా నిల్చొని చెప్పడానికి కారణం ఏమిటో ఆయన తేలిగ్గా ఊహించాడు.

కాఫీ త్రాగడానికి అవతలగదిలోకి వెళ్ళినప్పుడు, తనలాగే జయరావుకూడా కొత్తబట్టలు కట్టుకొచ్చాడు. ఆయనను చూడటంతోటే శివరామయ్యకు మళ్ళీ ఆత్మాభిమానం ముంచుకొచ్చింది. సిగ్గుతో కుంచించుకుపోయాడు.

తరువాత సుగుణ, శంకరంకూడా, కొత్తబట్టలతో వొచ్చి అక్కడే టిఫిన్ తిని ఓవల్టిన్ త్రాగారు. నిన్న మొన్నట్నుంచీ కళ్ళారా చూడ్డానికి వీల్లేకుండా తిరుగుతున్న శివరామయ్యభార్య సుభద్రమ్మ, ఇప్పుడు కొత్తచీర కట్టుకున్నా, కనుపించినట్టే కనుపించి మళ్ళీ వెనక్కుపోతున్నది. జయరావు ఆ యింట్లో వున్నంతవరకు ఆమె అంతే! ఎందుకంటే గౌరవనీయుడైన అల్లునిఎదుట స్వేచ్ఛగా అత్తగారు తిరిగే ఆచారం ఆ ఇంట్లో ఇంకా లేదు.

ఎట్లాగో ఆ కాస్త ఓవల్టిన్ తాగేసి ఆ గది లోనుంచి బయటపడ్డాడు శివరామయ్య. ఆ సమయం చూసుకుని భర్తనుద్దేశించి, "ఈ సంతోషానికంతటికి మూలం మీరేనని ఏమాత్రం ఆయనకు తెలిసినా, లజ్జతో కుమిలిపోతారు. ఇప్పటికే మీకు ముఖం చూపలేక వీలయినంతవరకు తప్పుకుంటున్నారు. బ్రతికి చెడిపోయిన అంతరాత్మను ఘోషపెట్టడం మనకు మంచిదికాదు." అని చెప్పింది సుగుణ.

ఆ తరువాత మూడో రోజున సుగుణ మళ్ళీ ప్రయాణమైంది. బండివాడి సహాయంతో సామాను బండిలో పెట్టించాడు జయరావు. శంకరం ముందుగానే బండిలో చేరాడు. సుగుణ ముందు తల్లిని సముదాయించి, "వెళ్ళొస్తా నాన్నా" అన్నది కళ్ళనీళ్లు తుడుచుకుంటూ.

శివరామయ్య లోలోపల కుమిలిపోతున్నాడు. తీవ్రమయిన ప్రయత్నంతో తనను తాను సంబాళించుకొని, "కన్నబిడ్డను పుట్టింటినుంచి వొట్టిచేతుల్తో పంపే దౌర్భాగ్యపుగీత భగవంతుడు నానుదుటగీశాడు" అని ఆ పైన అనలేక ఆగాడు.

సుగుణ తేరుకుని, చూడు నాన్నా, మీరు అట్లా దిగులు పడితే అక్కడకు వెళ్ళినా నాకు శాంతి వుండదు. ఇప్పటికే మీరు ఈ దిగుళ్ళతో చిక్కి సగమై పోతున్నారు. నాకేంకావాలి నాన్నా. పెట్టవలసినదంతా ఇదివరకే పెట్టారు. నేనేం పరాయిదాన్నా అదృష్టం కలిసొస్తే రేపు సుఖపడకూడదా"? అన్నది.

"లేదమ్మా లేదు. నాకలాంటి ఆశ ఏమీ లేదు. సిరీ, సంపదా శాశ్వతంకానిమాట నిజమే! కాని ఒక వ్యక్తి తాలూకు సాంఘిక విలువల్ని; పరువు మర్యాదలను అంతిమస్థాయిలో నిర్ణయించేటప్పుడు మన చుట్టూ వున్న సమాజం అతను చెడి బ్రతికినవాడా బ్రతికి చెడినవాడా అనే కొలతబద్ద తీసుకుంటుంది. అయినా, నా బ్రతుకేదో తెల్లవారి పోయింది. నా తరువాత వాడైన శంకరాన్ని రెండో కోవలో విడిచిపెడుతున్నాననే బాధ తప్ప మరేమీ లేదు. ఇంతకాలానికి మళ్ళీ మమ్మల్ని మనుషులుగా చేశావు. ఆడపిల్లలు పుట్టింటినించి అంతో ఇంతో తీసుకుపోతారు గానీ, ఒట్టి చేతుల్తో వెళ్ళరు. నాకా అదృష్టం..." అని ఆపేశాడు.

లోలోపల ఉండలుచుట్టుకుపోతున్న దుఃఖం అతన్ని నోరెత్తనివ్వలేదు.

"అదేమిటి నాన్నా, ఆడపిల్లలన్న తరవాత అందరూ పుట్టింటినుంచి దోచుకుపోయేవాళ్ళే వుండరు. పుట్టింటికోసరం దాచిపెట్టేవాళ్ళుకూడా వుంటారు."

"సుగుణా!" అన్నాడు తండ్రి, ఆమె తల నిమురుతూ—

## బ్రతికి చెడిన జీవి

మరొకసారి తల్లిదగ్గరకూడా సెలవుతీసుకుని యల్దేరింది సుగుణ.

రైలెక్కించి రావడానికి వాళ్ళతోపాటు శివరామయ్యకూడా బయల్దేరాడు. ఈ స్టేషనులో మొన్న మొన్నటివరకూ ఎక్స్‌ప్రెస్ కూడా ఆగుతుండేది. ఇప్పుడదీ మానేసింది. పాసింజరు తప్ప మరొకటి ఆగదు. అది ఇవాళ అరగంట ఆలస్యం. అయినా సరే, అంతవరకూ వుండి, వాళ్లను బండిలో భద్రంగావున్న చోటు చూసి కూర్చోపెట్టాడు.

రైలు ఇక కదులుతుందనగా, ఎంత ప్రయత్నించినా కళ్ళల్లో నీరు సుళ్లుతిరుగుతూనే వుంది. జయరావుకు ఎలాగో వీడ్కోలు చెప్పగలిగినా, సుగుణతో చెప్పడానికి నోరు రత్తలేకపోతున్నాడు.

"జాగ్రత్త సుగుణా! భద్రంగా వెళ్ళిరామ్మా!" అన్నాడు అతి ప్రయత్నంమీద. ఆయన పెదవులు అప్రయత్నంగా అదురుతున్నయ్.

"చిన్నవాడయినా ఇక్కడుంటే కొంత కాలం జరుగుతుండేది. ఇప్పుడు వాణ్ణికూడా నువ్వు తీసుకుపోతున్నావు" అన్నాడు దీనంగా.

"పోనీ, అంతగా బాధగా వుంటే, అమ్మను వెంటబెట్టుకొని మీరు కూడా ఓసారి రండి నాన్నా. మీ ఇష్ట మొచ్చినప్పుడు మళ్లీ వొచ్చేద్దురుగానీ" అన్నది సుగుణ పైటచెంగుతో కళ్లు తుడుచుకొని.

సుగుణ ఇంత చిన్నపని ఎంతదూరం ఆలోచించి చేస్తున్నదో ఈ క్షణానగానీ, శివరామయ్యకు అర్థం కాలేదు.

"అట్లాగేనమ్మా!" అన్నమాటను స్పష్టంగా అనలేకపోయాడు. కాని రైలు కదిలింది.



# జన్మకాలశోధనము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

జ్యోతిశ్శాస్త్రమువలని ఫల మేదైనా, అది ఎంత అయినా, స్పష్టలగ్న గ్రహాదులే దానికి ప్రధానమయిన ఆధార మని ప్రాచీనుల మతము.

"జ్యోతిశ్శాస్త్ర ఫలం సర్వం,
లగ్నాధీనం బుధైః స్మృతం;
స్ఫుట ఖేటాశ్రయం తత్తు;
తస్మాత్ ప్రాధాన్య మేతయోః."
(పితామహుడు)

స్పష్ట లగ్నమును సాధింపవలెనన్నచో, జన్మకాలము నికరముగా నుండుట తప్పనిసరి. అది శుద్ధము కానిపట్ల, దాని ఆధారముతో గుణించిన లగ్నాదులు, ఎంత నికరములైనా, మనకు వాని ఉపయోగము మట్టమే. ఏలందురా? మన భూమండలములో దిన మొకటికి అరువది వేలమందికి తక్కువ లేక జననములు కలుగుచున్నవని సంఖ్యాశాస్త్ర నిపుణులు అంచనా వేసియున్నారు. ఈ జననము లన్నియు భచక్రమందలి 360 భాగలలోనే జరుగవలయును. కనుక, సరాసరి ఒక భాగ లగ్నముగా నుండగల నాల్గునిమిషముల కాలములో 167 జననములు కావలసియుండును. అనగా, రమారమి నిమిష కాలములో ఈ ప్రపంచమున 42 మంది పుట్టుదురనుట! జన్మకాలము నికరముగా లేనిచో, దానికి గుణించిన జాతకము ఉద్దేశించిన వ్యక్తిది కాక, ఏ దేశములోనో, ఎచ్చటనో పుట్టిన ఏ ఇతర వ్యక్తిదో కాకలదు. కనుక, అపరిశుద్ధకాలమునకు కష్టపడి గుణించిన జాతక చక్రమువలన ఏ దేవునికి ప్రీతి? జాతకఫలములు కొన్ని అనుభవమునకు రాలేదని కొంద రనుకొనుట అందందు వినుచున్నారముకదా? ఎవరిదో జాతకమునకు ఫలము వ్రాయించుకొని, అది తనజీవితములో జరుగలేదన్నచో, అర్థమేమి? నాడీ గ్రంథములలోనున్న జాతక కథలు వ్రాయించుకొన్నవారు అవి తమవే అనుకొని సంతోషపడుటయు, కాలక్రమమున అందలి ఫలములు కొన్ని అనుభవమునకు రాకపోగా, శాస్త్రమును నిందించుటయు, అందందు చూచుచున్నాము. కారణము స్పష్టము.

జన్మకాలమును నిష్కర్షగా గమనించి గుర్తువేసుకొను సంప్రదాయము, ఏ కొన్ని సందర్భములలోనో తప్ప, సాధారణముగా, నేటికాలమున వాడుకలో లేకుండుట విచారకరము. కాలమునుగురించి మనకే శ్రద్ధలేనిచో, మంత్రసానికేమితీట? పగలు మూడుగంటల ప్రాంతములోననియో, రాత్రి రెండుగంటలపైగా అనియో, జన్మకాలములను అత్యంతస్థూలముగా చెప్పు అలవాటు సర్వసాధారణముగ నున్నది. ఇట్టికాలమునకే గుణించెడి జాతకములు వ్యర్థప్రయాస మన్నచో తప్పుగాదు. గంటలు నిమిషములలో గ్రంథస్థము గావించియున్న జన్మకాలములలో సైతము ఏదో కొంత వ్యత్యాసము చూపట్టుచుండును. మంత్రసాని కాలమును గమనించుటలో చేయు ఆలస్యము, గడియారములలో నుండు దోషము మొదలగు కారణములవలన ఎంత నికరముగా వ్రాసియుంచిన జన్మకాలమైనా, కొంత తేడాగా నుండుట అసంభవము కాదు.

కావుననే లగ్నశోధనపద్ధతులతో శుద్ధము కావించని జన్మకాలము అపరిశుద్ధముగా భావించవలయునని పరాశరుడు గంటవాయించి చెప్పెను. శోధనపద్ధతులు కొన్ని వాడుకలోనుండుమాట వాస్తవము. కాని, వానిలో అనేకములు విమర్శసహములు కావు. అతిస్థూలముగా లగ్నరాశినో, నవాంశనో సూచించుటకుమాత్రమే అవి ఉపయోగపడవచ్చును. 'ఉత్తరకాలామృతము'లో చెప్పబడిన మార్గమిట్టిదే. ఇక, 'గుళిక' స్థానమునకు కోణరాసులలో కాని, ఏరాశిలోనైనా 'గుళిక' నవాంశలో కాని, లగ్నము ఉండవలెనని 'ఫలదీపిక' చెప్పుచున్నది.

"గుళిక త్రికోణభేవా,

జన్మబ్రూయాత్, తదంశేవా." అని. ఒకానొకనాడు గుళికస్థానము మేషరాశిలో 2° భాగలో నున్నదనుకొందము. ఆదినమందు శిశు జననములు

మేష, సింహ, ధనుస్సులలో కాని, వృషభ, కన్యా, మకరములలో నాల్గవ నవాంశలో కాని, మిథున, తులా, కుంభములలో ఏడవ నవాంశలో కాని కలుగవలెననుట; కటక, వృశ్చిక, మీనములలో మేష నవాంశయే లేదు' కనుక, ఆ రాసులలో జననములు కలుగవని తేలును. సారాంశ మేమనగా, ఆనాటిజననములు భ చక్రపు 360 భాగలలో 110 టిలోమాత్రమే సంభవమనుట? దీనిని విశ్వసించుట కష్టము. ఇట్టివే మరికొన్ని పద్ధతు లున్నవి. వానికి ఉపపత్తి తెలియదు.

జన్మకాలమునుండి ఆధానకాలమును సాధించి, తన్మూలముగా జన్మలగ్నమును శుద్ధముచేయు పద్ధతి యొకటి 'బృహత్పరాశరహోర'లో కలదు. కాని, అది దురవగాహము. ఇట్టిదే మరియొక పద్ధతి 'మనుష్య జాతకము' నందున్నది. దాని ప్రయోగము దుర్గ్రాహ్యము. కాని, దీని నే పోలినట్టి సంప్రదాయ మొకటి 'ఆధాన కాలపద్ధతి' యను పేరున పాశ్చాత్య శాస్త్రవేత్తలలో వ్యాప్తికి వచ్చియున్నది. అనుభవములో దీనికి విలువ యున్నదని మనముసహా కనుగొనవచ్చును. అది యట్లుండె.

ఏ విధముగా శుద్ధపరచినాసరే, జీవితమందలి అనుభవ విశేషములను శుద్ధ లగ్నము నిర్దుష్టముగా చూపగలిగినచో చాలును. అటి సాక్ష్య మవసరము. స్థూలముగా వింశోత్తరీదశలుకట్టి ఈ భుక్తిలో ఈ అనుభవము వచ్చినదన్నచో చాలదు. ఈ భుక్తులు కొన్ని రెండు మూడు సంవత్సరముల కాలము వ్యాపించి యుండుటచే, ఇట్టి సమన్వయము అర్థము లేనిదగును. ప్రాణదశలుకట్టి అనుభవములను నిరూపించుమహానుభావులు, సామాన్యముగా, కానరారు.

పోనిత్తము. లగ్నము శుద్ధమైనచో, ఈ క్రింది పరీక్షలలో అది నెగ్గవలసి యుండును :—

ప్రశంసలో నున్న అనుభవము వివాహ మనుకొందము. అప్పుడు,

(1) వివాహము జరిగిన సంవత్సరమునకు దేవమానదశ, ఆ శుభకార్యమునకు తగిన దృష్టియోగములు చూపట్టవలయును ;

(2) ఏ నెలలో వివాహము జరిగెనో, ఆ నెలకు చలిత చంద్రుడు వివాహోచితమగు ఉత్తేజనమును చూపవలయును ;

(3) వివాహదినమునకు దైనిక జాతకమును సాధించితిమేని, కేంద్రములకు తగిన గ్రహ సంయోగము కానరావలయును.

4. స్పష్టరవి ఆధారమున ఆ సంవత్సరమునకు వర్షజాతకమును గుణించినచో, దానిలో వివాహ సూచక యోగములు చూపట్టుట అవసరము;

5. వర్షజాతక కేంద్రముల చలిత స్థానములు వివాహదినమునకు సరియయిన గ్రహసంబంధమును సూచించుట ముఖ్యము;

6. శుద్ధకాలమునుండి నికరమైన ఆధానలగ్నము సాధించుట సాధ్యముకావలసియుండును; మరియు; అటి ఆధానకాల చక్రము జీవితానుభవములకు తగిన దేవమాన దశలను చూపగలిగి యుండవలయును;

7. ఇట్టి శుద్ధలగ్నపు అధారమున సాధించిన సహమములు అనుభవములకు యోగ్యమగు దశలను సూచించగలుగుట ముఖ్యము.

జీవితములో ముఖ్యమైన అనుభవముల విషయమున పై రీతిగా సాక్ష్యము వచ్చిన నేతప్ప, లగ్నము శుద్ధమని భావించరాదు. ఆ లగ్నమునకు ఉపయోగించిన కాలము సహా విశ్వాసార్హము కాదు. శుద్ధముకాని జాతకము పిచ్చివానిచేతి రాయివంటిది.

కాని, సామాన్యముగా, జ్యోతిష్కులు వాడుకలో లగ్నశోధక కార్యమును నిరాదరించినారనియే చెప్పవచ్చును. అయినా, అది వారి దోషముకాదు. అనుభవములను గూర్చి ప్రశ్నించినచో, "గతము మాకు తెలుసు. భవిష్యత్తు మాత్రము చెప్పండి." అని ప్రతివచ్చుట సామాన్యానుభవము. సాధారణముగా, జ్యోతిష్కుల నాశ్రయించువారి లక్ష్యమంతే ! కాని, అనుభవమును స్పష్టముగా జాతకము చూపగలదని సాక్ష్యము లేనప్పుడు, భావి ఫలములకు దానిపై ఆధారపడుటలో ఏమి వివేకమున్నదో, భగవంతుని కెరుక. అనుభవములను విచారించి తెలుసుకొని, లగ్నశోధనము చేసి, స్పష్టకాలమును తేల్చుట అంత తేలికపనికాదు. మూడు నాలుగు దినములు ఈ పనిచేయుచు కూర్చున్నచో, జ్యోతిషమే వృత్తిగా నున్నవారికి జీవనయాత్ర జరుపుట దుస్తరము. ఒకటో రెండో, జాతకములకు దశాభుక్తి ఫలములను, రాజయోగములనుసహా, వ్రాసి దినమొక్కటికి అయిదో, పదో, రూప్యములను సంపాదించనిదే, ఆ సంసారులకు కథ జరుగదుకదా?

కొన్నాళ్ళనుక ఒకానొక చట్టాతేరపువ్యాపారి తన జాతకమునొక జ్యోతిష్కునికి పంపి అందొక పత్రము నిట్లు వ్రాసెనట!

"మూడుసంవత్సరముల క్రిందటిదాకా గొప్ప లాభాలు వచ్చి కథ బాగా జరిగినది. కాని, ఇటీవల వ్యాపారములో గొప్పనష్టాలువచ్చి, మునుగుదునో, తేలుదునో, అంతు తెలియ లేదు. మంచికాల మెప్పుడు వచ్చునో, ఎప్పుడు అప్పులు తీరి ఆస్తిచేయగలనో, దయచేసి త్వరగా చెప్పండి. ప్రస్తుతము తమకు పారితోషికము నిచ్చుస్థితిలో లేనని వ్రాయుటకు విచారపడుచున్నాను. కాలము బాగుపడిన తరువాతి నాకృతజ్ఞత చూపగలను." అని.

ఆ పండితుడిట్లు ప్రతి వ్రాసెనట:—"చాలా సంతోషము. తమ వాగ్దానమునకు కృతజ్ఞుణి. మొదట నా ఆయుర్దాయమును గుణించుకొని, తరువాతి నెమ్మదిగా తమ జాతకము ఫలములు వ్రాయ నారంభింతును. చిత్తగింతురు."

పరిస్థితు లిట్లుండగా, ఏశాస్త్రపద్ధతులు వికసింపగలవు? రాజాదరమును కోలుపోయిన విద్యకు ప్రజాదరమునయితము లభించకపోవుట శోచనీయము.

పోనిండు. శోధన పద్ధతులపై విశ్వాసముగల పాఠకమహాశయులకు ఉదాహరణమొక్కటి నివేదింతును.

ఒకానొకపురుషుడు 11.6-1919 నాడు 7-32 P. M. (I S T) లో దేహళీనగరములో జననమందెనట. (28°-40' ఉత్తరాక్షాంశ; 5-8'-48" పూర్వ రేఖాంశాకాలము.) ఇతని జీవితమునందలి విశేషము లివి:—

(1) 18-9-1945 నాడు జాతకుడు తుపాకితో శత్రువుల నిద్దరిని చంపుట;

(2) 10-4-1946 నాడు జాతకునికి ఉరిశిక్ష విధించబడుట;

(3) 27-4-1947 నాడు ఉరిశిక్షకు మారు ఆమరణ కారాగారవాసము విధించబడుట;

(4) 28-6-1954 నాడు జాతకుడు కారాగృహమునుండి విడుదల చేయబడుట.

* ఇతని నిరయన జాతకచక్రమిది:—

| | | | |
|---|---|---|---|
| | | కే 10-26<br>కు 18-42<br>ర 26-54<br>బు 26-55 | గు 25-57 |
| | (నిరయన)<br>—<br>జాతకము<br>— | | శు 10-48 |
| | | | శ 0-39 |
| లగ్నము<br>5-37 | చ 4-15<br>రా 10-26 | | |

ఈ చక్రమును చూచి జాతకుడు హంతకుడగునని చెప్పగలుగుట, ఏ దివ్యదృష్టి సంపన్నులకో తప్ప, ఇతరులకు నా దృష్టిలో అసాధ్యము. సాహసముకూడ విషయ మిప్పుడు తెలిసి యున్నది కనుక, ఏదో రీతిగా, సమన్వయము చేయుటకు ప్రయత్నించవచ్చును. అట్లు చేసిన వారు లేకపోలేదు. అష్టమాధిపత్యమువలన పాపి అయిన చంద్రుడు వ్యయస్థానములో నుండి, ఆరింటనున్న పాపగ్రహములగు కేతు, రవి, కుజ, బుధుల దృష్టి కలిగియున్న కారణమున, జాతకునికి హత్య చేయు మనస్తత్త్వము వచ్చినదట! పంచమ, భాగ్యాధిపతులగు కుజ, రవులు పాపులెట్లయిరి, అను ప్రశ్న వచ్చుట సహజముకదా? ఈ చిక్కు వదలించుకొనుటకు వారికొక ఉపాయము లభించినది. "నాడీజ్యోతిష" మను పేరున ఇటీవల ఒక క్రొత్తపద్ధతి అందందు ప్రచారములోనికి వచ్చి యుండుట చదువరు లెరుగుదురు. ఇది ఏ ఋషిప్రోక్తమో, తెలియరాదు. అది యొక చిదం

* బెంగుళూరు నగరములో, శ్రీయుత బి. వి. రామన్‌గారి సంపాదకత్వమున వెలువడుచున్న 'అస్ట్రాలాజికల్ మ్యాగజైన్' అను జ్యోతిష మాసపత్రికలో, 1956 మార్చి నెల సంచికయందు (281 వ పుట) ప్రకటితమైన శ్రీ మానిక్‌చంద్ జైన్‌గారి వ్యాసమునుండి ఈ అంశములు కృతజ్ఞతతో స్వీకరించబడినవి.

బర రహస్యము. ఈ పద్ధతి ననుసరించి, కుజనక్షత్రము మృగశిరలో రవి, బుధులుండుటచే, వారికి కుజుని తామసగుణ మబ్బినదట! ఈ కుజుడు అష్టమాధిపతి యగు చంద్రుని నక్షత్రమగు రోహిణిలో నుండుటం బట్టి దుష్టఫలప్రదుడయ్యెనట! ఈ సంబంధమువలన రవి కుజులుసహా దుష్టులైరట! కనుక, జాతకునికి హంతకత్వము వచ్చినదట! ఏమి ఈ ద్రావిడ ప్రాణాయామ కళాచాతుర్యము? ఈ సమన్వయ మెంతసమంజసమో, చదువరులే ప్రమాణము.

పుష్యమికి బృహస్పతి, మృగశిరకు చంద్రుడు, అధిపతులని వేదములు చాటుచున్నవి. కాని, వీరి సంప్రదాయములో, పుష్యమికి శని, మృగశిరకు కుజుడు, అధిపతులట! వింశోత్తరీదశాక్రమములో ఒక్కొక్క నక్షత్రమునకు ఒక్కొక్క గ్రహముదశానాథుడని చెప్పెదము కదా? ఆనక్షత్రమునకు ఆదశానాథుడే అధిపతియనుట ఈ సంప్రదాయ మందలి రహస్యము. సరేకాని, ఇతరములగు ఉడుదశలు, అనగా, అష్టోత్తరి, పంచోత్తరి, శతాబ్దిక, మున్నగునవి, పెక్కులున్నవికదా? వానిలో నక్షత్రములకు వేరు వేరు గ్రహములు దశానాథులగుచున్నారు. ఆ దశల ననుసరించి గ్రహాధిపత్యములను గ్రహించకూడదా? ఒక్క వింశోత్తరీ దశకు మాత్రమే ఈ విశిష్టాధికార మున్నదని ఎవరు నిర్ణయించిరి? కొన్ని జాతకములకు వింశోత్తరీ పద్ధతి అన్వయించుట పరాశర సమ్మతము కాదుకదా? అప్పుడేమి గతి?

"కృష్ణేతు రవిహోరాయాం
చంద్ర హోరాగతే సితే."

అని పరాశరుడు చెప్పుటచే, శుక్లపక్షములో రవి హోరలో జనించిన ఈ జాతకునికి వింశోత్తరీ దశ కట్టుటే అసంగతమగుచున్నది. దశయే లేనప్పుడు, అధిపతుల అధికారమెట్లు రాగలదు? ఈ పద్ధతిలో ఇన్ని చిక్కుసమస్యలున్నవి.

అది యట్లుండె. బుధ దశలో కుజాంతరములో జాతకుడు హత్య కావించెనట! తుపాకి గుండునకు కుజాంతరము తగియున్నదనవచ్చును. కాని, ఒక కష్టము.

"ఆయుర్దాయ విభాగశ్చ,
ప్రాయశ్చిత్త క్రియాతథా,
సావనేనైవ కర్తవ్యా,
శత్రూణా మప్యుపాసనం."

అని ప్రాచీన సూత్రము. దశలలో సంవత్సరమనగా, 360 దినముల 'సావన' సంవత్సరమే కాని, 365¼ దినముల 'సౌర' సంవత్సరముకాదు. ఈ పద్ధతిని అనుసరించియే, నెలకు 30 దినములని, ఏడాదికి 12 నెలలని, దశాశేషమును గణించుచున్నాముకదా, ఇట్లు లెక్కించినచో, హత్యాకాలమునకు కుజాంతరము పోయి రాహ్వంతరము నడచుచుండగలదు. ఇక కేతు దశలో, కేత్వంతరములో, గురువు విదశలో కారాగృహ విముక్తియట! 23-6-54 నాటికి కేత్వంతరమే యుండదు. గురు విదశ ఎట్లు నిలుచును?

పోనిండు. ఈ సమన్వయము నట్లుంచి, ఇచ్చిన జన్మకాలము శుద్ధమా, అది హత్యాదినమును సూచించగలదా, అని పరీక్షింతముగాక. 23-6-1954 నాడు సాయంకాలము 5-30 P. M. (IST) గంటలకు గ్రహస్థితి ఇట్లుండినది:—

| | | | |
|---|---|---|---|
| | | | వగుణ 17-15 |
| | సాయనము — హత్యాదినమునాటి గ్రహస్థితి | | కు 3-18<br>రా 5-17<br>శ 22.21 |
| కే 5-17 | | | యమ 11-1<br>శు 16-34 |
| చ 6-38 | | గు 4-1<br>ఇం 5-35 | బు 4-49<br>ర 20-19 |

ఉపదిష్టకాలపు ఆధారమున ఈ దినమునకు దైనిక కేంద్రములను గుణింతము.

| | | |
|---|---|---|
| ఉపదిష్టకాలము | ... | 7-32-0 P. M. |
| భారత కాలప్రమాణము (Standard) | ... | 5-30-0 |
| పోగా, నిలువ = గ్రీనిచ్చి మధ్యమకాలము | ... | 2- 2-0 |
| రేఖాంశకాలము | ... | 5- 8-48 |

| | |
|---|---|
| చేర్చగా, స్థానిక మధ్యమ కాలము (L. M. T.) | ... 7-10-43 |
| దీనికి గంటకు 10 సెకండ్ల వంతున ధనసంస్కారము | ... 0-1-11 |
| నాక్షత్ర కాలాంతరము | ... 7-11-54 |
| 13-9-1945 నాటి స్థానిక నాక్షత్ర కాలభుక్తి | ... 11-27-36 |
| దైనిక జాతకమునకు నాక్షత్ర కాలము | ... 18-39-30 |

ఈ కాలమునకు లగ్నపట్టిక గ్రంథము ననుసరించి దేహలీనగరమునకు దైనిక కేంద్రము లిట్లు రాగలవు :-

| | | |
|---|---|---|
| దైనిక దశమ కేంద్రము | ... 9°-6' | మకరము |
| దైనిక లగ్నము | ... 14°-3' | మేషము |

ఇపుడు మనము ముఖ్యముగా గమనించవలసిన సమస్య ఇది. హంతకధర్మముకల మన శత్రువు జాతకునికి జన్మకాలిక గ్రహములు ప్రసాదించినవని అనుకొందము. కాని, ప్రశంసాదినమునందే అతడు హత్యచేయ నేల? ఆనాటి గ్రహస్థితి ఇట్టి దౌరాత్మ్యము నుద్బోధించునట్టిది కాకూడదా, అనవచ్చును. మంచిదే కాని, అది సర్వమానవకోటికిని సమానము. ఇతనిని మాత్రము ఇట్టి కార్యమునకు ప్రేరేపించ నేల? జాతకగ్రహ స్థానములపైన కాని, ముఖ్యముగా జన్మకాలిక కేంద్రముల పైనగాని, తాత్కాలిక దుష్టగ్రహములు వచ్చిపడుట వలన అట్టి ప్రేరేపణము జరిగియుండవచ్చును. అందు రేమో? అట్టి సన్నిహిత సంబంధమేమియు మాపట్టకున్నది. కొన్ని భాగల దూరములో, ఏవో సమసప్తకమో సంయోగమో, కలదని తృప్తిచెందువారుందురు. కాని, ఇట్టి విషయములలో అట్టి దూరపు సంబంధము గవ్వకైనా కొరగాదు.

"ఏకాంశదృష్ట్యాతు దినే ఫలంస్యాత్,
యోగ స్తథైకాంశసమాగమోక్తిః"

ఇత్యాది ప్రాచీనసూత్రములను నిరాకరించుట మాత్రమునుకాని, ఫలమును సాధించలేము. ఫలప్రదగ్రహములతో ఆత్యంతిక సంబంధము (సంబంధము లన్నింటిలో సంయోగమే పటిష్ఠమైనది.) వ్యక్తియొక్క దైనికజాతకమందలి కేంద్రములకు వ్యాపించని దినమున విశేషఫలములు అనుభవమునకు వచ్చుట, సాధారణముగా, సంభవించదు. ఇదే దైనికజాతకమందలి విలక్షణ ధర్మము.

క్రూరుడగు యముడు జన్మకాలములో కర్కాటక రాశిలో 5°-42' లో నుండెను. హత్యాదినమున రాహు సంయోగము మాత్రము కాక, ఇంద్రునికేంద్రవేధ సహా ఈ యమునికి వచ్చినది. ఇట్టి యముని సమసప్తకవేధ మకరరాశిలో 5½ వ భాగకు ఉన్నది కదా? ఇంతేకాదు. మూలానక్షత్రపు విషనాడి మకరరాశిలో 5°-11' నుండి 6°-6' వరకు నుండినది. ఇట్టి పరిస్థితులలో దైనిక దశమము మకరములో 5½° భాగకు వచ్చియుండెనేని, ఆనాడు జాతకుడు క్రూరకార్యమునకు పూనుకొని యుండుట అసంభవము కాదు. ఇది తప్ప సమీపములో వేరు గ్రహసంబంధ మేదియు కానరాకున్నది. కనుక, దైనిక దశమకేంద్రము ఆనాటి కేతువుపై నుండితీరవలెనని మనము భావించవలసి యున్నది. అనగా, 4½° భాగల పట్టు అది వెనుకకు జరుగవలసి యుండుననుట. ఈ ఉపపత్తి నాశ్రయించి జన్మలగ్నము ధనుస్సులో 20½° భాగలో ఉండవలయునని ఏర్పడగలదు. (లగ్నపట్టిక గ్రంథము చూడుడు.) (*)

ఇది ఆధారముగా నుంచుకొని, ఆధానకాల పద్ధతిని ఉపయోగించుట తరువాతి కార్యము. శుక్లపక్ష చంద్రుడు దృశ్యార్ధ గోళములో నిర్లింగ భాగలో నుండుటయు, లగ్నము పుల్లింగ భాగకు వచ్చియుండుటయు, కారణముగా, ఆధానదినము 13-9-1918 అనియు, ఆధానకాలము 9-45 P. M. (I. S. T.) అనియు ఏర్పడుచున్నవి. ఈ పద్ధతివలన ధనుస్సులో 20°-39' జన్మలగ్నమగును. కనుక, శుద్ధమయిన జన్మకాలము 7-19'-8'' P. M. (I. S. T.) కాగలదు. ఉపదిష్ట కాలముకంటే ఇది 13 నిమిషములు వెనుకకు జరిగినదనుట. దీనిలో గొప్ప అసంభవము లేదు. ఎట్లయినా, జీవితానుభవములకు సరిపడగల జన్మకాలమిది. మన ప్రకృత సమస్యకు ఇంత చాలు.

---

(*) Raphaels' "Tables of Houses for Northern latitudes" అను పట్టికగ్రంథము నుండి ఈ లగ్నదశమములు ఏ అక్షాంశకైనా సులభముగా సాధించవచ్చును.

ఈ శుద్ధకాలమునకు సాధించిన స్పష్టకుండలి ఇందున్నది:—

| | | | |
|---|---|---|---|
| వరుణ 1-42 (వ) | హత్య 7-39 | పుణ్య 27-26 | శే ?-9<br>శు 11-24<br>ర 19 34 34<br>బు 19-30 |
| | సాయనము<br>—<br>శుద్ధ స్పష్ట<br>జన్మకుండలి<br>— | | యమ 5-42<br>గు 19-39 |
| | | | శు 3-24<br>ఇంద్ర 7-19<br>శ 23-22 |
| కారాగృహ 28-49<br>I 20-39<br>క్రౌర్య 12-38<br>కర్మ 12-29<br>రా 3-9 | న్యాయ 20-30<br>చ 26-21 | X 3-28<br>శత్రు 8-41 | |

మనః కారకుడగు చంద్రుడు వృశ్చికములో నున్నాడు. జాతకుడు క్రూరకార్యములు చేయుననియు, పాపములు దాచుననియు వరాహమిహిరాచార్యుని మతము. రాజదండన వలన ధనము నష్టమగుననుఫలము కల్యాణవర్మ జోడించినాడు. ఈ చంద్రునికి అష్టమ (మృత్యు) భావాధిపత్యమున్నది. ధర్మస్థానమందలి శనినుండి ఇతనికి కేంద్ర శత్రుదృష్టి. అధర్మ ప్రవర్తనమువలన బంధనము కలుగునని తెలుపు యోగమిది. రవి, కుజ, బుధులు సప్తమకేంద్రములో నున్నారు. విరుద్ధ ధర్మాచరణము, కార్పణ్యము, నిర్దయత, క్రూర స్వభావము, దీనికి ఫలమనుచున్నాడు పృథుయశస్సు.

"రవి కుజ బుధ యోగోయం,
విరుద్ధ ధర్మాన్వితం, విదేశరతం,
కృపణం, దయావిహీనం,
స్యాత్ ధననాశ దుఃఖసంతప్తం"
[హోరాసారము]

దశమాధిపతియగు శుక్రుని అష్టమస్థితి వలనిఫలము దుష్టస్వభావమట! లగ్నాధిపతి (గురువు) సైతము అష్టమభావమందే కలడు. మహాక్రోధము, కుమార్గద్రవ్యార్జనము దీని ఫలమని పరాశరుడు చెప్పెను. ఇవి అన్నియు జోడించితిమేని, క్రూరస్వభావము, క్రోధము, దయావిహీనత, ధర్మభ్రంశము, పాపకార్యాచరణము, రాజమూలక ధననాశనము మున్నగు గుణములు సూచితము లవవచ్చునుకదా? కాని, లగ్నాధిపతి అష్టమస్థితికి, సప్తమాధిపతి (బుధుని) సప్తమస్థితికి సహా, ఇతర దుర్గుణము లెట్లుండినా, దీర్ఘాయుస్సు ఫలమగుట జాతకుని భాగ్యము.

పైయోగములు ఎంత దుష్టములైనా, అవి జాతకునియందు హంతకస్వభావమున్నదని చూపుట కష్టము. అధర్మమార్గమున క్రూరకార్యమేదైనా చేసి, కారాగృహవాసన మాడవచ్చునుగదా?

ఇచటనే సహమబిందువుల వైశిష్ట్యము. ఒక్కొక్క భావమునకు కారకత్వము లనేకములున్నవి కదా? దశమభావమునకు కర్మస్థానమని పేరు. కాని, ఉద్యోగము, అధికార గౌరవము, కీర్తి, అంతస్తు, పితృభాగ్యము, మొదలగు అనేక విషయములను ఈ భావము తెలుపగలవని ఎరుగుదుము. ఇన్నింటిలో, జాతకుని కర్మస్వభావ మెట్టిదో, కీర్తి ఏపాటిదో, అధికారగౌరవ మెంతటిదో, మున్నగు విశేషాంశములను కనుగొనుటకు ప్రత్యేకాధారములు కావలసియున్నవని సులభముగా గ్రహించగలము. ఇట్టి ప్రత్యేకాంశములను సూచించి, భావములకు సహాయపడు బిందువులే "సహమ"ములు. తాజక శాస్త్రవేత్తలయిన మన ప్రాచీనులు వీని ప్రయోజనమును బాగుగా గుర్తించి విపుల పరిశోధనముచేసిరి. వీని సహాయములేనిదే మనచర్చ సంపూర్ణముకాదు.

జాతకచక్రములో 'కర్మ' సహమమును చూతుము. ఇది 'క్రౌర్య' సహమముతో చేరుకొని లగ్నమందున్నది. కుజుని సమసప్తకదృష్టివలన ఈ బిందువులు తైక్ష్ణ్యమును సంపాదించుకొన్నవి. అర్థము స్పష్టమే. 'కారాగృహ' సహమము సయితము లగ్నమందే కలదు. చోద్యమేమనగా, 'కర్మ' సహమమునకును, 'కారాగార' సహమమునకును, సరిసదుమ లగ్నము తులాభారము తూగుచుండుట గమనించదగినది. క్రూరకార్యము, కారాగృహయాత్ర, ఇవి లగ్నమును (అనగా, వ్యక్తిని) ఆశ్రయించియే ఉన్నవనుట కాదా?

కాని, దీనివలననే జాతకుడు హత్యచేయుననుట సాహసము. 'హత్యా' సహమమున వేరొక బిందువు

కలదు. మేషరాశిలో ఆ సహమమున్న భాగ (8°) మహా క్రూరమైనది. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు దీనికి "చావు బ్రదుకుల"భాగ అని నామకరణము చేసినారు. మన ప్రాచీనులు దీనిని "మృత్యుభాగ" అని వ్యవహరించారు. ('హోరామకరందము' చూడుడు) మాయలమారి అగు ఇంద్రుడు మృత్యుస్థానమున కూర్చుండి స్నేహదృష్టితో దీనిని, భుజము తట్టుచున్నాడు. 'క్రౌర్య' సహమమును నేరుగా ప్రేరేపించుచున్న కుజుడే ఈ 'హత్యా'సహమమునకు సయితము అధిపతి! ఈ సహమమునకు ఎట్టఎదుట (180°) 'శత్రు' సహమము కలదు. ధర్మస్థానమందలి శనినుండి 'శత్రు'సహమమునకు అర్థకేంద్ర, 'హత్యా'సహమమునకు సార్థకేంద్రవేధ! శత్రుజయమును కాంక్షించి, క్రూరకార్యమును హత్యకావించి, ధర్మభ్రంశము పాలై జాతకుడు కారాగృహవాసము చేయగలుగునని సూచన కాదా? నాడీ జాతకపద్ధతుల డొంకతిరుగుడు కార్యకారణ సమన్వయముకంటే, ఇది సమంజసముకదా!

పై యోగములకు వాస్తవముగా విలువ యున్నచో, దేవమానవశలో హత్యాకాలమునకు తగిన ఉత్తేజనము చూపెట్టకలరా? అనవచ్చును. చూడుడు.

దశమకేంద్రముపైన యాజమాన్యము శుక్రునిది. సాధారణముగా, ఇట్టి ఘోరకార్యాచరణమునకు కావలసిన మనస్తత్త్వము శుక్రునికి లేదు. 1945 లో దశమకేంద్రము చలించి వృశ్చికరాశిని ప్రవేశించుటచే, కుజునికి దీనిపై అధికారము వచ్చినది. చాలదని, చలిత కుజుని నిండు త్రికోణదృష్టి బలముతోనే ఇది వృశ్చిక ప్రవేశముచేయుట. బలముపట్టి సాధించుట వృశ్చిక ధర్మము. చోరవ, క్రౌర్యము, శౌర్యము, బలము, క్రోధము, మొదలగు గుణములు ఈ కేంద్రమునకు ఇపుడు వచ్చినవి. ఇట్టి పరిస్థితులలో మూడింట (పరాక్రమస్థానమునందలి) వరుణుని త్రికోణదృష్టిసహా దీనికి లభించెను. "ఏకైక మప్యనర్థాయ." అనిపించు యోగములివి. దురదృష్టమా, అన్నట్లు, 'శత్రు' సహమము చలించి అప్పుడే ఈ చలిత దశమకేంద్రమును చేరుకోవలయునా? ఇది శత్రువులపై దండయాత్ర కాక వేరేమి? చలిత బుధు డప్పుడే ఇంద్రునితో చేరుకొని కోణదృష్టితో 'హత్యా' సహమమును ప్రేరేపించినాడు. కార్యసాధనమునకు కావలసిన యుక్తి, తంత్రజ్ఞత, అలవడినవి. 'కర్మ', 'క్రౌర్య' సహమములు చలనవశమున అప్పటికే నికరముగా యముని సమసప్తక వేధను, పొంది దుష్టములగుట. చలిత 'సంకల్ప' సహమమును క్రూరమగు కేంద్రదృష్టితో చలిత కుజుడపుడు ప్రబలముగా ఉద్బోధించినాడు. ఇంకేమి కావలయును?

నాటకరంగ ప్రసాధనము పూర్తిఅయినది. పాత్రధారులు సిద్ధముగనున్నారు. నాందీ ప్రస్తావన మాత్రమే కొదవ. 6-9-1945 నాడు పర్వము (అమావాస్య) 1-43'-26'' P.M. (G. M. T.) లో కన్యారాశి 13° లో పడి, 'క్రౌర్య', 'కర్మ' సహమములను కేంద్రదృష్టిచే ప్రేరేపించినది. ఆనాడు బుధుడు చలిత శనిపై, శుక్రుడు ఇంద్రునిపై కుజుడు చలితకుజునిపై, వహుముకట్టి నిలిచి, కార్యరంగమునకు ఆయత్తపడి యుండిరి. ఇంద్రుడు యముని కేంద్రములో నుండి ఆసహమములను చెలరేగించినాడు. నాందీ ఘంటారావమును ఈపర్వము సమకూర్చెను. యవనిక ఎత్తుటే ఆలస్యము.

ఈపర్వక్షణమున డేహాలీనగరమున దశమ కేంద్రము ధనుస్సు 28½° భాగలలో, లగ్నము మీనరాశి 27½° భాగలలో ఉండినవి. అనగా, రవిచంద్ర సంయోగ ఘర్షణమువలన ఆకాశరంగమునందు వెలువడిన ప్రచండశక్తి భచక్రమందు ఆప్రత్యేక భాగలలో కేంద్రీకృతమయి యుండెననుటె! దశమ కేంద్రము 'కారాగృహ' సహమస్థానమునే ఆశ్రయించి యుండుట పాఠకమహాశయులు గమనించియుందురు. కారాగృహరంగము సిద్ధమై ఆహ్వానించుచున్నది. కాని, 'పర్వపు' కేంద్రము వ్యక్తిజాతకమునందు అనుకూలస్థానమును చేరుకొనుదాక యవనిక ఎత్తబడదు. దశమకేంద్రము దైనికచలనపద్ధతితో చలిత 'క్రౌర్య', 'కర్మ' సహమములను స్పృశించనిదే, కార్యము జరుగనేరదు. ఈస్పర్శ ఎన్నటికి సిద్ధమగునో, చూతము.

| | గం ని |
|---|---|
| మకరము 5° దశమ కేంద్రములో నుండగల నక్షత్రకాలము | 18—21 |
| పర్వకాలము P. M. (L. M. T.) | 6—52 |
| నాక్షత్ర కాలాంతరము ... | 6—53 |
| నిలువ, నాక్షత్రకాల భుక్తి ... | 11—28 |

# జన్మకాల శోధనము

ఈభుక్తి ఏనాటిదో, నాటికే అట్టి స్పర్శ కలుగగలదు. పంచాంగము (అనగా, ఎఫెమెరిస్సు) చూచితిమేని, ఈభుక్తి నికరముగా 13-9-1945 నాటిదేయని చూడగలము. హత్యాదిన మదేకదా? దశమకేంద్రము మకరరాశి 5° లో నుండినపుడు, పర్వలగ్నము ఎచటనుండెనో, పరికింపుడు. నికరముగా, మేషరాశిలో $7\frac{1}{4}°$ భాగలో అది నిలిచియుండగలదు! జాతకములో 'హత్యా' సహమస్థానమందే! హత్య జరిగినది. ఏల జరుగదు? కాలపురుషుని అప్రమేయ శక్తి అది! ఇది 'కాకతాళీయ' మనగలమా?

'మామూలు' వింశోత్తరీపద్ధతితో చేయు సమన్వయముకంటె, ఈ పద్ధతిలో మెరుగున్నదో లేదో తారతమ్యమును చదువరులే తేల్చుకోగలరు.

10/11-6-1945 నాడు 2-28'-49'' గంటలకు (Am. I. S. T.) వర్షప్రవేశములు. అప్పటికి వర్ష జాతకమును గుణించిచూడుడు. 'హత్యా' సహమాధిపతియే లగ్నాధిపత్యంవహించి, లగ్నమందే నిలిచి సన్నద్ధుడైనాడు. చంద్రుడు సహమతేజస్సును గ్రహించి సహమాధిపతికి అందిచ్చుచున్నాడు. 'కారాగార' సహమము లగ్నాధిపతి కేంద్రమునే అభిలషించుచున్నది. ఈ యోగములు చాలు. దశనాథపతియు, 'కారాగృహ' సహమాధిపతియు నగు శనియొక్క వార్షికదశలోనే యీ కార్యము జరుగుట!

హత్యాదినమునకు దినజాతకమును గుణించినచో 'హత్యా' సహమాధిపతిని కేంద్ర దృష్టిచే ప్రేరేపించుచున్న వరుణుడు లగ్నమందే యుండెనని చూడగలము. 'హత్యా' సహమాధిపతి తేజస్సును గ్రహించి చంద్రుడు లగ్నాధిపతికి అందిచ్చుచున్నాడు. ఇంకేమి కావలయును?

గ్రంథవిస్తరభీతిచే వార్షిక, దైనికచక్రముల నీయనైతిని. కాని, సాధించిన ఆధానకాలము సత్యమైనచో ఈ అనుభవములకు బీజము అందుండవలదా? అని సందేహించువారి తృప్తికొరకై ఆధానకాల చక్రము నిచ్చి చాలింతును. ఈ ఆధానకాలచక్రమున పరాక్రమ భావాధిపతి చంద్రుడు మృత్యుభావములో వున్నాడు. చతుర్థాధిపతి రవినుండి పరిపూర్ణ కేంద్ర వేధ ఈ చంద్రునికి. ఇది అధమయోగమని వరాహమిహిరుని మతము. సప్తమభావమందున్న సప్తమాధిపతి కుజుడు శత్రుబాహుళ్యమును, శత్రుచయమును సూచించగలడు. 'హత్యా' సహమము, 'సంకల్ప' సహమము సహా, ప్రబలకుజుని ఏలుబడిలో నున్నవి. అందులో, "అపరిహార్య పురాకృత దుష్కర్మఫలమును" సూచించు దుష్టభాగలో ఈ 'హత్యా'

| | | | |
|---|---|---|---|
| | | కారాగృహ 14-36<br>I 26-21 | కే 17-30 |
| వరుణ<br>24-47 (వ)<br>X 10-31 | ఆధానకాల<br>కుండలి<br>—<br>(సాయనము)<br>— | | యమ 6-28<br>గు 11-54 |
| | | | ఇంద్ర 8-23<br>కర్మ 10-36<br>శ 22 13<br>పుణ్య 26-58 |
| చ 20-40<br>రా 17-30 | సంకల్ప<br>5-22<br>కు 17-51<br>హత్య29-15 | | శు 1-48<br>బు 3-37<br>ర 20-3 |

సహమము 'తిష్ఠ' వేసియుండుట! ప్రబలగండాంత ప్రదేశమది. లగ్నాధిపతి శుక్రుడు దుర్బలుడు (నీచ). 'హత్యా'సహమము అతని కేంద్రమునే అభిలషించుచున్నది. 'పుణ్య' సహమమునకో, వ్యధికరణశాలి వరుణునికి సమసప్తకవేధ! ఉద్యోగాధిపతి శనికి యమ, వరుణుల క్రూరదృష్టివలన ప్రోద్బలమున్నది. క్రూరబుద్ధి, క్రూర కార్యాచరణము, శత్రుఘర్షణము, హత్యల సంబంధము, ప్రారబ్ధ పరిపాకపు ఫలములని ఈ చక్రము చూపుచున్నది కదా?

ఈ సహజధర్మములను జన్మకాలగ్రహభావస్థితి ఎట్టిసౌకర్యముల నొసగించినదో, చదువరులు పరిశీలించెదరు గాక. మరియు, ఆధానకుండలికే దేవమాన దశలు సాధించిరేని, హత్యాకాలమునకు తగిన ప్రారబ్ధ పరిపాకమును చూపు దశావిశేషములను చిత్రించగలరు.

విశేషమేమన, ఆధానకుండలికే హత్యాదినము నాటికి దైనిక జాతకమును సాధించితిమేని, దైనిక దశమము కుంభములో 11° భాగకు రాగలదు. 'కర్మ' సహమముపైన యముడు సాక్షాత్తుగా ఆవాహనమైనాడు, అతనికి నిండు సమసప్తక స్థానములోనే ఈ కేంద్రము నిలిచియుండెనని గమనించిరేని, పాఠక మహాశయులు ఆశ్చర్యపడక మానరు.

లగ్నశోధనమునకు ఎంత విలువయున్నదో సోదాహరణముగ చూపుటకొరకు మాత్రమే ఈ విమర్శనమని మనవి.

"కాలోహి దురతిక్రమః"

# నవ్వుటాలకు

"ఉత్తమ్"

## పాత్రలు:

ప్రసన్నకుమార్

అవతారం

శరత్

### రంగము: 1

* * గదిలో ఒక బల్ల, దానిమీద అలారం టైంపీసు. ప్రక్కగా రెండు కుర్చీలు. ఒక మడతమంచం, దాని ప్రక్కగా ఒక పడకకుర్చీ. గోడకు 18 వ తారీఖు శనివారం అని చూపించే కాలెండరు.

శరత్ : (సంతోషంగా చదువుతాడు) అన్యస్త్రీలను కన్నెత్తిచూడని ప్రభాకర్‌ను వాడియైన శరములవంటి నీ వలపుచూపులతో బందీకృతుని చేసి నీ ఒడిలో చేర్చుకొంటివి. నీ కౌగిటిలో నేను నా జీవితభార మంతటిని మైమరచితిని. ప్రప్రథమముగా నీ హృదయమున హత్తుకొని స్వర్గతుల్యుడనైతిని. హో... ఎంతబాగుంది! - బ్రహ్మాండంగా రాసేశాను.

[అవతారం ఆనందంతో ఓలలాడుతూ హుషారుగా వస్తాడు. ఆ హుషారులో రచనలో మునిగితేలుతున్న శరత్ చేతిలోవున్న కాగితంతీసి బల్లమీద పారేస్తాడు.

అవ : ఒరే! శరత్ —మేరేజ్ కి వస్తావా?

శర : ఏం మేరేజ్ రా ?

అ : గ్రాండ్ ఎక్సలెంటయిన మేళాలతో గుమ్మగా ఉంటుంది.

శ : గ్రాండ్ ఏమిటి? ఎక్సలెంటేమిటి? అసలు ఎవరి పెళ్ళి? ఎక్కడ? ఎప్పుడు? అవేమీ చెప్పకుండా యేమిట్రా నీ హడావిడి.

అ : అదేమిట్రా! అంత తేలిగ్గా తీసేశావ్ ? ఎవరిదో పెళ్ళయితే నేనెందుకు చెబుతాను?

శ : అయితే మీ అక్కదా, అన్నదా, మరెవరిదన్నా వా?

అ : ఒరే! నీది పట్టి మట్టిబుఱ్ఱ. నీకు లోకజ్ఞానం సున్న. వ్రాస్తావు పెద్ద రచయితలాగ కథలు, చెత్తకథలు. ఏదో 'ప్రేయసీ నా ప్రణయ సుందరీ' అని పలవరిస్తావేగాని ప్రపంచ జ్ఞానం సున్న.

శ : పోనీరే! నాకథ పూర్తికానియ్యి.

[కాగితం తీసుకుంటాడు.]

అ : నీ కవిత్వం అలా ఆపి ముందు యీ శుభవార్త వినవోయ్ !

శ : ఒరే! ఆ శుభవార్తకంటె యీ అద్భుత ఘట్టం వినరా. వింటే, వింటున్నవాళ్లు, చదివేవాళ్లు ఆ స్వర్గసౌఖ్యం అనుభవిస్తున్నట్టే వుంటుంది. చదువుతానుండు—

అ : నువ్వు చదవావద్దు నేను వినావద్దు. దానికంటె అతి అమూల్యమైనది యీవార్త! ఓ గొప్ప శుభవార్త; మన చరిత్రలో సుప్రసిద్ధ ఘట్టం.

శ : అదేదో చెప్పనైనా చెప్పరా. నీ పోరు తీరుతుంది. ఇంతకూ ఆ మారేజ్ ఎవరిదో చెప్పావుకాదు.

అ : నువ్వు చెప్పనిస్తే గదట్రా.

శ : సరే యిప్పుడైనా చెప్పు—

అ : ముందు ఆ కాగితం అలా బల్లమీద పారేయ్, కాస్త మనసు దీనిమీద ఉంచి విను.

శ : వింటాను చెప్పరా!

అ : ఒకే మై డియర్ శరత్ నువ్వు రమ్మంటే రావన్నావుగాని.........

శ : ఏంజరిగింది? (ఆశ్చర్యంగా)

అ : ఏంజరిగిందని నెమ్మదిగా అంటా వేమిట్రా?

శ : (విసుగ్గా) ఏం జరిగిందో చెప్పరా.

అ : ఇండియా కాఫీహౌసులో కాఫీత్రాగి బయటకు వస్తుంటే, మెరుపుతీగలా మెరిసిందిరా.

శ : ఏమిటది?

అ : ఏమిటంటా వేట్రా. ఎవరు అను?

శ : ఎవరు?

అ : ఓ అప్సరస.

శ : అప్సరస అక్కడ కెలా వచ్చిందిరా?

అ : నిజంగా అప్సరసో, మేనకో, ఊర్వశో, మరేమిటో నేను వర్ణించలేను. ఎలావచ్చిందో కూడ చెప్పలేను.

శ : వచ్చి ఏం చేసింది?

అ : అలా అమాయకంగా పోతోందిరా.

శ : అంతేకదా (హేళనగా)

అ : అంతేనా?—

శ : మరి?

అ : నేను వెంటాడాను. యాభై గజాలు వెళ్ళాక ఏమండీ అనిపిలిచాను.

శ : నువ్వే పిలుస్తా!

అ : నేనే. ఏం అలా అంటున్నావ్?

శ : అబ్బే నీకంత ధైర్యమెలాగ వచ్చిందీ అని?

అ : అయితే నాకు ధైర్యం లేదంటావా?

శ : లేకేం. కావలసినంతుంది. కాకపోతే ఆపది కళ్ళెర్రజేస్తే ఆమడదూరం వెళ్తావ్. అంతే.

అ : ఒకే నేనంటే నీకంత హేళనగా ఉంది. మన తడాకా తెలియదులే.

శ : అవునవును. తర్వాత ఏం జరిగింది?

అ : ఏమయిందంటావా ఏమండీ అని మళ్ళా పిలిచాను. పిలవగానే ఉలిక్కిపడేటట్లు "ఎందుకండీ" అని హడలెత్తించింది.

శ : జడిశావా!

అ : జడిశాననుకో కాని...

శ : కాని, అని అపి వేశావే. ఏంచేశావ్.

అ : కూడా వెళ్ళి కాస్త నా మాట వినండి అన్నాను.

శ : అంటే!

అ : "ఎందుకు వినాలి!" "అసలు మీ రెవరు?" అంది. అప్పుడు నేను "నేను ఒక ప్రేమికుణ్ని" అన్నాను.

శ : అంటే నవ్వింది.

అ : నవ్వలేదు కాని సీరియస్ గా "ప్రేమికులైతే ప్రియురాలి దగ్గరకు వెళ్ళండి. పబ్లిక్ రోడ్ మీద యిదేం పని" అంది.

శ : (నవ్వి) అనగానే 'రైట్ ఎబౌట్ టర్న్' కొట్టావా?

అ : అబ్బే అలాగే వెంటాడాను.

శ : అయితే యేమీ అనలేదా?

అ : అంది. "ఎందుకండీ మీ రలా కూడా బడతారు" అని.

శ : అప్పుడు నువ్వేమన్నావ్?

అ : నువ్వు కవిత్వంలో పడతావు చూడు అమాటన్నాను.

శ : ఏమిట్రోయ్ అది.

అ : అదే—'తుమ్మెదలు పుష్పముల చుట్టూ ఎందుకు తిరుగుతాయి' అన్నాను. కాని మాట్లాడ లేదు.

శ : అయితే నీ బుర్ర పనిజేస్తోందన్నమాటే.

అ : అమోఘంగా!

శ : ఆ! తర్వాత యేమయింది?

అ : తాలూకాఫీసు దగ్గర కొచ్చేటప్పటికి "ఎందుకండీ మీకు కాదా చెప్పేది, వెళ్ళండి" అంది. అప్పుడు "నా ప్రేమ సందేశాన్ని అందించడానికి" అని సమాధాన మిచ్చాను. "ప్రేమ సందేశ మేమిటండీ" అని మళ్ళా కైమంది.

శ : చచ్చాం! అడిగిందీ?

అ : అడిగింది. అడగ్గానే నాకు బలే హుషారు వచ్చి "ప్రేమ పవిత్రమైంది. అందులో నా ప్రేమ మహాపవిత్రమైంది" అని చెప్ప సాగాను. అయితే "ఆపండి మీ రెడో

కవిత్వ ధోరణిలో వున్నట్టున్నారు. అయినా నా కెందుకు వెళ్ళండి" అంటూ కోపంగా పోయింది.

శ : అయితే నీ ప్రేమ వర్థం చేసుకోలేదన్న మాట.

అ : అదేరా బ్రాంతి. కాని నేను విడువలేదు. మళ్లా ఏమండీ అని పిలిచాను. అప్పుడు "యేమిటండీ, యేమండీ, యేమండీ అంటూ నా వెంటపడ్డారు. పోలీసులతో చెప్పమంటారా?" అని జడిపించిందిరా.

శ : పోలీసులతోనే కొంప మునిగిందే.

అ : అబ్బే నేను జంకలేదు. పైగా "మీరు మిస్సమ్మ సినిమా చూచారా?" అని అడిగేను.

శ : ఎందుకు?

అ : అదే ప్రశ్న ఆమెకూడ వేసింది.

శ : అయితే ఏమి చెప్పావు?

అ : "ఆడవారి మాటలకు అర్థాలు వేరులే" అన్న పాట ప్రకారం మీరు నన్ను మనసారా ప్రేమిస్తున్నారు కదండీ అని ప్రశ్నించేను.

శ : అయితే ఒప్పేసినట్టేనా?

అ : ఒప్పేసినట్టే.

శ : ఎట్లా?

అ : నావంక మందహాసంతో చూచి నన్ను ముగ్ధుణ్ని చేసింది.

శ : చూచి నవ్వినంతట్లోనే!

అ : కాకపోతే ప్రేమించాను ప్రియుడా అంటుందా ఒరే మౌనం అర్ధాంగీకార మన్నావు కద్రా?

శ : అవుననుకో కాని మరి విడచి ఎలా వచ్చేసావ్?

అ : నావంక చూస్తూ గవర్నమెంటు హాస్పిటల్ లోకి పోయిందిరా!

శ : పోతే ఊరుకొన్నావా?

అ : రేపొస్తానని చెప్పి వచ్చాను.

శ : మంచిపని చేసావ్! ఇంతకూ ఆ మనిషి ఏ 'రెడ్ జాకెట్' వ్యక్తో.

అ : కాదురా చదువుకున్న పిల్లేరా. బంధువులను చూడడానికో ఎందుకో వచ్చివుంటుంది.

శ : అయితే తిరిగి వచ్చేవరకూ వుండకపోయావ్.

అ : ఉన్నానురా. కాని ఆరున్నర వరకు తిరిగి రాలేదు.

శ : దీనికేనట్రా మారేజ్ కి వస్తావా? అని హడావిడి చేశావ్—అంతా ఖరారైపోయినట్టు.

అ : 50% ఖరారయినట్లే—

శ : ఎట్లా?

అ : నేను అంగీకరించానుగా—

శ : అదా అయితే ఆమె అంగీకరించక పోతే 50% పెళ్లే అవుతుందన్న మాట.

అ : అదేమిట్రా శుభమంటూ అవేమి మాటల్రా?

శ : అయితే ఇదంతా షేఖీల్లు కాదుకదా.

అ : అదేమిట్రా బాబు అలా అంటావ్—ఆ నేత్రాలు, ఆ సొగసు, ఆ యవ్వనంతో కూడిన నా ప్రియురాలి ప్రతిబింబం ప్రతిక్షణం ప్రత్యక్షమౌతూంటే—

శ : ఒరే, నా మాట విని పోయి భోంచేసిరా, ఎందుకైనా మంచిది. నా భోజనమైంది. వెళ్ళు.

అ : నాకు భోజనం వద్దు. నాకడుపు ఆనందంతో నిండిపోయిందిరా.

శ : ఒరే జాగ్రత్త రాత్రికి కలగాని రావొచ్చు. పోయిపడుకో. చక్కటి ఘట్టం ఒకటి వ్రాశాను. చదువుతాను విను.

అ : ఓరి శరత్ ఆ "థ్యరీ" (Theory) అలా పెట్రా. ఇప్పుడు ప్రాక్టికల్ గా అనుభవిస్తున్నాను.

[ప్రసన్నకుమార్ ప్రవేశిస్తాడు]

ప్రసన్నకుమార్ : గుడ్ నైట్!

ఇద్దరూ : గుడ్ నైట్!

ప్ర : ఏరా భాయ్! చాలా హుషారుగా ఉన్నారు?

శ : ఏముందిరా నా కథ పూర్తి కావచ్చింది. ఇలాంటి ఘట్టం ఎన్నడూ ఏ సినీమాలో గాని నాటకంలో గాని, నభూతో న భవిష్యతి. ఇంతట్లో మనవాడేదో ఘనకార్యం చేశానని వచ్చి హడావిడి చేస్తున్నాడు.

అ : హడావిడి కాదురా! వాస్తవమైన అద్భుత సంఘటన... చెప్పమంటావా?

ప్ర : ఒరే నేనొకమాట చెప్తాను వింటారా?

శ : నా కథ చదివి నీ అభిప్రాయం ఏమైనా వుంటే చెప్పరా!

అ : ఛా! వెధవ కథ. మీ అభిప్రాయాలకేం గాని నా జీవితరంగంలో ప్రథమ ఘట్టాన్ని విని భవిష్యత్ ప్రణాళిక యెలా వుండాలో చెప్పండి.

ప్ర : ఒరే, మీరానందంలో అలా క్రొవ్వెక్కి ఆడుతున్నారు కాని నాకు ఒక తీరని అపకారం జరిగిందిరా.

శ : ఏమిట్రా?

అ : చెప్పు, ఎవడా వెధవ. నీకపకారం తలపెట్టిన వాడెవడో చెప్పు. నిమిషాలలో నాశనం చేద్దాం!

ప్ర : ఏమంటే ఏమి చెప్పనురా?

అ : ఫర్వాలేదుచెప్పు. పిప్పిచేస్తాన్. వెధవరాస్కెల్ నా ప్రియమిత్రుడు ప్రసన్నకుమార్ కా అపకారం చెయ్యడం. చెప్పు వెంటనే చెప్పు చిటికల్లో హతమారుస్తాను ఆ హంతకుణ్ణి—తన్నుతా నా చండాలుణ్ణి చెప్పు.

ప్ర : (నవ్వుతాడు)

అ : ఏరా నవ్వుతున్నావ్?

శ : అబ్బే నీ కంత ధైర్యం ఎట్లా వచ్చిందీ అని.

అ : ఏం? నేను పిరికిపందనా పైగా మీరంతా ఉండగా నాకు భయ మెందుకూ అంట. అసలు సంగతి తెలిసిందంటే వాడిపస తీసేస్తాను!

శ : అవునవును. రంగంలో దిగితే తెలుస్తుందిలే!

అ : ఒరే! కుమార్, చెప్పరా!

ప్ర : ఏముందిరా సాయంత్రం 6 గంటలకు మునిసిపల్ ఆఫీసునుంచి మా చెల్లి వస్తూంటే ఇండియా కాఫీహౌస్ దగ్గర ఒక కిరాతుడు వెంటబడ్డాడట.

అ : ఆఁ! (దిగజారిన గొంతుకతో)

ప్ర : అవును. పైగా విసుక్కుంటూన్నా, వెంటాడి హాస్పిటల్ వరకూ వచ్చాడట.

అ : వచ్చాడూ! (శరత్, అవతారం ఒకరిముఖము ఒకరు చూసుకుంటారు.)

ప్ర : ఏదో అసహ్యపు మాట లన్నాడట.

శ : ఒరే అవతారం! కొంప మునిగినట్లుందే.

ప్ర : ఏఁ?—

అ : ఏమీ లేదు. ఆ అమ్మాయికి అపకీర్తి తెచ్చాడే అని అంటూన్నాడు. ఆ తర్వాత ఏం జరిగిందో చెప్పు. (చాటుగా శరత్ కు సైగ చేసి తన విషయం గూర్చి చెప్పవద్దని బ్రతిమిలాడును.)

ప్ర : హాస్పిటల్ గేటువరకూ వచ్చాడట. చెప్పడం మరచాను. కోపపడుతూంటే ఆడవారి మాటలకు అర్థాలు వేరులే అని పాటపాడి మీరు మనసారా ప్రేమిస్తూన్నారు కదండీ? అన్నాడట—రాస్కెల్!

అ : అయిందేదో అయింది—తిట్టకురా!

ప్ర : ఆ! తిట్టడమా చీలుస్తాను.

అ : పోనీలేరా! వాడొక అమాయకుడనుకుంటాను. ఇప్పటి రోజుల్లో కుర్రాళ్ళంతేగా. ఇంతకీ ఆమె నీ చెల్లెలని తెలియదుగా వాడికి. ఏదో మర్చిపో.

ప్ర : మరచి పోవడమా! వాణ్ణి మసిచేస్తాను, మిగతా వాళ్ళందరికీ బుద్ధొచ్చేలాగు.

అ : ఆఁ! (ఆశ్చర్యంగా)

ప్ర : అవును.

అ : ఒరే! నా మాట విని నీ ప్రయత్నం మానుకో. చూడు. అప్పుడప్పుడూ మనం మాత్రం అలా ఆడపిల్లల్ని ఆడించడం లేదు? నీవేమైనా హడావిడి చేస్తే అల్లరి పాలవడం కాని మరింకే ముంది?

ప్ర : అది తర్వాత విషయం. ముందు తిప్పకుండా కసితీర్చుకుంటాను. రేపు మళ్ళా వస్తానని చెప్పికూడా వెళ్ళాడట. రేపే వాడిపని పడతాను.

అ : (భయంతో వణకుతూ) ఒరే కుమార్ యుద్ధం తలపెట్టకురా! శాంతిం వహించరా—గాంధీ తత్వం పూనరా!

ప్ర : ఏమిట్రా! నువ్వు భయపడుతున్నావ్! ఏం అలా వణుకుతున్నావ్?

అ : అబ్బే! ఏమీ లేదు. ఇలాంటి యుద్ధాలంటే నాకు చాలా భయం. పైగా నువ్వు నాకు చాలా ప్రియమిత్రుడివి నీకా యుద్ధంలో ప్రమాదం సంభవిస్తే మాకు కాదా. మంచికోసం చెబుతున్నాం. ఏరా శరత్.

శ : అవునురా!

ప్ర : మీ రెన్నైనా చెప్పండి నేనుమాత్రం వాణ్ని విడిచిపెట్టను. మీకేం! అక్కడ నా చెల్లి బెంగపెట్టుకొని తీరని అవమానంతో యేడుస్తోంది.

అ : ఏడుస్తోందా!

ప్ర : ఏడవక యేంచేస్తుందిరా. ఆడది చేసేది అంత కన్నా యేముంది చెప్పు? రేపు మనం ముగ్గురూ కలసి వాణ్నిపట్టి చిత్రవధ చెయ్యాలి.

అ : నేనూనా!

ప్ర : అవును నువ్వూను—

అ : ఆఁ!

ప్ర : ఏఁ! అలా అంటున్నావ్. ఇప్పటివరకూ వాణ్ని నాశనంచేస్తాన్. చిటికల్లో మాత మారుస్తావన్నావుగా?

అ : అన్నాననుకో!

ప్ర : అంటే అన్నట్టు చేయలేవన్నమాట!

అ : కాదనుకో!... కాని.

ప్ర : ఏమిట్రా కాని... అర్ధణా అవసరం వచ్చినప్పుడు లేనిది వుత్తిప్పుడెందుకురా. ఏమైనా సరే నువ్వు తప్పకుండా రావాలి. నువ్వే వాణ్ని తన్నాలి.

అ : నేనా?

ప్ర : అవును.

అ : వద్దు! నాకు చేతులురావు.

ప్ర : తన్నడానికి చేతులెందుకురా! కాళ్ళుండగా!

అ : ఆఁ! కాళ్ళా. అవి యేమీ చేయలేవు.

ప్ర : చేస్తాయి. మనిషికి మనిషి సహాయం. కాబట్టి నువ్వు రావాలి.

అ : అవ్యక్తి ఎవరో నీకు తెలుసా?

ప్ర : తెలియదు. రేపొస్తానన్నాడటరా, కొస్తాను. కాని వాడి తడాఖా చూస్తాను.

అ : అతనో కాదో నీకు ఎలా తెలుస్తుంది?

ప్ర : మా చెల్లెలు వస్తుంది. ఆనవాలు చెప్తుతుంది.

అ : ఆ! మీ చెల్లికూడా వస్తుందీ!

ప్ర : ఏం?

అ : అబ్బే ఆడవాళ్ళెందుకురా రణక్షేత్రానికి?

ప్ర : ఆడవాళ్ళు లేకపోతే ఆనవా లెట్లా దొరుకుతుంది?

అ : అవుననుకో! కాని! ఆడదుంటే అవతల వాడుకూడా పౌరుషంగా పోట్లాడుతాడు. అప్పుడు అపజయం వస్తే నామోషి. పైగా పేరు ప్రఖ్యాతులు, పాడైపోతాయి.

ప్ర : ఏమైనా అవనియ్యి. నేనుమాత్రం నాపట్టు విడువను. నువ్వు తప్పకవచ్చి సహాయ పడాల్సిందే.

శ : ఒరే! యేదోఒకటి చెయ్యొచ్చుగాని కాసేపు విశ్రమించండిరా. నా కథ ముగుస్తుంది.

అ : అవునురా పడుకుందాం. నువ్వోళ్ళి కాస్త విశ్రాంతి తీసుకో.

ప్ర : నాకు విశ్రాంతేమిటి వాణ్ని ఖూనీచెయ్యంది నిద్రపోను.

అ : పోవూ!

ప్ర : పోను.

శ : పోకపోతే పోనీకాని, కాస్త నిశ్శబ్దంగా ఉండండిరా!

ప్ర : ఏమిట్రా యెప్పుడూ కథలో, కథలో అంటావ్? ఎప్పుడైనా ఒక్కకథ అయినా పబ్లిషై వచ్చిందీ?

శ : ఈ సారి తప్పకుండా అవుతుంది. ఇదివరకు ఉంటే కైలికంటే ఇంకా ఘాటుగా వ్రాస్తున్నాను.

ప్ర : వ్రాస్తే వ్రాసావుగాని, ఒరే, అవతారం ఇంతకీ నువ్వేముంటావురా?

అ : నేనీసారికి రానురా—

ప్ర : నువ్వు రాకపోతే లాభం లేదు. నీవుండాల్సిందే—తప్పకుండా,

అ : ఒరే! శరత్ మా నాన్న యడ్రస్ తెలుసు నట్రా?

శ : సరిగ్గా తెలియదు!

ప్ర : ఎందుకురా?

అ : ఎందుకైనా మంచిది నోట్ చేసుకోరా! —ఎ. అవధాని, అనపర్తి, తూర్పు గోదావరి జిల్లా.

ప్ర : ఎందుకురా?

అ : ఒకవేళ నే నా మహాయజ్ఞంలో చస్తే యీ యడ్రస్ ద్వారా మా వాళ్ళకు తెలియజేస్తే వచ్చి నా అంత్యక్రియలు జరుపుతారు.

ప్ర : ఓరి నీ తస్సాదియ్యా! అప్పుడే ఎంతవరకూ పోయావ్! పోనీగాని యీ వేళతో ఆఖరట 'సాంసన్ అండ్ డెలీలా' చూద్దాం రండిరా.

శ : నేను యీ రాత్రి కథ పూర్తి చేయాలి. రేపు పోస్టు చెయ్యాలి. నేరాలేను.

ప్ర : రేపు ఆదివారం రా. రేపు పోస్టుచేసినా ఎల్లుండి పోస్టుచేసినా ఒకటే. సరే నువ్వురా అవతారం?

అ : నేనూ రాలేనురా. నేను అలసిపోయాను. విశ్రాంతి తీసుకోవాలి. పైగా నిద్ర కూడా లేదు.

ప్ర : అయితే నేనే పోయొస్తా. గుడ్ నైట్! (వెడతాడు)

అ : ఒరే శరత్ నా ప్రాణం మీదికొచ్చిందిరా!

శ : నా కథ ముగియ వచ్చింది.

అ : నా బాధ చూడరా!

శ : నా కథ వినరా!

అ : అబ్బా! నీ గొడవ నీది. సరే పడుకుంటాను. (పడుకుంటాడు) [తెర]

## 2

* * గడియారం 1-30 చూపెడుతున్నది. కథ వ్రాస్తున్న శరత్ కూర్చున్న వాడు కూర్చున్నట్లే కుర్చీలో నిద్ర పోతూ వుంటాడు. అవతారం నిద్రపోతుండగా అతని ముఖంమీదికి టార్చిలైటు ఫోకసు పడుతుంది. అందువల్ల నిద్రమేల్కొని ఆ లైటుయొక్క ఉనికిని గమనించుతూ ఉండగా ఒక హస్తము పిలుస్తున్నట్లు కన్పించుతుంది. అతన్ని

అ : ఎవరు?

చేయి : (నెమ్మదిగా) ఉష్— నేనే నీ 'శా' ను

అ : నా 'శా' వా? పేరు?—

చేయి : (నెమ్మదిగా) హాస్పిటల్ గేట్

అ : ఓ నువ్వా. ఆ! నాకు తెలుసు నీ వొస్తావని. మన 'శా' ఎటువంటిదో యీ దద్దమ్మలకు ఏమైనా తెలిస్తేగా! ఆగు వస్తున్నా ఈ వేళ ప్లాన్ వేసుకొని రేపు ప్లాగ్ యెత్తేద్దాం!

[అద్దంలో ముఖం చూసుకొని సర్దుకొంటూ బయటకు వెళ్ళి తిరిగి నిస్పృహతో వస్తాడు]

ఇట్టే మాయమయ్యిందే. నేను వస్తున్నా నన్నాను. నా మాట లెక్క లేకుండా పోయింది. మొదట్లోనే మోసమా! ఆ అందాన్ని చూచి ఆనందించుదామని ఎన్నో ఆశలు పడ్డాను. కాని రెయింబవులను చూచి పరుగెట్టినట్టయింది. ఇదంతా నాదురదృష్టం.

[ఆచేయి, వెనుకనుంచి, నిలుచున్న అవతారం భుజంపట్టి లాగుతుంది — "దొంగా దాగి నన్నాడిస్తున్నావా? నన్ను పరీక్షించాలనా?

[మళ్ళీ బయటకు వెళ్ళి తిరిగి వస్తాడు]

ఆరె మళ్ళా మాయమయ్యింది. విచిత్రంగా ఉందే! దీపం తెచ్చి చూస్తాను.

[వెళ్ళబోతాడు మళ్లీ చెయ్యి అవతారం భుజంపట్టి లాగుతుంది.]

చేయి : "జాగ్రత్త" —(ప్రక్కనున్న సామానులు కొన్ని పడగొట్టును)

[అవతారం కంగారుపడి భయంతో వణకుతూ వచ్చి మంచంమీద పడి దుప్పటి ముసుగారకప్పుకుని]

అ : ఒరే! శరత్...ఒరే లేవరా! దెయ్యం! దెయ్యంరా!

శ : (నిద్రమత్తులో) దెయ్యంలేదు, గియ్యం లేదు. మాటాడక పడుకో!

అ : అదుగోరా! చూడరా బాబూ! నీకు పుణ్య ముంటుంది లేవరా!

శ : పుణ్యంలేదు పాపంలేదు పడుకోరా

అ : బాబ్బాబు లేవరా!

శ : ఒరే! నీ వేమైనా కలగన్నావా యేం?

అ : కలకాదురా లేచి చూడు.

శ : చంపుతున్నావురా (అటలిస్తూ లేచి, అవతారం ముఖం కనపడకుండ కప్పుకు పడుకొని చేతితో చూపెట్టుట చూచి) ఇదేవిట్రా ముసుకేసావ్ (దుప్పటిలాగి) ఎక్కడరా? ఏది దెయ్యం?

అ : (భయపడుతూ) అదిగోరా చూడు. నాకు భయమేస్తోందిరా!

శ : (అటూ యిటూ చూచి) ఏమీ లేదురా నీ భయమే దెయ్యం మహారాజులా పడుకో.

అ : (ఇంతలో మంచం క్రిందనున్న జోళ్ళు తగిలి) బాబోయ్! దెయ్యం! (కెవ్వన కేక వేసి మరల దుప్పటి కప్పుకొని పడుకొనును)

శ : ఏమిట్రా యిది, ఏదెయ్యం రాలేదే!

అ : మంచం క్రింద ఉందిరా;

శ : (తొంగి చూచి) ఏమీ లేదురా.

అ : ఉందిరా! మెత్తగా తగిలిందిరా

శ : ఏమిట్రా నీగోల. నామతిపోతోంది. ఏది లేచి చూపించు.

[లేవదీయును]

అ : (వణుకుతూ) ఈక్రిందే వుందిరా.

శ : (కోపంగా) ఓరి నిన్ను తగలెయ్య! అది నీకాలి జోడేరా.

అ : కాదురా

శ : నీ ముఖం పడుకో!—

అ : ఒరే నాకు భయంగా ఉంది నీవు మెలకువగా ఉండరా?

శ : ఒరే నాకు నిద్రలేదురా నే నిప్పుడే పడుకున్నాను. నేను మెలకువగా వుండలేను.

అ : బాబ్బాబు! నీకు దణ్ణం పెడతాను. నా ప్రక్కన పడుకుని మెలకువగా వుండరా;

శ : అయితే యిది నాకు పనిష్‌మెంట్ అన్నమాట.

అ : అదేవిట్రా అలా అలిగిపోతావ్? నీ కేమైనా సాయం చేస్తాలేరా.

శ : చేస్తావ్ చేయకేం. ఇంతకూ నీ కేమైనా కల వచ్చిందా?

అ : కలకాదురా. కళ్ళారా చూచాను. ఒక లైట్ ఫోకస్ నామీద పడింది, నాకు మెలకువ వచ్చి చూస్తే చెయ్యివూపి నేను నీ హాస్పిటల్ 'లో'ని, రా, అని పిలిచిందిరా, నేనువెళ్తే కనబడలేదు. మళ్ళీవచ్చి పడుకోబోదామంటే నా భుజంపట్టి లాగిందిరా, ప్రక్కనున్న సామాన్లు క్రిందపడవేసి గడబిడ చేసిందిరా నాకు చాలా భయంగా ఉందిరా.

శ : ఓరీ! పిరికిపందా అది నీ ప్రియురాలేరా. నీ ధైర్యాన్ని పరీక్షించడానికే చేసిందిరా. పరీక్షలో ఫెయిలయ్యావు.

అ : ఏమోరా! నాకు గాబరాగా ఉంది.
[బయటనుండి అవతారం, అవతారం అని పిలుపు వినబడుతుంది]

అ : ఒరే! అదిగోరా దెయ్యం. మళ్ళీపిలుస్తోందిరా.

శ : ఛా! ఊరుకో! మన కుమార్ గొంతులాగుంది. కుమార్!

ప్ర : శరత్ నే నేరా! కాస్త తలుపుతియ్యి!

శ : తలుపు తీసే ఉందిరా

[ప్రసన్నకుమార్ వస్తాడు]

అ : నువ్వా బాబూ!

ప్ర : ఏం! అలా అంటూన్నావేరా?

శ : వీడేదో కలగని దెయ్యం, దెయ్యం, అని కంగారు పడుతున్నాడు.

ప్ర : అందుకా మెలకువగా ఉన్నారు? దెయ్యమేమిట్రా నీ బొంద! ఎలాగుంది దెయ్యం?

అ : నాకు కనబడలేదురా!

ప్ర : నీ ముఖం! నీవు నిజంగా పిరికిపందవేరా పేరుకు తగ్గట్టు అవతారానివే సుమా. సరే కాస్త స్థల మియ్యి పడుకుంటాను.

శ : సినిమా యెలాగుందిరా?

అ : అవునవును. అలాంటి మాటలన్నా చెప్పు.

ప్ర : నాతో సినిమాకు రమ్మంటే వచ్చావా! —గ్రాండ్ గా ఉంది.

అ : వచ్చినా బాగుండును. అప్పుడేదో వంక పెట్టి మానేసాను కాని లేకపోతే ఈ భయం పట్టుకునేదికాదు.

ప్ర : ఒరే! నువ్వు మగాడివేనా.

అ : అంటే

ప్ర : అయితే భయమెందుకురా?

అ : ఏమో! ఎందుకో గాని భయమేసిందిరా

ప్ర : (నవ్వుతూ) ఓరి నిన్ను తగలెయ్యా. దెయ్యం కాదు. ఏమీ కాదు.

అ : మరేమిటి?

ప్ర : అది నేనేరా! నిన్ను టెస్టు చేద్దామని చేసాను.

అ : పట్టిదే—నన్ను నమ్మించడానికి, భయంనుంచి తప్పించడానికి అంటూన్నావ్ అంతే!

ప్ర : కాదురా. ఇదిగో టార్చిలైటు. ఒకే మీ బుర్రలు పేడతో నిండివున్నాయిరా.

అ : ఏం!

ప్ర : కాకపోతే నీ 'హాస్పిటల్ గేట్‌లోని' అని చెప్పిందని నీవంటే, ఈ కవిగారు నీ ప్రియురాలేరా. పరీక్షించడానికి వచ్చిందిరా అంటాను. దారినిపోయే అమ్మాయికి నీవిక్కడున్నట్లు ఎట్లా తెలుసురా?

అ : అయితే యిదంతా నువ్వు చేసిందే!

ప్ర : కాకపోతే మరేవిటి? ఇదేకాదు. రాత్రి చెప్పావు. ఆ అమ్మాయి నా చెల్లెలూ కాదూ యేమీ కాదు. నీ వంటున్న మాటలు విని నిన్ను ఏడిపించడానికి నవ్వుటాలకు అలా దబాయించాను.

శ : అదా సంగతి!

అ : నిజమేనట్రా!

ప్ర : నిజమేరా. కాస్త స్థిమితపడు.

అ : చంపావురా—ప్రతీసారీ ముచ్చెమటలు పట్టేటట్లు చేసావ్. నిజంగా నా ప్రాణాలు నాలో లేవంటే నమ్మ.

ప్ర : పోనీ యిప్పుడైనా చేరాయా?

అ : చేరాయనుకో—

శ : ఒరే యింత భయస్తుడివి ఎట్లా వెంటబడ్డావురా ఒక ఆడపిల్ల వెనకాలే.

ప్ర : ఆ అమ్మాయి నర్సుట్రయినింగ్ పొందుతున్నదై ఉండాలి.

శ : అయితే అయివుండొచ్చులే.

ప్ర : దాన్నిగురించి ప్రొద్దుటే భోగట్టా చేద్దాం గాని నిద్రపోండిరా.

అ : దేన్నిగురించిరా?

ప్ర : ఆ అమ్మాయినిగురించిరా!

అ : అప్పుడు నేనూ రావాలా?

ప్ర : నువ్వులేకుండా నేనేమి చేయగలనురా. నీవు ఫలానా వ్యక్తి అని చూపెడితే నేగదా నేనేమైనా చేసేది.

అ : అవుననుకో. కాని...

ప్ర : కాని యేమిట్రా చెప్పు?

అ : అబ్బే యేమీ లేదు. ఆ వంకను తీసుకొనివెళ్ళి అక్కడ మెత్తగా తన్నవుకదా.

ప్ర : (నవ్వు) ఓరి చవటపిద్దమ్మా నిజం చెప్పినా నీకు నమ్మకం కలుగలేదేరా?

అ : ముమ్మాటికీ నిజమేకదూ!

ప్ర : నిజమేరా బాబూ. ఏదో తమాషాచేస్తే అలా యిదౌతావేం ఈసారి హాయిగా నిద్రపో.

అ : నీతమాషా గాదుగాని నా ప్రాణాలు కడబట్టించావు.

[ తెర ]

## రంగము : 2

* * అదేగది; శరత్ కూనిరాగం తీసుకొంటూ కూర్చుంటాడు. అవతారం, కుమార్ ప్రవేశం :

శ : ఏమయిందిరా! అవతారం!

అ : ఏదో అడుగు. రూమ్‌కు వచ్చాక చెబుతానన్నాడు. నే నెంతడిగినా చెప్పలేదు.

శ : కుమార్ కొయ్యా, పండా?

ప్ర : ఆ అమ్మాయి క్రిస్టియన్.

అ : ఆ (కుర్చీలో కూలబడతాడు)

శ : అయితే ప్రేమించవా?

ప్ర : క్రిస్టియన్ అయితే పెళ్లాడవా?

అ : అదే (అనుమానంగా)

ప్ర : ఏం?

అ : మావాళ్లు యేమంటారో

ప్ర : ఒరే నువ్వు పెళ్లాడేది నీకోసమా, లేక మీ వాళ్ళకోసమా?

అ : నాకోసమే అనుకో

ప్ర : అనుకో ఏమిట్రా?

అ : అమ్మే వాళ్ళు ఒప్పుకోరురా

ప్ర : ఇదిగో—పెళ్ళి నీకోసమైతే వాళ్ళయిష్టమెందుకురా.

అ : వాళ్లిష్టం కాకపోతే యింట్లోకి రానివ్వరుగా.

ప్ర : ఓరి చవటా! ఇదేనట్రా నీ మగతనం

అ : అదేమిట్రా బాబూ!

ప్ర : ఛా! వూరుకో పెద్దమగాడిలా మాట్లాడబోతావ్.

శ : ఒరే అవతారం మాటల్లో మరచాను నీకేదో లెటర్ వచ్చిందిరా.

అ : వట్టి లెటరేనా?

శ : కాకపోతే!

అ : మనియార్డరు రావాలే

ప్ర : ఓరి దద్దమ్మ యీ వేళ ఆదివారం రా!

అ : అయితే లెటర్ ఎలా వచ్చింది?

శ : ఎవరో ఒక అబ్బాయి వచ్చి యిచ్చి పోయాడు.

ప్ర : ఎక్కడ్నుంచిరోయ్?

అ : ఎవర్రా! ఆ అబ్బాయి? ఏది యిలా ఇవ్వు.

శ : (లేచి బల్లమీద ఒక కవరుతీసి) యిదిగోరా (యివ్వబోవును)

ప్ర : (లాక్కొని) చింపి చదివేస్తానురా.

అ : ముందు నన్ను చదవనివ్వరా.

ప్ర : లవ్ లెటర్ కాదుగా?

శ : లవ్ లెటర్ అయితే అయివుండాలి.

అ : ఏమిట్రా బాబు! నన్నిలా ఆడిస్తున్నారు? నాకు లవ్ లెటర్లెక్కణ్ణుంచి వస్తాయిరా.

ప్ర : అయితే చదువుతాను. (చింపి చూస్తూ) ఒరే అవతారం! మిస్ మోహిని యెవరురా?

అ : అది ఓ బ్రహ్మరాక్షసిలే.

శ : ఏం! దాని గొడవేమొచ్చిందిరా?

ప్ర ఒరే శరత్ వీడు యేమీయెరగని నంగనాచిలా ఉన్నాడుగాని కథానాయకుడురా.

శ ఏ రోయ్?

ప్ర గోడలమీద పిడిపేరు మిస్ మోహిని పేరు వ్రాసిఉంటే కిట్టనివాడెవడో వ్రాసాడనుకున్నాను గాని యీ ఉత్తరం చూస్తే అక్షరాలా నిజంరా.

శ అదేమిట్రోయ్ మనవాడింతటి వాడయ్యాడా?

అ ఒరే అదేమిట్రా నాకేమీ తెలియదురా నా మాట నమ్మండ్రా... ఆ అమ్మాయంటేనే నాకు భయంరా.

ప్ర : ఏం?

అ : నాకు రెట్టింపుంటుందిరా. నా రెండు చేతులు కలిపితే ఆ అమ్మాయి ఒక చెయ్యి అవుతుంది.

శ : అయితే నేంలే!

అ : అయితే యేమిట్రా. ఆ చేత్తో తోస్తే ఆమడ దూరం పోతాను. అయినా ఆ అమ్మాయికి నాకు ఏమీ సంబంధం లేదురా.

ప్ర : ఉందో లేదో యీ ఉత్తరమే చెప్తుంది.

అ : కాదురా యీ ఉత్తరం యెక్కణ్ణుంచి వచ్చిందో గాని విచిత్రంగా ఉంది. నే నేమీ యెరుగనురా.

శ : ఏదిరా ఆ ఉత్తరం చూపనియ్ (తీసుకొనును.)

అ : అసలు ఆ ఉత్తరం చూపనివ్వండిరా. నాకు గాబరాగా ఉంది.

ప్ర : ఉంటుంది. ఉండదూ! నలుగురికి తెలిపాక అలాగే ఉంటుందిలే.

అ : నిజంగా నాకేమీ తెలియదురా.

ప్ర : నిజమో అబద్ధమో తెలుస్తుందిగా. ఒరేవాడికి చదివి వినిపించరా, వాడి ప్రియురాలు వ్రాసిన ప్రేమలేఖ.

శ : చదువుతాను. వినరా.

ప్రియా!

నీవు చెప్పినట్లు అన్నీ సిద్ధంచేసి ఉంచాను. నీవు యీ ఉత్తరం అందిన వెంటనే నీవు చేసిన ఏర్పాట్లనుగూర్చి తెలియజేయుము. మనము యీరాత్రి 10 గంటల ట్రెయిన్‌కే వెళ్ళిపోదాము. వివరములు ట్రెయిన్‌లో మాట్లాడుకుందాం. 'ఇక వుంటా.'

నీ ప్రేయసి,
మోహిని.

అర్ పీడి దుంపతెగా జెండాయెత్తేవరకూ వచ్చాడే. ఇంతాచేసి పైగా ఎందుకురా బుగ బొంకుతావ్.

అ : ఒరే శరత్ మోహిని అంటే నాకెంత భయమో నీకు తెలుసుకదట్రా.

శ : అవుననుకో. కాని పైకి భయం నటించి లోలోపల యిన్ని పన్నాగాలు పన్నావని నాకేం తెలుసు?

అ : పన్నాగా లేమీ పన్నలేదురా. ఇదంతా మాయగా వుంది.

ప్ర : మాయగానే ఉంటుంది. ఈరాత్రికికూడా మాయగానే మాయమౌతావ్.

అ : లేదురా.

శ : ఏమిలేదు?

అ : ఏమోగాని నిన్నా ఈవేళ ప్రొద్దుట లేవగానే నీ మొఖమే చూచాను. నిన్నచూస్తే ప్రాణాలు పోయేటట్లు వీ డేడిపించాడు. సరే యేదోవిధంగా సరిపెట్టుకుంటే ఈవేళ యీ గండం. నాతల పగిలిపోతోందిరా. ఆ మాయదారి మోహినికి నే నేదారికావా? రామచంద్రప్రభూ! ఇంకెవరూ లేరూ?

శ : ఒరే యీ నాటకాలకేమిగాని మాటొస్తే చెబుతున్నాను. మొన్న మోహిని డాన్సుకు 5 రూ॥లు పెట్టి టిక్కెట్టు కొని వెళ్ళలేదూ?

అ : వెళ్ళాను.

శ : మరింకేమి?

అ : అంటే?

శ : అంటే మోహినిమీద మోజుంటేగా.

అ : నా ప్రాణం తీస్తున్నావురా. మొర్రో నాకేమీ తెలియదురా అంటే మోజు గీజూ అంటావేమిట్రా?

ప్ర : అంతేలే!

అ : ఒరే కుమార్ నువ్వూ అదేమాటట్రా. ఒట్టేసి చెబుతున్నాను. నాకూ మోహినికి ఏమీ సంబంధం లేదురా.

ప్ర : ఒరే వట్టి, వటి ఒట్టులేసేబదులు యీ సంగతి ముందుగా మాతో చెబితే మీకు గ్రాండుగా సెండాఫ్ యిచ్చేవాళ్లంగా.

అ : నామాట నమ్మరుట్రా?

శ : నిజం చెప్పితే నమ్మేవాళ్ళమే.

అ : నేను చెప్పింది నిజమేరా.

ప్ర : నిజంగా అబద్ధం చెప్తున్నావన్నమాట.

అ : కాదురా. నాకేదో కాలం మూడిందిరా.

ప్ర : ఏం?

అ : ఏమో నాకు చాల భయంగా వుంది.

ప్ర : భయమెందుకురా హాయిగా పోయి ఆనందించి రారా!

అ : ఆనందించడమా! మోహిని అమ్మాయి కాదు. అమ్మలాగుంటుంది నాకు.

శ : ఫరవాలేదులేరా.

అ : అమ్మబాబోయ్. ఒరే యిలారా!

శ : ఏం?

అ : (శరత్ చేయి పట్టుకుని తనగుండెమీద పెట్టి) చూడరా గుండె గబగబా కొట్టుకుంటోంది.

ప్ర : కొట్టుకుంటే కొట్టుకుందిగాని బలేఘాన్స్ కొట్టావులే.

అ : ఛాన్సేమిట్రా నా ముఖం. చచ్చేలాగుంటేను మీరు నన్ను బొత్తిగా కంగారు పెడుతున్నారురా. నేను మాయింటి కిప్పుడే పోతాను.

శ : ఒహో అదా. ఎలాగా గోలయ్యిందని పట్టపగలే తీసుకుపోదామనా.

అ : అయ్యొయ్యో! నే నేమిచేసేది?

ప్ర : మేమున్నాముగా, మేమిద్దరం వచ్చి మీ ఇద్దర్నీ సంతోషంగా సాగనంపుతాం.

అ : అదిగోరా! అదేమంట. ఒరే నన్ను బ్రతకనివ్వరురా మీరు. తలనొప్పివస్తోంది.

ప్ర : ఏస్ప్రో పిల్ తెమ్మంటావా?

అ : ఏస్ప్రోవద్దు ఏమీవద్దు.

శ : అవును లే మోహిని వస్తే మందులెందుకు?

అ : ఒరే బాబ్బాబు మీకు దణ్ణంపెడతాను మీరు మోహినిగోడవతల పెట్టకండిరా. నేను చల్లగా పడుకొంటాను. (పడుకోబోతాడు).

శ : అదిగోరా మోహిని వస్తోంది.

అ : (కంగారుగాలేచి) వస్తోంది (పటకలు బిగింగుతాడు. అటూయిటూ పారచూస్తాడు.)

శ : అటు...కాదు, కాదు...యిటు.

అ : (భయంతో) ఒరే ఏదో సమాధానం చెప్పి పంపివేయండిరా. నేను దాక్కొంటాను.

శ : ఏమి చెప్పమంటావు?

అ : మాయింటికి వెళ్ళిపోయానని చెప్పు.

శ : ఇంటి అడ్రస్ అడిగి మీయింటికి వడితేనో?

అ : అవును. ఆమాట నిజమే. అప్పుడు మరీ గొడవౌతుంది. సరే యేదో చెప్పండి. (మంచం క్రింద దాక్కొంటాడు).

ప్ర : మంచంక్రింద ఉంటే దొరికిపోతావురా.

అ : (బయటకువచ్చి) అయితే అలా బయటకు పారిపోతాను. (పారిపోబోతాడు.)

శ : ఒరే నీ దొంగవేషాల కేమిగాని యిలారా దాక్కొంటానని మాకు మస్కాకొట్టి మోహినీతో ఆ దారిని అటే పోదామనా!

ప్ర : అవునట్రా.

అ : ఒరే మీకు దణ్ణంపెడతాను. నన్ను చంపకండిరా! (చెయ్యిపట్టుకొని చూచుకొని) జ్వరం వచ్చింది. (మూలుగుతూ పడుకుంటాడు.)

ప్ర : ఒరే జ్వరంమాత్ర ఉంది ఇవ్వనా?

అ : ఆ మాత్ర జ్వరానికా లేక నైకుంఠయాత్రకా?

[కుమార్, శరత్ నవ్వుకుంటారు.]

శ : ఒరే అవతారం! ఈ ఉత్తరం చదవరా.

అ : ఉత్తరం వద్దు. పత్తరం వద్దు

శ : ఒకసారి చూసైనా చూడరా!

[అవతారం చూస్తాడు.]

శ : ఓరి చవట పిరికిమొహమా—నీకు నిజంగా బుర్రలేదురా—మేము తమాషాచేస్తుంటే జడిసి జ్వరం తెచ్చుకున్నావా?

అ : ఆ!

శ : అవును. నిన్నాడించడానికి నేనే వ్రాసానీ ఉత్తరం. చూడు నా దస్తూరి.

అ : (లేచి) నిజమేనట్రా?

ప్ర : నిజమే నిన్నరాత్రి నేను తమాషా చేశానని ఈ వేళ శరత్ చేసాడురా. అంతకంటే ఇంకేమీ లేదు. కాస్త ఇప్పుడైనా స్తిమితపడు.

అ : అమ్మయ్య చంపేసురా నిజంగా. వీడు ముచ్చెమట్లు పట్టేటట్లు చేసాడు. నువ్వు జ్వరం వచ్చేటట్లు చేసావ్.

శ : ఇదంతా వట్టి నవ్వులాటకి, కోపం తెచ్చుకోకు.

[తెర.]

# అల్లయవేమారెడ్డి వేమవరశాసనము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు కాశీఖండము కృత్యాదిలోఁ దన కాశ్రయదాతయైన వేమభూపాలుని మహత్త్వము నుగ్గడించుచు, ఆంధ్రక్షమామండలాఖండలుఁడైన యా భూవిభుని త్యాగవైభవము నీవిధముగ వర్ణించియున్నాఁడు.

ధరియింప నేర్చిరి దర్భవెట్టెడు వ్రేళ్ల
  లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగమట్టియ మీఁదఁ
  గస్తూరికా పుండ్రకములు నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబుల ప్రోవఁ
  దారహారములు ముత్యాల సరులు
చెరువంగ నేర్చిరి శిఖల చెన్నడుములఁ
  గమ్మని క్రొత్త చెంగల్వ విరులు
ధామముల వెంట పైఁడియుఁ దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు
వేమభూపాలుఁ డనుజన్మ వీరభద్రు
ధాత్రి నేలింప గౌతమీ తటమునందు.

కాశీ 1-37.

ఈ పద్యమునందు అల్లయ వేమారెడ్డి, తనయనుజుఁడగు వీరభద్రారెడ్డిచే రాజమహేంద్రవర రాజ్యమును పాలింపఁ జేయుచుండఁగ, గౌతమీతీరాగ్రహారవాసులయిన బ్రాహ్మణులు బహువైభవములతో విరాజిల్లుచుండిరని శ్రీనాథుని నోట మనకు వినవచ్చినది. ఈ పద్యము భీమేశ్వరపురాణ కాశీ ఖండములలో నేకరూపముగఁ గూర్పఁబడినది. మఱియు నీ పద్యమున వేమారెడ్డి యాశ్రయము లభించిన నాఁటి శ్రీనాథుని మూర్తి విభవము కూడ గోచరించుచున్నది.

భీమేశ్వరపురాణ కాశీఖండ కృత్యాదులలో శ్రీనాథుఁడు ప్రధానముగ వేమభూవిభుని ప్రశస్తి నుగ్గడించుచు జతగూర్చిన వాక్యము లన్నియును చారిత్రకముగా పరమసత్యములు. ఆ వాక్యముల కుపష్టంభకములుగా మన కాతని నాఁటి శాసనము లుపలబ్ధము లగుచునే యున్నవి. అల్లాడ వేమారెడ్డి గౌతమీతీరమునందు వేదవేదాంగ విదులయిన బ్రాహ్మణుల కగ్రహారములు దానము చేసెననుటకు, అతఁడు నెలకొల్పిన వేమవర శాసనమే తార్కాణము. 1

ఈ శాసనము 115 సంస్కృత శ్లోకములుగలిగి, కవితా విభవముతోఁ గూడిన ఖండకావ్యమై వెలయుచున్నది. ఈ శాసన మూలము చెక్కియుంచిన రాగిరేకులు నేఁడు లండను నగరములోని వస్తు ప్రదర్శనశాలలో హిందూదేశపు ప్రాచ్య పుస్తకశాఖలో నెలకొల్పఁబడి యున్నటు లీ శాసనమును ఆంగ్లాక్షరములలోఁ బ్రకటించిన 'బర్నెట్టు' దొర తెలిపియున్నారు.2 ఈ శాసనమునందలి సంస్కృతశ్లోకములు, తుదిని గ్రామసీమా విభాగమును దెలుపు వచనము, నానాఁటి తెలుఁగు లిపిలో వ్రాయఁబడి యుండినట్టు లా దొరవారి వ్రాతనుబట్టి తెలియవచ్చుచున్నది. అందు శాసన ప్రతిబింబములు మాత్రము కూర్పఁబడలేదు. ఆంగ్లాక్షరములలో సమగ్ర శాసనము ప్రకటింపఁబడినది. ఈశాసనమున వేమారెడ్డి పాలనమునాఁటి చారిత్రకాంశము లెన్నియో మనకుఁ దెలియవచ్చుచున్నది. ఆ విషయమును కొంత వివరించెదను.

---

1. See. Epi. Ind. Vol XIII PP. 237 to 257. Saka 1356. A.D. 1434.

2. This 'Grant' was presented by Sir Waltor Elliot in 1887 to the trustees of the British Museum, where it is now preserved in the Department of Oriental printed books and Manuscripts, with the register number "Indian Charters 26". A slip of paper pasted on the back, which gives an abstract of the Contents and other notes, states that it was received from Rajahmundry Epi. Ind. Vol XIII PP. 237.

ఈ దానశాసనము, అల్లయ వేమారెడ్డి తుల్యభాగతీరమందున్న 'మహేంద్రవాడ వెదురుపాకయను గ్రామములు రెండిటిని గలిపి 'అల్లాడరెడ్డివేమవరము' అని తనపేర బ్రాహ్మణులకు అగ్రహారముగా నిచ్చినపుడు రచింపఁజేయఁబడినది. అందలి విషయ మీతీరుగ నున్నది.

శ్లో. తుల్యభాగాతటే వేమభూపాల స్సముదిత్వరి
అగ్రహారం ద్విజ న్మైత్ర్యస్సమగ్రాహార మగ్రియమ్
ఏకంగ్రామం కృత్వాగ్రామా వెద్రిపాక పినమ
హేంద్రాడౌ
కృత్వాచ వేమభూపో నిజనామ్నాల్లాడరెడ్డివేమ
వరమ్

శ్రీ సప్తగోదావర తుల్యభాగ
మధ్యాగ్రహారో మహనీయ సస్యః,
ఆచంద్ర మాతారక మాది నేంద్ర
ముజ్జృంభితాం వేమనృపాల ధర్మః'

గోదావరీ సప్తశాఖలలో మొదటిది తుల్యభాగ. తత్తీరమున నేఁటి రామచంద్రపురము తాలూకాకు సంబంధించి, మహేంద్రవాడ, వెదురుపాక యను గ్రామములు రెండుగలవు. ఈ శాసనమునందు 'వెదురుపాక' 'వెద్రిపాక' గను, మహేంద్రవాడ 'పినమహేంద్రాడ'గను వ్రాయఁబడినవి. దక్షారామమునకే వెదురుపాకగ్రామము వాయవ్యమునను మూఁడుక్రోసుల మేరలో నున్నది. భీమేశ్వరాలయమునకు ముందున్న సప్త గోదావరమునకు, తుల్యభాగాశాఖకు నడుమనున్న భూమి యగుటచే నిది పవిత్రతమ మని సూచించుటకు కడపటి శ్లోకమున "శ్రీ సప్తగోదావరతుల్యభాగ మధ్యా గ్రహారః" అని పేర్కొనఁబడినది.

ఈ రెండు గ్రామముల పరిసరభూభాగము బహుసస్యశ్యామలము వివిధఫలవృక్షసము పేతము అతి సారవంతమును. ఈ విషయ మీ శాసనమునం దొక శ్లోకమున నిట్లు వర్ణింపఁబడినది.

'ఫలభరితనారి కేళ, క్రముక పనస చూతకదళి
కారామమ్.
కలమేక్షుశాలి తిలచణ, ముద్గాది సమస్తసస్య
సంపూర్ణమ్

ఈ శ్లోకమునందు వ్రాయఁబడిన తోఁటలు, సస్యములు ధాన్యములు నా ప్రదేశమున విరివిగ మనకీ నాఁడును గానవచ్చుచునే యున్నవి. చెఱుకు తోఁటలకు నాఁడు నేఁడుకూడ నాఖండము మిక్కిలి ప్రసిద్ధము.

అల్లయ వేముఁ డీరెండుగ్రామముల భూభాగమును,ఇంచుమించు నూఱువృత్తులుగ విభజించి, బ్రాహ్మణులకు తత్తద్గ్రామములందలి దేవతలకు సర్వకర పరిహారముగా దానముచేసెను. ఈ దానమునకు ప్రతిగ్రహీతలైన విప్రులు, ఋగ్యజుః సామవేదవేత్తలు' వివిధశాస్త్ర నిష్ణాతులు నైయుండిరని శాసనశ్లోకములు తెలుపుచున్నవి. అందొకశ్లోకమున తదగ్రహారవాసి విద్వాంసుల శాస్త్రవ్యాహారము లిట్లు వర్ణింపఁబడినవి.

శ్లో. ఏకత్ర తర్కంచ పరత్రతంత్రం
వేదాంత మన్యత్ర పరత్రశబ్దం,
వ్యాభాషమాణైః కలకంఠకంఠైః
సంఘోష్యతే యోంబుధివ ద్బుధేంద్రైః.'

ఆ యగ్రహారమునందలి విప్రోత్తములు తర్కము మీమాంస, వేదాంతము, వ్యాకరణము మున్నగు శాస్త్ర విషయములను మధురకంఠములతో భాషించుచుండఁగ నగ్రహారము సముద్రమువలె మార్మ్రోగుచుండెనని దీని భావము. మఱియు నీ శాసనమునందలి శ్లోకములలో నెవ్వరి కెన్నెన్ని వృత్తు లీయఁబడినవియో తెలుపు ప్రకరణమునందు తత్తద్వృత్తి భాగులైన విప్రుల కులగోత్రాదులతో పాటు, వారివారి వేదశాఖలు శాస్త్రపాండిత్యములు కూడఁ బేర్కొనఁబడినవి. వారిలోఁ గొందఱు ఋగ్యజుస్సామములలో నొక్కొక్క వేదము చదివినవారు. మఱికొందఱు ద్విశాఖావేదులు, వేఱొకకొందఱు తర్కవ్యాకరణాది శాస్త్రవేత్తలును గలరు. నిన్నమొన్నటివఱకు వెదురుపాక వివిధ కళలకు నిలయమై యుండినట్లు లచటి వృద్ధులు వాకొనుచున్నారు.

వేమునిభక్తి భావము:

వేమ భూపాలుఁడు పరమశివ భక్తుఁడు; మహోదారుఁడు నను విషయము భీమేశ్వర పురాణ కాశీఖండ కృత్యాదులలో మనకు వినవచ్చుచున్నది. ఆ విషయ మీ శాసనమునందును నిరూపింపఁబడినది.

శ్లో॥ అనేకగోచర్మమహాగ్రహార
దాతా సుధీరల్లయ వేమభూపః
షట్కాల సంపూజిత పార్వతీశో
హేమాద్రి దానాని సదాకరోతి

మఱియొకశ్లోకమున వేమభూపాలుని మహత్త్వమిట్లు నిరూపింపఁబడినది. మార్కండేయమహేశ్వరుఁడు, తన పుత్రులలో విఘ్నేశుఁడు మదయుతుఁడు, కుమారస్వామి బహుముఖుఁడు, భైరవుడు దిగంబరుఁడు నగుటయెంచి, నిర్దోషుఁడు, నిజభక్తుఁడు, ఉన్నతాశయుఁడు, శివార్చాపరుఁడు నగు వేమభూపాలుని సృజియించెనని చమత్కరించినాఁడు కవి.

'శ్లో॥ విఘ్నేశో మదసంగతో బహుముఖ స్స్కందోఽపి ముక్తాంబరో
నిర్లజ్జః ఖలు భైరవోఽయ మితి సంచింత్యాత్మజానాం స్థితిమ్,
నిర్దోషం నిజభక్త మున్నతధియం వీరంశివార్చాపరమ్
మార్కండేయమహేశ్వరోఽవితనుతే వేమేంద్ర ముర్వీశ్వరమ్.'

ఈ వేమ భూపాలుని భక్తివైభవమును శౌర్యవిశేషమును శ్రీనాథుఁడును విశేషముగ వర్ణించియే యున్నాఁడు. అతీరు పరికింతము.

'త్ర్యంబకాచల కన్యకాంబు పూరంబున
నఘమర్షణస్నాన మాచరించి
నిద్దమైన మడుంగు నీర్కావిదోవతి
కనక మేఖలతోడఁ గటి ఘటించి
మూల మంత్రాక్షరంబుల బూతి మంత్రించి
పుండ్రకంబులు ఫాలమున ధరించి
క్రొత్త ముత్తెములతో రుద్రాక్ష మాలిక
లష్టోత్తర శతంబు లఱుతఁదాల్చి
పుండరీకాసనమునఁ గూర్చుండి శంభు
నర్చనముఁ జేయునపుడు మహోగ్రముఁడు
చాల నొప్పారు రెండవ శంభునట్లు
వీరనారాయణుఁడు రెడ్డివేమ విభుఁడు.'
—కాశీ. 1-39.

చారిత్రకాంశములు:

భీమేశ్వరపురాణ కాశీఖండకృత్యాదులలో అల్లాడరెడ్డి వేమారెడ్ల విజయములు సావష్టంభముగ వర్ణింపఁబడినవి. ఆవిషయము లీశాసనశ్లోకములందుఁ దార్కాణింపఁ బడినవి.

'శ్లో॥ జిత్వానల్ప వికల్పకల్పితబలం తంచాల్పఖానంరణే
మిత్రీకృత్య సమాగతం గజపతిం కర్ణాట భూపంచ తం
హత్వా కోమటి వేమసైన్యనికరం భూయోఽపి రామేశ్వరే
ప్రాజ్యం రాజమహేంద్రరాజ్య మకరో దల్లాడ భూమీశ్వరః'

ఈశ్లోకమునం దల్లాడరెడ్డి విజయములు వర్ణింపబడినవి.

'శ్లో॥ దేవబ్రాహ్మణ సీమ్ని యః కరధనం సంత్యక్తవాన్ దుస్త్యజం
దాక్షారామభువి వ్యధత్త విపుల శ్రీ గోసహస్రాణియః
జిత్వా యః పటుసప్తమాడియ నృపాన్ క్రాంత్వా కళింగక్షితిం
సింహాద్రౌ పురుషోత్తమే పటుజయ స్తంభాన్న జృంభాన్వ్యధాత్.'

ఈ శ్లోకమందలి విషయము లల్లయవేమునకుఁ జెందినవి. మఱియు నీశాసనమందు మాత్రమే అల్లాడ వేముఁడు కాటయ పౌత్రియు, కాటయ వేముని పుత్రియు, హరిహరరాయల దౌహిత్రియు నగు హరిహరాంబను బెండ్లాడెనను విషయము తెలుపఁబడినది. వేముని సోదరుఁడు వీరభద్రారెడ్డి కాటయ వేముని కూతురగు అనితల్లిని బెండ్లాడెననియు వివరింపఁబడినది.

'శ్లో॥ పౌత్రీం కాటయ వేమయక్షితిపతేః పుత్రీంచ కాటప్రభోః
దౌహిత్రీం చతురర్ణవీం హరిహర క్షోణీ పతే శ్శాసితుః
తన్నామ్నా విదితాహ్వయాం హరిహరాంబాం చారు మగ్రాహయ
త్ప్రాణౌ వేమమహీశమల్లనృపతే స్సామ్రాజ్య లక్ష్మ్యాస్సమమ్.'

'కాటయ వేమక్షితిపతి,
తనయా మనితల్లి నామ విఖ్యాతామ్,
కమలామివ కమలాక్షః,
స్తాముదవహ ద్వల్లభూప వీరేంద్రః.'

అల్లాడ వేమారెడ్డి హరిహరాంబను పెండ్లాడి నట్టు లీశాసనమునందే నిరూపింపఁ బడినది. వీరభద్రారెడ్డి అనితల్లిని బెండ్లాడినట్టు లితరశాసనము లందును, కాశీఖండము నందును నుగ్గడింపఁబడి యున్నది.

'మనుతుల్యుండగు కాటభూవరుని వేమక్ష్మాత
లాధీశునం
దనఁ బాణిగ్రహణంబు చేసెఁ బ్రియమొందన్ వీర
భద్రేశ్వరుం
డనితల్లి వ్వనితామతల్లి నుదయాస్త్రాద్రీంద్ర
సీమావనీ
ఘన సామ్రాజ్యసమర్థ సుప్రథమసాక్షాదింది
రాదేవతన్.'
—కాశీ. 1-43.

ఇఁక నీశాసనము తుదిని "స్వస్తి. అల్లాడరెడ్డి వేమవరానకున్ను వేమసానక్క దొడ్డవరానకున్ను పొలమేర సీమసంధులు" అని యుపక్రమించి, అగ్రహార సీమావిభాగమును దెలుపు దీర్ఘమైన తెలుఁగు వచన మొకటి గలదు. ఆ వచనమునం దానాఁటి వచన రచనా స్వరూపము కొంత మనకుఁ దెలియఁగలదు. ఆ వచనమునందు మహేంద్రవాడ వెదురుపాకలకుఁ జేరి వివిధ దిశలందున్న గ్రామములు పుంతలు పాడులు పేర్కొనఁబడినవి. వానిని ప్రత్యేక దృష్టితోఁ బరిశీలించినఁ జాలవఱకు తత్తన్నామములతో నిలిచియే యున్నవి. కొన్నిటి పేళ్లు మఱుఁగుపడియున్నవి. నాయూహ కందిన విషయమును గొంత వివరింతును.

శాసనములో 'అల్లాడరెడ్డి వేమవరము' అని పేర్కొనఁబడిన మహేంద్రవాడ వెదురుపాక గ్రామములు తుల్యభాగానదితీరము నంటియున్నవి. మహేంద్రవాడ అనపర్తికి కొంచెము ఈశాన్యముగ రెండుక్రోసుల మేరలో నున్నది. మహేంద్రవాడకు తూర్పుగ రెండుక్రోసుల మేరలో వెదురుపాక గలదు. వెదురుపాకకు తూర్పున 'కొంకుదురు' అను గ్రామము గలదు. వచనములో వేమసానక్క దొడ్డవరము అని పేర్కొనఁ బడినది ఈ కొంకుదురు గ్రామమే. ఈ మూఁడు గ్రామములకు దక్షిణపు టెల్లలో పసలపూఁడి, సోమేశ్వరము, లొల్ల, రామవరము అను గ్రామములు గలవు. రామవర గ్రామవాసులు ప్రసిద్ధహరిదాసులు నగు నల్లమిల్లి బసివిరెడ్డిగారిని గలిసి, మాటాడు ప్రసంగములో, కొంకుదురునకు 'దొడ్డ వరాగ్రహార' మను నామము గలదని, ముప్పదియేండ్లనాఁడు వారికి కొంకుదురు గ్రామస్థులగు పెద్దలు సమర్పించిన సన్మాన పత్రాధారపూర్వకముగ నాకుఁ దెలిపియుండిరి. వృద్ధుల యొఱుకలో ఆనాఁటి కా పేరు నిలిచియుండ నను విషయమును నాకెఱిఁగించిన యుపకృతికి శ్రీ బసివిరెడ్డిగారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈ పొలమేరసీమ సంధులలోఁ బేర్కొనఁబడిన పసలపూఁడి, సోమేశ్వరము, సొల్ల (నేఁటిలొల్ల) పంచలపాక గ్రామముల నామములు నాఁడు నేఁడు నట్టే నిలిచియున్నవి. వేమవరపు తూర్పుసీమలో వెదురుపాక కాగ్నేయముగను, పసలపూఁడి కీశాన్యముగను—వెల్పూరి తల్లవరము—అను గ్రామము ఈ శాసనములోఁ గనఁబడుచున్నది. ఆ ప్రాంతమునం దిప్పటను నది వినఁబడుటలేదు. ఈ శాసనమునకుఁ బూర్వము కాటయవేముని ఆహోబలశాసనములో ఈ వెల్పూరి తల్లవరము కనఁబడుచున్నది. 3

ఈ శాసనమునందుఁ బేర్కొనఁబడిన సీమాసంధి ధానమునుబట్టి, ఈ తిలవరము అనునది రామచంద్రపురమున కుత్తరముగ నొకక్రోసు దూరము నందుండ వలయు నట్లు తెలియవచ్చుచున్నది. అచట నేఁడు 'కొత్తూరు' అను గ్రామమొకటి గలదు. అది తల్లవరము పాడుపడఁగా నేర్పడిన క్రొత్తయూరా? యని యొక యూహ. చాల శ్రమించి కనుఁగొనినను ఆ పేరియూరు ఆ ప్రాంతమున వినరాలేదు.

పశ్చిమసీమలో "వేమవరపు గ్రామగ్రాసపూరి ప్రాంతపుంత పడమరముఖమై గ్రామగ్రాసపూరి నొల్ల పాలి మేరవెంబడిగాను పడమరముఖమై వచ్చెను. అంత రెండూళ్ళున్నవి. అంతనుండి పుంతపడమరముఖమై వచ్చి అన్నపొలారెడ్డి కొమరగిరిపుర గ్రామగ్రాసపూరి ప్రాంతపుంతం గలసెను." వేమవర గ్రామగ్రాసపూరు-అనఁగా నేఁటి రాయవరము. దీనికి పేరు తరువాత యేర్ప

3. See S. i. i. Vol X No 577. Saka 1382 A. D. 1410.

కాటయరెడ్డి వేమారెడ్డింగారికి అర్ధాంగలక్ష్మి ఆఇన ఆ కొమరగిరయ్యంగారే ఇకొమరగిరయ్యంగారై అవతరించిన ఇ[కొ]మరగిరయ్యంగారికి తల్లింగారైన తల్లి పానమ్మంగారు ఇ కొమరగిరయ్యంగారికి[న్ని] కాటమరెడ్డి వేమారెడ్డిం గారికిన్ని సుకృతము గాను గౌతమీ తీరమందున శ్రీ వేదాద్రి నరసిమ్హ దేవరకు ఆ చంద్రార్కము ప్రతిసంవత్సర తిరునాళ్ల మహోత్సవానకు దారవోసి సమర్పణచేసిన వెలుమూరి తల్లవరము.

# అల్లయవేమారెడ్డి వేమవరశాసనము

డినది. అంతకుముందీ రాయవరము పెదుగుపాకకు శివారు గ్రామము నొల్లకు రాయవరమునకు నడుమనుండి బయలుదేలి పశ్చిమముఖముగా వచ్చునపుడున్న రెండూళ్ళు రామవరము పోలవూరును వానివీదుగా వచ్చినపుంత అనపర్తిసావరముపుంతతోఁ గలియును. అన్నపోతారెడ్డి కొమరగిరిపురము అనఁగా 'అనపర్తి' యని నేనూహించుచున్నాఁడను. ఈ అనపర్తి గ్రామమును కాటయ వేమారెడ్డి కొమరగిరి పుత్రుఁడైన అనపోతారెడ్డిచే, రాజమహేంద్రవరమునందలి గోపాల స్వామికి దానముచేయించెను. 4 అనపోతపురము అనపర్తియై యుండునేమో? కాటయ వేమఁడు శాసములవెలసిన గ్రామములకు సాధారణముగా 'కొమరగిరి పురము' అని నామకరణము చేయుచున్నాఁడు. శాసనములో అనపోతారెడ్డి యనుటకు బదులు అన్నపోతారెడ్డి యని పడవఁబడియుండెనా? లేక మూలమునందట్లుండెనో?

మహేంద్రవాటి రాయవరముల మధ్యసీమలో 'కొమరిపాలెము' అను గ్రామమున్నది. అది యీ సీమా సంఘులలో నైరృతి మూలతిరిగాంత, "అంతనుండి ఆపుంత పశ్చిమముఖమై వచ్చెను. ఉత్తరముఖమై రాంగాను కనుచున్నది. అట్టే రాంగాను కొమరగిరి పురపుపొలములోను పుంతవెంబడిను పూవి. షిరావి స్సున్నవి" అని యీ కొమరపాలెము పేర్కొనఁబడినది.

మహేంద్రవాటిమీఁదుగా ప్రవహించిన తుల్య భాగ పెదుగుపాక సావరముపైనఉండి మరలి పందల పాకమీఁదుగాఁ బ్రవహించినది. పెదుగుపాక సమీపమున తుల్యభాగలో నొకసంగమముగలదు. అది పెదుగు పాకవాసుల కొక పవిత్రజలాశయము. పెదుగుపాకకు దక్షిణమున తుల్యభాగకాలువ కనఁబడును. కాని అది గోదావరికి ఆనకట్టకట్టినతరువాత క్రొత్తగాఁ ద్రవ్వఁబడిన మురికికాలువ. పురాతనమైన తుల్యానదీశాఖ పెదురు పాకకు ముందునుండి యేమరలి, పందలపాక మావిడాడ సంపర ముక్తీశ్వరమునీఁదుగా చోల్లంగి చేరినది. ప్రాఁత తుల్యభాగ యేదిశనుగ నుండెనో యీవిషయమీశాసనమునుబట్టియే యూహింపఁగాఁ దెలియవచ్చినది. "ఈశాన్యం పాలిమేరసీమనుంచి తుల్యభాగపడమటిసరిహద్దు కొని దక్షిణముఖమై వచ్చింది. తుల్యభాగ ఆవలివారికి సగమున్ను ఈవలివారికిసగమున్ను. అంతట దక్షిణముఖమై గ్రామగ్రామపుదారి పడపకుండాను దాంకొ వచ్చెను. ఆ తుల్యభాగలోని యుండాను వేంపరానికి చెందునని పందలపాక కాపులు చెప్పిరి. అంతనుంచి తూర్పు ముఖమై తుల్యభాగవచ్చెను. వేంపరానకున్ను పందలపాకకున్ను తుల్యభాగసీమ." పందలపాక సమీపమున, అనఁగా కొండుదురునకు పందలపాకకు నడుమ పెద్దకాల్వకొక ఆతికట్టుప మిగుపార్శ్వములగలవు. దానికిరువైపులను తుల్యభాగాశాఖకు గుర్తులు గానవచ్చుచు నేయున్నవి. తుల్యభాగాశాఖతోఁ గలిసిపోయి పెదుగుపాకమీఁదుగా ప్రవహించుచున్నట్లు గానవచ్చెడి మురికికాలువ తరువాత త్రవ్వఁబడెనను విషయము పెదుగుపాకలో పెద్దలవలనవిని, గ్రహింపగల్గితిని.

ఈశాసనపరిశోధనములోఁ బేర్కొనఁబడిన పల్వూరి తల్లవరమును గుర్తించుటకు కడచిన వేసవిలో చాల శ్రమించితిని. ఇంకను శ్రమించుచుంటిని. వృద్ధులనోట పరిపాటినిబట్టి తెలియవలసినవిషయ మిది. అహోబలశాసనమునందు పేర్కొనఁబడిన గౌతమీతీరమందలి వేదాద్రి నరసింహస్వామి యనఁగా 'కోరుకొండ నరసింహస్వామి' యను విషయమును నేనూహించితిని.

4. మా. రెడ్డిసంచిక అనుపర్తిశాసనము.

# నిద్రాళువు

## శ్రీ పురాణం సూర్యప్రకాశరావు

పొద్దు వాటారింది.

గాలి సాగి సాగి ఒక్కసారు స్తంభించిపోయినట్టుగా మధ్య గదిలో నుంచి వినవచ్చే సందడి ఉన్నట్టుండి ఆగిపోయింది. పార్వతమ్మ గుమ్మంలోకి వచ్చి చూసింది. అంతవరకు కొద్దిసెకన్ల ముందు వరకూ కూచుని చర్చలు, ఉపన్యాసాలు, తీర్మానాలు, తర్జనభర్జనలతో గడిపిన స్త్రీలంతా ఒక్కరొక్కరే ఇంటిముఖం పట్టారు. నారాయణి ప్రతివక్కరి నుదుటా కుంకుమబొట్టు పెడుతూ మర్నాడు ఇంకా ముందుగానే రమ్మని మరీ మరీ చెప్పి వీడ్కోలు ఇస్తూంది.

చలిగాలి వుండీ వుడిగీ ఒక విసురు విసురుతోంది. ఇళ్ళ కప్పులమీద తెల్లటిపొగ సుళ్ళు తిరుగుతూ గాలివాలున పడి సాగిపోతోంది.

నారాయణి సన్నగా కూనిరాగం తీస్తూ గదిలోకి వచ్చి "ఏం పిన్నమ్మా! ఒక్కతివి వంటరిగా కూచుని ఏమిఁ చేస్తున్నటు?" అంది.

పార్వతమ్మ కళ్ళజోడు చివరి నుంచి నారాయణి ముఖంలోకి చూస్తూ "ఏమీఁ లేదమ్మా పుస్తకం చదువుకుంటున్నాను" అంది.

"అంతేనా, లేకుంటే మీ వాళ్ళవరిమీదకైనా ధ్యాసమళ్లిందా?"

"అలాంటిదేమీ వుండదమ్మాయ్. నీకు విసుగెత్తి నువ్వు పొమ్మనాలిగాని అంతవరకూ ఈ చూరు పట్టుకుని వేలాడుతూనే వుంటాను."

నారాయణి వ్యంగ్యంగా నవ్వుతూ "నిన్ను బాగా అర్థం చేసుకున్న మనిషిని కాబట్టి ఇప్పుడు నువ్వన్నమాటని సరదాగా, తేలిగ్గా తీసుకుంటాను. కాని ఒక విషయంమటుకు గుర్తుపెట్టుకోవటం మంచిది. ఆదరించటంలో, అభిమానించటంలోనూ ఈ నారాయణమ్మ ఎవరికీ తీసిపోయేదికాదు. జీవితంలో నిగ్రహం, మట్టు మర్యాదా, సభ్యతా, అభిమానం విడిచిపెట్టే సిగ్గుమాలిన మనిషి నారాయణి కాదు. నారాయణి బరితెగించినఆడది కాదు. భర్త అడుపాజల్లో ఒద్దికగా మసులుకొనే నిగ్రహంగల ఆడది.

ఈ చివరి మాటలు ఏ ఉద్దేశంతో ఎవరికి నిర్దేశించబడ్డవో పార్వతమ్మ గ్రహించకపోలేదు. అప్రస్తుతంగా, ఆమె ఈ ధోరణి ప్రదర్శించటం పార్వతమ్మ మనసుకి కొంత నొప్పి కలుగకపోలేదు. ఇలాంటి మాటలు వినటం పడటం ఇవాళేమీ కొత్తకూడాకాదు.

ఈ నిందా గర్భితమైన ప్రస్తావన ఒక స్త్రీ నోటి నుండి వినటంవల్ల ఆమె మనసులో కోపానికి బదులు కొంత జాలి, బాధ ఆక్రమించాయి. ఆమె ఒక్కసారి బరువుగా నిట్టూర్చి తిరిగి తన దృష్టి పుస్తకంమీదకు మళ్ళించి ఇంతవరకూ చదివిన ఆఖరి పేజీ కోసం వెతుక్కొసాగింది. కాని అప్పటికే చీకటి బాగా అలుముకు పోవటంవల్ల ఆమె ఇక చదవలేక పుస్తకం మూసి దాన్ని భద్రంగా టేబిల్ మీద వుంచి మధ్య గదిలోకి వచ్చింది.

నారాయణి దీపం వెలిగించి గది మధ్యన కొంకికి వ్రేలాడదీస్తూంది.

"అమ్మాయ్! పెద్దదాన్ని నేనుండగా నీకెందుకీ అనవసరపు శ్రమ చెప్పు. ఈ పూటనుంచి నేను వండి పడేస్తాను. నా మాట విను." అంది పార్వతమ్మ.

"ఒద్దులే. నేనే వండుతాను."

"నువ్వలాగంటే నేనేం చెప్పేది. పెద్దదాన్ని నేనుండగా నీకెందుకీ బాధ"

"ఇందులో బాధకేముందమ్మా. ఎవరు వండితేనేం?" అంది నారాయణి.

"నా మనసెంత బాధపడుతుందో నీకర్థం కావటంలేదు."

"నువ్వు చుట్టానివమ్మా. చుట్టాలు చుట్టాలుగానే మన్నించబడాలి" అంది నారాయణి.

పార్వతమ్మ ముఖంమీద నీలిఛాయలు ఆవరించాయి. ఆమె ముఖం ముకుమకుపోయింది. తను ఏ పరిస్థితుల్లో ఈఇంటిగడప తొక్కిందో, ఈ నారాయణమ్మకి తెలియకపోదు. ఆమెనోట మరి మాట పెగల్లేదు. తను వచ్చి కొద్దిరోజులైనా తనవునికి ఇతరులకి బాధావహమైపోయింది అప్పుడే. తనకి మనశ్శాంతితోపాటు భుక్తికూడా అవసరం. అవి లభ్యమయే స్థానంకోసం ఆమెపడిన ప్రయాసలోనే లోకంచేత వేలుపెట్టి చూపించుకునే దురవస్థకి గురికావల్సివచ్చింది. ఇప్పుడు నారాయణి అన్నమాటల వెనుక నిగూఢమైయున్న భావం పార్వతమ్మకి ఒక హెచ్చరికవంటిదనే చెప్పాలి. నారాయణికి భర్త అర్ధనప్పష్ట్యా అయితే భర్త జీవించివున్నంతకాలం వైభవంగాగడిపి భర్తతదనంతరం వీధినిపడి ఒకదిక్కుమాలిన ఆడదాన్ని కొంతకాలం పోషించగలగటం అన్నది పెద్దలెఖ్ఖలోకి రావల్సిన అవసరం లేదు.

"నిరాశ్రయులకి ఈ విశాలప్రపంచంలో ఏమూలనో కాస్త నిలబడే ఆస్కారం లేకపోతుందా అనే ఆశని పెంచుకోవటం తెలివితక్కువ"అని మనసులోనే అనుకున్నదై పార్వతమ్మ వీథివసారాలోకినడిచి మెట్లమీద స్తంభానికి చారబడి కూచుండిపోయింది.

వీథిగేటు తెరుచుకుని అనూరాధ చంద్రుక్నీ వెంటబెట్టుకుని లోపలికివచ్చింది. వస్తూనే "ఏం అమ్మమ్మా! అలా కూచున్నావు మాటామంతీ లేకుండా?" అంది అనూరాధ.

పార్వతమ్మ ఆలోచనల్లోనుంచి తెప్పరిల్లి కంగారు కప్పిపుచ్చుకుంటూ "వచ్చావా అమ్మాయ్! రా! ఇలా వచ్చికూర్చో" అంటూ ఆప్యాయంగా పలకరించింది.

అనూరాధ పార్వతమ్మపక్కగా కూర్చుని తన స్నేహితురాలి అనుభవాలగురించి చెప్పసాగింది.

లోపల నారాయణి వంటప్రయత్నంలో మునిగిపోయింది. మధ్యమధ్య కొడుకుని మందలిస్తూంది. పార్వతమ్మ ఏదో తెలియని అభిమానంతో, సిగ్గుపడుతూవుండీ వుడిగీ వంటగదివైపు చూస్తూ మనవరాలిమాటలు వింటూ వూఁ! కొడుతూంది.

"నువ్వు నే చెప్పేది వింటున్నావా అమ్మమ్మా"

"ఎందుకు వినటంలేదు. అవును, ఆ సరోజని చూట్టానికి పెళ్ళికొడుకువచ్చాడు. వచ్చింతర్వాత ఏమయింది. చెప్పు"

అనూరాధ పెద్దగానవ్వేసి "నువ్వసలు వినటం లేదు. నేను ఆతర్వాత చాలా చెప్పాను. నువ్వింకా మొదట్లో నేవున్నావు" అంది.

"అవునుగాని నేనొకటడుగుతాను చెబుతావా అమ్మా" అంది పార్వతమ్మ మెల్లగా.

"ఏమిటది?"

"మీ అమ్మకంటె నేను పెద్దదాన్నికదా. నేనిలా కూచుని చిన్నవాళ్లచేత చేయించుకుంటె చూసేవాళ్ళేమనుకుంటారు. అదేమైనా బాగుంటుందా?"

"పోనీ నువ్వే వంటచెయ్యకపోయావా?"

"అలాగని నేనంటే మీఅమ్మ వల్లకాదంటుంది."

"పోనీలెద్దూ హాయిగా కబుర్లుచెప్పు లేకపోతే కథలుచెప్పు"—ఈపదిహేళ్ళ అనూరాధ అమాయకత్వానికి పార్వతమ్మ కరిగిపోతూ "నీకు బంగారంలాంటి జతగాడు దొరుకుతాడమ్మా" అంది.

అనూరాధ సిగ్గుతో జేవురించిన ముఖాన్ని పక్కగాతిప్పుకుని "నువ్వు చక్కనిమాటలు ప్రయోగిస్తావు అమ్మమ్మా, చాలామంది మొగుడు, భర్త అంటూ చాలామోటుగా మాట్లాడతారు" అంది.

పార్వతమ్మ "అవునమ్మా వాటిఉచ్చారణలో వినవచ్చేధ్వని చాలాకర్కశంగా వుంటుంది. ఈపదాల్లో లాలిత్యంలేదు. కాని ఆలాలిత్యం చాలాఅవసరం" అంది ఆమె.

కొద్దిసేపు పోయింతర్వాత పార్వతమ్మ ఏదో జ్ఞప్తికి వచ్చినటుగా "అన్నట్టు అడగటం మరిచాను. ఇంతకీ సరోజినికి ఆ సంబంధం కుదిరిందా లేదా?" అంది.

ఇంకా ఏమీ తెలియలేదు. ఆ అబ్బాయ్ ఏమీ బాగుండడనీ వయస్సులోకూడా "వార ఎక్కువగా వుందనీ విన్నాను" అంది అనూరాధ.

"సరోజినీ వాళ్లు బాగా వున్నవారు కారేమిటి?"

"పెద్ద స్థితిమంతులుకారు. మనలాంటివాళ్లే."

"ఆ అమ్మాయికి వరుడు నచ్చాడటనా?"

"అదే నే నడిగాను. దానిదంతా వేదాంతం. 'నాకు నచ్చట మేమిటి? వాళ్ళకి నేను నచ్చాలి. అంతే. అతను నాకు నచ్చటమనే ప్రసక్తిలేదు. అసలది ఒక సమస్య కానేకాదు' అంది సరోజిని. ఇదెక్కడైనా

వుంటా అమ్మమ్మా. ఎంత మగవాడయితేమటుకు, ఆడదానికి మటుకు కోరిక లుండవా ఏమిటి?"

"చూసివచ్చిన ప్రతి మగవాణ్ణీ ఆడపిల్ల తన అభిప్రాయాల దృష్ట్యా ఎన్నుకోవటం అన్నది సాగేది కాదు. సరోజని విషయంలోనూ అంతే అయింది. ఇక ఆమెకి మొగవాడంటూ ఒకడు తన మెళ్లో పుస్తె కడితే చాలు, అనే స్థితికి వచ్చేసింది. విసుగెత్తిపోయింది పాపం" అంది పార్వతమ్మ.

ఏదైనా అనుభవంలోకి వచ్చేవరకూ దాని స్వరూప స్వభావాలు ఊహించగలగటం అన్నది అందరికీ సాధ్యమయేది కాదు. అనూరాధ కూడా ఆ అందరిలోను ఒకర్తె. ఈ పెళ్ళి చూపుల తతంగాలు, బేరసారాలు, నిరసనలు నిరుత్సాహాలు-ఇవన్నీ ఇంకా ఆమెకు అనుభవానికి రాలేదు. ఆమె ఆలోచనలు అడవిలో మామిడిచెట్టును అల్లుకుని స్వేచ్ఛగా విస్తరించుకునే మల్లెతీగకు మల్లే సున్నితంగా సాగిపోతూంటాయి. ఏదో ఒక అందమైన వూహాచిత్రాన్ని నిర్మించుకో గలగటంవరకే ఆమెకు చేతనయింది. ఆ రూపాన్ని, లక్షణాలని స్మరించుకొని తియ్యగా బాధపడగలదు. అంతేగాని ఆ అందమైన కలలు విరిగిన అలలుగా నేల కూలినప్పుడు పొందే భంగపాటును నిభాయించుకోగలగటం అన్నది ఎంత అవసరమో, అటువంటి అవస్థ సంప్రాప్తించటం ఎంత సత్యమో ఆమె వూహించలేదు. అందుకనే సరోజిని అన్నమాటలు ఆమెకు విచిత్రంగా తోచాయి. ఆ మాటల వెనక ధ్వనించే నిస్పృహ ఆమెకి అవగాహన కాలేదు.

అనూరాధని దగ్గరగా హత్తుకుంటూ ఆకాశంలో తెల్లటి మేఘాలచాటునపడ్డ చందమామను చూపిస్తూ "ఈ చందమామ, అలా పరుగులు తీసే మబ్బులు ఒకప్పుడు నన్ను కవ్వించి కవ్వించి ఏడిపించాయి. అయినా నాకు కనువిప్పు కలగలేదు. జాగృతి నాకు లేకపోయింది. నాకు మత్తువదిలి కనువిప్పు కలిగే సమయానికి అంతా మారిపోయిందని తెలుసుకున్నాను. అప్పుడు నా వునికి నాకు అర్థం అయింది."

"నువ్వు వుండి వుండి పిచ్చిగా మాట్లాడుతూంటావు అమ్మమ్మా! నాకేమీ అర్థంకాదు. ఇంతకీ అదేమిటో పూర్తిగా వివరంగా చెప్పరాదూ" అంది అనూరాధ. కాని ఆ కంఠంలోని ఓరుసుతనం లిప్తలో మారిపోయింది.

"అదేమిటి అమ్మమ్మా ఎందుకిలా కన్నీరు పెట్టుకుంటావు" అంది అనునయపూర్వకమైన ధోరణిలో.

"ఏమే అమ్మాయ్! అన్నానికి లేవండి" అంటూ లోపల్నుంచి నారాయణి గొంతు వినపడంతో పార్వతమ్మ కంగారుగా కళ్ళు తుడుచుకుని "వో అమ్మా! అమ్మ పిలుస్తూంది" అంది.

అనూరాధ లోపలికి వెళ్ళింది. పార్వతమ్మ గాఢమైన నిట్టూర్పు విడిచి అనూరాధని అనుసరించింది.

## 2

నారాయణి లోకందృష్టిలో అంత ఆశ్చర్యపడవలసిన మనిషి కాదు. కాని ఆమెను చూసి పార్వతమ్మ ప్రతిక్షణం దిగులు పడుతూనే వుంటుంది. భయపడుతూనే వుంటుంది. అందుకనే తన విషయంలో నారాయణి కొన్ని కొన్ని సందర్భాల్లో కర్కశమైన విధానం అవలంబించినా పార్వతమ్మ దాన్నంత తీవ్రంగా తీసుకోదు. సర్దుకుపోతుంది. చిన్నతనంనుంచీ పెద్దవాళ్ళ చాటున కట్టుబాట్లలో పెరిగిన నారాయణి ఇప్పటికీ ఆ లక్షణాలు, గుణాలు పిసరైనా వదులుకోకుండా తనలో జీర్ణం చేసుకుని మసులుతూంటుంది. ఆమెకీ ప్రపంచంలో భర్త చరణాలు తప్ప మరేమీ అవసరం లేదు. ఆమె హృదయాన్ని అంతగా దోచుకోగలిగిన శక్తిగల వస్తువేది మరొకటి ఈ ప్రపంచంలో లేదు. కన్నకూతురైనా, కొడుకైనా, మరింకెవరైనా వాటి తర్వాతనే. అందుకనే ఆమె తల్లి పుట్టింట జబ్బులో వుండి సహాయానికి రమ్మనమని కబురు చేసినప్పుడు నారాయణి నిర్మొహమాటంగా వీలులేదని జవాబు పంపించింది. భర్తకి ఎక్కడ ఇబ్బంది కలుగుతుందో అని ఆమె ఆలోచించింది. తండ్రిపోయిన కొత్తలో విధవ తల్లి తోడుగా నాలుగురోజులుండమని ఆమె ప్రాధేయపడితే "నేను ఒంటరిదాన్నా అమ్మా, వారిని ఎవరు చూస్తారు చెప్పు- అని సమాధానం చెప్పింది. ఆమె ఈ ముప్పయి అయిదు సంవత్సరాలలోనూ ఎన్నడూ గుమ్మం వదిలి ఎక్కడా నాలుగురోజులున్న పాపాన పోలేదు. తల్లి మనసు కష్టపెట్టుకుంటే ఆమె చెప్పిన సమాధానం ఇది- వారు అందరివంటి మనిషి కారమ్మా నేను ఒక్కక్షణం లేకపోతే వారికీ ఇంట్లో అంతా అయోమయం అయిపోతుంది. ఉదయం లేచింది మొదలు రాత్రి నిద్రపోయేవరకూ ఆయనకు సంబంధించిన ప్రతి చిన్నపని నేను చూసుకోవాలి. నిజంగా

# నిద్రా ఋవు

ఆయింట్లో ఏవస్తువు ఎక్కడుంటుందో ఆయనకి తెలియదు. అలాంటి పరిస్థితుల్లో నేనిక్కడే వుండిపోతే ఎలాగు చెప్పు. నేను లేకపోతే ఆయన వేళకి అన్నం తినటం కూడా మానేస్తారు. మాసినబట్టలు వేసుకునే ఆఫీసుకి వెళ్ళిపోతారు. ఆలమారు తీసుకుని ఇస్త్రీబట్టలు తీసుకోవటంకూడా ఆయనకు చేతకాదు. అసలే ఇంట్లో గడిపేకాలం కొద్ది. నేనుకనక లేకపోతే అసలు ఇంటిముఖమే చూడరు," అంటూ చాలా చెప్పింది. తల్లి అంత దుఃఖంలోనూ కూతురు కాపురంలోని అన్యోన్యతకి మురిసిపోయింది.

"పోనీలే లల్లీ నీయింటికి నువ్వెళ్ళు" అంది ఆమె.

తల్లి పోయిందని తెలిసినప్పుడు నారాయణి ఈ సంఘటన జరిగాక తెప్పరిల్లే చాలాకాలం బాధపడింది. ఇంతకన్న తల్లినే కష్టసమయంలో దూరం చేసుకోగలిగిన నారాయణమ్మ తన విశ్వాసాన్ని సహస్రాంశమైనా భంగపరుచుకోకుండా ఇన్నాళ్ళనించి కాపాడుచేస్తోంది. భర్తను "ఇలాగైతే ఎలాగు చెప్పండి" అనే తిరస్కారపూరితమైన మాట ఎన్నడూ ఆమె అనలేదు. ఆమె మనోఫలకం మీద లిఖించుకున్న మంత్రం: ఎలా జరుగుతున్నది అలా జరుగుతుంది, అంతా భగవంతుని ఇచ్ఛ—ఇది. ఈ నెల యింతే జీతం ఇస్తున్నాను అని ఆయన చెప్పనుకూడా చెప్పకుండా సగానికిసగం ఖర్చుచేసి మిగిలింది చేతిలో పెట్టినప్పుడు "పోనీలెండి ఎలాగో గడుపుకుందాం" అనేది నారాయణి. అక్కడికి ఆమె చాలా బాధపడి ఆ "ఎలాగో" అనే నీరసమైనపదం పొరబాటున నోట్లెనందుకు మనసులో నొచ్చుకుని భర్త మనసు ఎక్కడ నొచ్చుకుంటాడోనని, "దివ్యంగా వెళ్ళిపోతుంది. ఏమీ ఫర్వాలేదు" అని మళ్ళీ సర్దిచెప్పేది. అవునుగాబోలు అంతకంటె ఎక్కువవెచ్చం ఈ సంసారానికి అనవసరంకాబోలని ఆయన అనుకుని ప్రతినెలా ఇంచుమించు అలాగే ఇస్తూంటారు. నారాయణి ఏనెలా ఇల్లుగడపటం అన్నది ఇబ్బందిగా వున్నదని తెలిసినా ఎన్నడూ ఎదటపడి "రెండొందలు జీతం తెస్తున్నారుకదా ఇలా ఎనభైలూ తొంభైలు ఇస్తే ఎలాగు చెప్పండి. ఇంత సంసారం గడవాలా?" అని అడగదు.

"ఇలాగే నాలుగురాళ్ళు వెనక వేసుకుందాం. ముందు ముందు అవసరం వస్తుంది. పిల్లలుగలవాళ్ళం" అనే ముందుదృష్టిలేకుండా ఆ సంసారం నెట్టుకొస్తున్నారు.

ఒకటి రెండుమార్లు కూతురు వివాహప్రసక్తి నారాయణి తీసుకొచ్చినప్పుడు వీరభద్రంగారు అవును చెయ్యాలి అన్నారంతే. అంతకుమించి తానుగా ఆందోళనపడి పూనుకుని నడుంకట్టుకుని వరునికోసం అంటూ వెతికినపాపాన పోలేదు. తానుగా ఆ ప్రసక్తి ఎన్నడూ తేవటం వుండదు. 'ఈలోకంలో నాకు కావల్సిందల్లా వేళకి భోజనం, రాత్రి పేకాడుకుందుకు క్లబ్బూ—ఈ రెంటికి మించినది మరొకటి లేదు నాకు.' అన్నట్టుగా వుంటారాయన. ఆయనకి మొదట్నించీ అలా సాగుతోంది. మొదట్నించీ కూడా నారాయణి ఎక్కడికక్కడే సర్దుకుపోయే మనస్తత్వంతో ఇదివుంది - ఇదిలేదు—ఇలాంటి ఇంటి బాధ్యతలు కూడా అంతా తనమీదనే వేసుకుని పొరుగింటి అబ్బాయిని, పనిమనిషిని బతిమిలాడి, మంచి చేసుకునో, అణాలూ, బేడలు మదుపుపెట్టో ఇంటికి కావల్సినవి తెప్పించుకుంటూంటుంది. ఇప్పటికీ అంతే, ఈవిధమైన పరిసరాల్లో ఆయన మనసు మరింత సంకుచితమైపోయింది. తను ఇంటి బాధ్యతలు పట్టించుకోకపోవటంవల్ల కలిగే ఇబ్బందిని ఆయన వూహించలేకపోయారు...అలా వూహించే అవసరం లేకపోయింది. దాంతో ఆయనకి సంసారం అంటే సరైన దృక్పథం లేకుండాపోయింది. జీవితంలో అతి ముఖ్యమైన బాధ్యతల విషయంలో ఆయనకి చాలా చులకనైన, తేలికైన అభిప్రాయాలు ఏర్పడిపోయాయి. ఎవరన్నా ఈ సంసారం ఈదలేక చస్తున్నాను! అంటే ఆమాట ఆయనకి చాలా హాస్యాస్పదంగా తోస్తుంది. వీళ్ళంతా తెలివితక్కువవాళ్ళు అన్నట్టుగా ఆయన తేలిగ్గా నవ్వేస్తూంటారు. ఆయనకున్న పెద్ద బాధ్యతల్లా క్లబ్బు నిర్వహణ. అది సక్రమంగా సాగుతుందా లేదా, ఎవరెవరు చందాలు సరిగ్గా నెలవారీగా చెల్లిస్తున్నారు, ఎవరెవరు ఎగవేస్తున్నారు? ఇదిచూసుకోవటంవరకే. అందులో ఆయన ప్రస్తుతం కార్యదర్శి పదవి నిర్వహిస్తున్నారు. ఒక్కొక్కరోజు ఆ లెక్కలు చూసుకోవటంలోనూ, ఒళ్ళు తెలియకుండా తాగి పేక ఆటలో తగువులాడుకునే వాళ్ళని చాకచక్యంగా సర్ది

ఏ ఒక్కరూ క్లబ్బుమీద అవిశ్వాసం ప్రకటించి సభ్యత్వానికి రాజీనామా ఇవ్వకుండా చూసుకోవటంలోను ఆయన బుద్ధి చాలా, పదునైనదని చాలామంది కార్యవర్గ సభ్యులు ఆయన్ని వుబ్బితబ్బిబ్బు చేసేస్తూంటారు. సహజంగా కొస్త ప్రశంసలకి వుబ్బిపోయే తత్వంగలమనిషి కావటంవల్ల ఆయన తన బాధ్యతను మరింత శ్రద్ధగా పట్టుదలగా నిర్వహిస్తూ అవసరమైతే ఒక్కొక్కసారి ఇంటిముఖమే చూడకుండా గడిపిన సందర్భాలుకూడా లేకపోలేదు. ఇల్లు వదిలిపెడితే ఇంతబాధ్యతా భరించగలిగే వీరభద్రంగారు ఇంట్లోమటుకు కనీసం ముఖం కడుక్కొందుకు నీళ్ళయినా ముంచుకోలేరు. అదీ నారాయణి అందివ్వాల్సిందే. ఈ పద్ధతిలో కించిత్తు లోపం జరక్కూడదు. అసలు జరగదుకూడాను. ఆయన ఇంట్లో వుంటే ఆ పదినిముషాలుకూడా, ఆ క్లబ్బుగొడవలే కథలు కథలుగా చెబుతారు. నారాయణి ఆయన మనసు ఎక్కడ చిన్నబోతుందోనని ఒక చెంప నిద్రకమ్ముకుని వస్తున్నా అణచుకుంటూ ఎంతో శ్రద్ధగా వింటున్నట్టుగా నటిస్తూంటుంది. తానుగా ఈ సంసారంలో ఇది వుంది, ఇదిలేదు, ఈ పెళ్ళికెదిగిన అమ్మాయి సంగతేవిటి? అనికూడా ఆమె నోరువిప్పి అడగదు. ఆయనంతట ఆయన ఇటువంటి విషయాలు అంత ముఖ్యమైనవిగా పట్టించుకోరు: ఒక్కముక్కలో చెప్పాలంటే నారాయణికి గడిచిన నిమిషంతో గాని- గడవబోయే నిమిషంతో గాని అంతగా ప్రమేయం పెట్టుకోదు. నడుస్తున్న క్షణంలోనే ఆమె ఆలోచనలు పరిమితమై వుంటాయి. నారాయణిలోని ఈ అద్వితీయ గుణసంపద చాలామంది స్త్రీలని ఆకర్షించింది. వాళ్ళంతా ఆమెను తెగ అభినందిస్తూంటారు. ఆదర్శప్రాయమైన వ్యక్తిగా ఆమె నలుగురి మన్ననలనీ పొందగలిగింది. "ఏదో ఇలాగ కాలం వెళ్ళిపోతేచాలు, అన్నట్టుగా నిర్లిప్తతగా, గంభీరంగా ఆమె నవ్వే నవ్వులోని గర్వపాంకాలకి ఆ నారీలోకం అంతా ముగ్ధులైపోతూంటారు. అలా ఆమె నవ్వినప్పుడే పార్వతమ్మగుండెలు చెరువైపోతాయి. ఆమె మనసు భయభ్రాంతమై కుతకుతలాడిపోతుంది. కాని ఏమీ అనలేక, ఈ అమాయకత్వానికి దిగులుపడుతూ అనూరాధని గట్టిగా హృదయానికి హత్తుకుంటుంది. "జీవితంలో చెలగాటాలాట్టం చాలా ప్రమాదం. ప్రతిక్షణం ఎంతో దూరదృష్టితో మసులుకున్నా కష్టాలు తప్పవు. అలాంటిది ఇంత నిర్లక్ష్యంగా వుంటే ఎలాగమ్మా? ఎలాగ చెప్పు. ఈ రోజులు ఎలాంటివి.?" అంటుంది పార్వతమ్మ. అనూరాధ కళ్ళల్లోకి చూస్తూ తన చెంపలు చెరువు చేసుకుంటుంది పార్వతమ్మ.

ఇవాళ ఏమైనా కానీ, ఎవరేమనుకున్నా తన హద్దుమీరి ఒకవిషయం గట్టిగా అడగాలనుకున్నది పార్వతమ్మ. రాత్రి భోజనాలదగ్గిర తనమనస్సులోని విషయాన్ని వెళ్ళగక్కింది.

"అవునుగాని ఎన్నాళ్లని అమ్మాయిని ఇలా వుంచుకుంటాం నాయనా! దాన్ని ఒక ఇంటిదాన్ని చెయ్యవద్దూ?" అంది.

నారాయణి ఏమీ మాట్లాడలేదు.

ఈ కూతురు పెళ్ళి ప్రసక్తి తెచ్చినప్పుడల్లా వీరభద్రంగారికి చాలా ఇబ్బందిగా వుంటోంది. ఈ ప్రస్తావన ఆయన కంతగా రుచించలేదు కాబోలు ముఖం చిట్లించి "అవును చెయ్యాలి మరి" అన్నారు ముక్తసరిగా.

"చెయ్యాలంటే అందుకు గట్టిప్రయత్నం వుండవద్దూ?"

ఏదీ కలసిరావటంలేదు. ఈ ఉద్యోగంతో అసలు తీరటంలేదు." అన్నారాయన అయిష్టంగానే.

"కలిసిరావటానికి మనం చేసిన ప్రయత్నం ఏముందసలు? వాటంతటవి వస్తాయా? ఎంత శ్రమపడితే కుదురుతాయి. ఎరికలోవున్న సంబంధం ఏదైనా వుందా?" అంటూ ఆమె ఆయన విసుక్కుతగ్గట్టుగానే రొక్కించసాగింది.

ఒకవిధంగా ఈ ప్రశ్న పరంపర ఆయన్ని చాలా ఇరకాటంలో పెట్టాయి. ఆయన ఏమీసమాధానం చెప్పకుండానే "నేను పెద్దవాన్ని కాబట్టి చనువుతీసుకొని చెబుతున్నాను. ఏమీ అనుకోకు నాయనా. ఇన్నాళ్లనుంచి చూస్తున్నాను. నీకసలు బొత్తిగా ఇంటిబాధ్యత లేదు. అసలు పదహారేళ్ళ కూతురు పెళ్ళికి ఎదిగి వుందనే ధ్యాసే నీకు వున్నట్టు తోచటంలేదు. ఎన్నాళ్ళని ఇలా సాగుతుంది నాయనా! కొస్త ఆలోచించుకోవద్దూ" అంటూ ఆమె తన వునికినే విస్మరించి మాట్లాడే సాహసం తెచ్చిపెట్టుకుంది. ఈ మాటలు ఎంతవరకూ పని చెయ్యాలో అంతవరకూ పని చేసాయి.

ఆయన "పెళ్ళి చెయ్యాలంటే పోసేటంత డబ్బు కావద్దూ. మన దగ్గర అంత డబ్బు లేదుగా" అన్నారు.

తను చాలా తెలివిగా జవాబు చెప్పానని ఆయన అనుకున్నారు.

"అవును కావాలి. అందుకని పెళ్ళి మానుకుంటామా?" ఎక్కడైనా అప్పన్నా తెచ్చి చెయ్యాలి. నేనింతగా ఎందుకు చెబుతున్నానంటే మనం ఏదైనా ఒక మంచి సంబంధం చూసి ఆపిల్లని ఓ ఇంటిదాన్ని చెయ్యాలి. లేదా దాని రెక్కలమీద అది ఆధారపడ గలిగే అర్హతయినా ఆమెకి మనం కల్పించాలి. వూరికే ఇంట్లో పెట్టుకునే బదులు చదివించినా బాగుండేది. ఏదీ లేకుండా ఆమె జీవితం ఏంగాను. ఇలాంటి సమస్యలు జాగ్రత్తగా ఆలోచించుకుని సాధ్యమైనంత త్వరగా పరిష్కరించుకోవాలి. ఆపిల్ల ఎదిగినకొద్దీ పెళ్ళిళ్ళు కావటం కష్టమైపోతుంది. ఇంత నిర్లిప్తతగా వుండటం ఏమీ బాగాలేదు." తలుపు వారనుంచి అనూరాధ గాజులగలగలలు విని ఆమె అతి ఉద్విగ్నంగా "అతిముఖ్యమయిన విషయాలపట్ల ఇలా పట్టించుకోకుండా బాధ్యతారహితంగా తోసుకు తిరగటం చాలా ప్రమాదం నాయనా...చాలా....ప్రమాదం..."

"ఏమిటో ఆ ప్రమాదం?" అన్నారాయన చాలా తేలిగ్గా.

"నీకు అర్థంకాదు నాయనా. నాకు తెలును"అని ఆమె కంట నీరు పెట్టుకుని ఎవరూ గమనించకుండా ముఖం చాటుచేసుకుని తుడుచుకుంది. వీరభద్రం గారు ఈమనిషిధోరణికి చిరాకు పడుతూ "ఏ ప్రసక్తి తీసుకు రావటానికైనా సమయాసమయాలుంటాయి. తిన్న అన్నం సయించాలా? అది వంటపట్టాలా? ఏమిటీ గొడవ" అన్నారాయన చేతిలోముద్ద విస్తరిలోకి విసిరి.

భర్తముఖంలోని అసంతృప్తి గమనించిన నారాయణి ఇక సహించలేక "పిన్నమ్మా, ఆయన కూతురు వివాహంగురించి ఆయనకి బాధ్యత లేదనా నీ అభిప్రాయం. ఆ పాఠాలు నీదగ్గర ఆయన నేర్చుకోవాల్సిన పనిలేదు. అన్నీ అవే జరిగిపోతాయి. దేనికైనా కాలం కలిసిరావాలి. మన ప్రయత్నాలు వృథా." ఈ చివరి రకం వేదాంతానికి పార్వతమ్మ "నువ్వుకూడా అలాగే అంటే ఎలాగమ్మా! దేనికైనా మన ప్రయత్నంకూడా వుండవద్దూ. తల్లివై యుండి తొందరచెయ్యటం పోయి నువ్వూ అలాగే ఆ చిన్నదాని భారం భగవంతుడిమీద వేస్తావా?" అంది.

నారాయణికి ఈ వాదనంతా ఒక అప్రస్తుత ధోరణిలా తోచసాగింది. ఆమెకు కూతురు వివాహం గురించి ఆత్రుతగాని, ఆందోళనగాని లేదని అనుకుందుకు వీల్లేదు. కాని ఈ సమస్య భర్తమనసుని మటుకు నొప్పించటం ఆమె సుతరామూ అంగీకరించదు. భర్తని రెక్కించి అడిగే అధికారం తనకే లేనప్పుడు ఎవరో ఒక అంతరబొంతరవ్యక్తి ఈ ధోరణిలో మాట్లాడటం ఆమె సహించలేకపోయింది. "ఇప్పుడు కొత్తగా బాధ్యతల గురించి నీదగ్గర తెల్సుకోవాల్సిన అవసరం లేదమ్మా. ఇక ఆ ప్రసక్తి నువ్వు తీసుకురావద్దు. ఆయన తినే నాలుగు మెతుకులు వంటపట్టాలా? నీపాటి ఆలోచన నాకు లేక నేనా ప్రసక్తి తీసుకురావటంలేదని నీ అభిప్రాయమా?" అంటూ నారాయణి చాలా తీవ్రంగా, గౌరవహీనంగా మందలించింది.

"నారాయణీ! నువ్వు నా కూతురు లాంటి దానివి. నువ్వేమన్నా నేను సహిస్తాను. అందులో పిలవనిపేరంటంగా నీయింటికి వచ్చి నీ తిండి తింటున్న దాన్ని. ఈ విషయం నాకనవసరం అని మీరు భావిస్తూ వుండవచ్చు, అనూరాధ నీకు ఎంతో నాకూ అంతే. దాన్ని ఒక యింటిదాన్ని చెయ్యండి. ఈమాటచెప్పే అర్హత నాకేకాదు. మీదంపతుల తీరు చూసిన ఏబుద్ధి గల వ్యక్తికైనా ఆ అర్హతవుంది. నారాయణీ! నిన్ను చూస్తుంటే ఒకప్పటి పార్వతమ్మ అద్దంలో మాదిరిగా కన్పిస్తూందిప్పుడు. ఆ పార్వతి మేనా ఈనాడు పిడికెడు మెతుకులకోసం" ఇక ఆపైన మాటపెగలక ఆమె లేచి పెరటిలోకి వెళ్ళిపోయింది.

వీరభద్రంగారు అయోమయంగా భార్య ముఖంలోకి చూసారు. ఆమె అంతకన్న బాధగా భర్త ముఖంలోకి చూస్తూ వుండిపోయింది. "దేనికో అమ్మమ్మా! నా గురించి నీకెందుకీ బాధ" అన్న అనూరాధ గొంతువిని భార్యాభర్తల ముఖాలు వెలవెల బోయాయి.

## 3

నారాయణి యింట్లో సమావేశమైన మహిళా మండలిలో ఆనాడు మనోరమ అనే కొత్త వ్యక్తి అందరికీ పరిచయం చెయ్యబడింది. మనోరమ పచ్చగా కొద్దిగా ఎరుపువారిన జుట్టుతో, పల్చగా, నుదుట తిలకంతో, అతిసాధారణమైన, సామాన్యమైన వస్త్రాలంకరణతో సంసారపక్షంగా వుండే మనిషి. ఆమె మూలు

లోని సౌశీల్యాన్ని బట్టే ఆమె హృదయపు లోతుని కొలవటానికి ప్రయత్నించిన మొదటి మనిషి పార్వతమ్మ. మిగిలినవారెవరూ ఆ దృష్టితో ఆమెను చూడలేకపోయారు. వారంతా ఆమె చరిత్ర విన్న తర్వాత అందులో ఏ మూల ఏ లోసుగు దొరుకుతుందా అని పట్టుకుని ఆమెని తమ నిశితమైన వ్యంగ్యధోరణికి గురి చేద్దామా అనే దృష్టితోనే ఆమెను పరిశీలించసాగారు. నీతులు, నియమాలు, శీలం,—వీటి ఆవశ్యకత ఆడవాళ్ళకున్నంతగా మొగవాళ్ళకి వుండదని చాలామంది స్త్రీల అభిప్రాయం. అందుకనే ఆడవాళ్ళ విమర్శకి ఆడవాళ్ళు గురయినంతగా మొగవారు గురికారు. అక్కడ సమావేశమైన చాలామందికి మనోరమ జీవిత చరిత్రలోని అతి ధైర్యోదాత్తమైన సంఘటనలూ, సన్నివేశాలూ, అతి నీచాతినీచమైన, అవినీతితో కూడిన తొందరపాటు చర్యగా, బరితెగించిన లక్షణాలుగా తోచాయి. ఆమె ప్రస్తుత స్థితికి మూలమైన కారణాలేవీ వారి దృష్టికి ప్రధానాలుగా తోచలేదు. వారి అభిప్రాయమల్లా ప్రస్తుతం ఆమె లక్ష్యం పట్టనే.

"అయితే చదువుకుందామని ఇక్కడికి వచ్చారా?" అంది నారాయణి.

"అవును" అని మెల్లగా సమాధానం చెప్పింది మనోరమ.

"ఆ తర్వాత ఏం చేద్దామని?"

"అవసరమైతే ఏదైనా వుద్యోగం చేస్తాను."

"మరి నీ భర్తమాట."

"అదృష్టం బాగుండి వారికి ఏదైనా కలిసివస్తే మంచిదే. లేకపోతే నా సంపాదనతోనే గడుపుకుంటాం"

"అసలు ఇలా చదువుకోవటంలో నీ వుద్దేశం ఏమిటమ్మా" అంటూ మళ్ళీ మొదటికి వచ్చింది నారాయణి. ఆమెకి మనోరమ చెప్పిందంతా సరిగ్గా బోధపడినట్టు లేదు.

మనోరమకి ఈ ధోరణి చిరాగ్గా వుంది. స్నేహపూరితమైన వాతావరణం ఆమెకి ఇక్కడ కనిపించటం లేదు. ఇదేదో న్యాయవిచారణసందర్భంలా తోచసాగింది. తన్ని బోనులో నిలబెట్టి వీళ్ళంతా శల్యపరీక్ష సాగిస్తున్నారు. "నేనున్న పరిస్థితుల్లో ఇలా చెయ్యటం తెలివైన పని అని నేననుకున్నాను. నా రెక్కలమీద నేను ఆధారపడగలిగే శక్తి నాకుండాలి. ప్రస్తుతం ఒక్కగా నొక్క కొడుకు భవిష్యత్తు చూసుకోవాలి. ఆయనకి జీవితంలో ఇంతవరకూ ఒక వుద్యోగమంటూ స్థిరపడలేదు. నేనుకూడా వారికి భారంగా ఎంతకాలం అని వుండగలను. ఈ చదువు నాకు ప్రాణావసరం" అంది మనోరమ.

"అవునమ్మా నువ్వు చాలా తెలివైన పనిచేశావు" అని మెచ్చుకుంది పార్వతమ్మ. ఆమె ఏదో కొత్త ఆవేశంతో లేచి మనోరమ పక్కగా వచ్చి కూర్చుని ఆమె భుజం నిమురుతూ "బాగా శ్రద్ధగా చదువుకో అమ్మా. నాలుగురోజులు శ్రమపడితే నీ లక్ష్యం ఫలిస్తుంది." అంది ఆప్యాయంగా.

ఈ చర్య నారాయణికే కాదు చాలామంది స్త్రీలకు వింతగా తోచింది.

"అయితే నీ చదువు పూర్తి కాకుండానే మీ ఆయనకి ఉద్యోగం దొరుకుతే?" అంది నారాయణి. "దానికేం చెబుతావు?" అన్నట్టుగా అంతా ఆమె ముఖంలోకి చూసారు. ఇన్ని ముఖాలు తన్ని పరీక్షించటం గమనించి "అయినా చదువుతాను" అంది మనోరమ దృఢమైన స్వరంతో.

ఈ కంఠంలోని పట్టుదల పార్వతమ్మని ఆకర్షించింది. ఆమె వుత్సాహంగా మనోరమ ముఖంలోకే చూస్తూ కూర్చుండిపోయింది.

"ఇందుకు మీ ఆయన ఒప్పుకున్నాడనుకోను" అంది నారాయణి.

"ఎందుకు వప్పుకోరు. ఒక వేళ ఆయన కది అంగీకారయోగ్యం కాకపోయినా ఈ విషయంలో ఆయన ఇష్టాఇష్టాలతో నాకు నిమిత్తం లేదు. నేను చెయ్యదల్చుకున్న పని చేసి తీరతాను. ఈ పట్టుదల నాలో సడలకుండా వుండాలి. ఇది ఒక దీక్ష." అని మనోరమ క్షణం ఆగి ఎవరూ నిశ్శబ్దాన్ని భంగపరచకపోవటం గమనించి "నాకుమటుకు కట్టుకున్న భర్తనీ, కన్న కొడుకునీ తలావకచోటా వదిలి ఇలా వుండటం మనసా. కాని ఆ పట్టుదల అవసరం. జీవితం అనుకున్నంత సులువైంది కాదు. కాలం ఎదురుతిరిగినప్పుడు కాళ్ళూ, చేతులూ తేలేసి చేతకానితనంతో సర్వం భగవంతుడిమీద భారం వెయ్యటం అన్నది అంత తెలివైనపని కాదు. అసది ఇలా చదువుకోవటమే మహా అవమానకరమైన సంగతయితే ఇంత

కంటె అవమానకరమైన స్థితికి స్త్రీ దిగజారవలసి వస్తుంది. భర్త జీవించి వున్నంతకాలం హాయిగా గడిపిన ఆడవాళ్ళు అనేకమంది అంతిమదినాల్లో నెత్తిన ముసుగు వేసుకుని ఇంటేంటికీ తిరిగి తిరిపమెత్తుకున్న వాళ్ళని చూసాను. శీలం అమ్ముకుని బ్రతికినవాళ్ళని చూసాను: రైలుకింద తలపెట్టి ఆత్మహత్య చేసుకున్న వాళ్ళని చూసాను. ఇలాంటివి ఎన్నో విన్నాను. మనం బుద్ధిమాంద్యం పెంచుకుని జీవితంలో గౌరవప్రదంగా రోజులు వెళ్ళబుచ్చుకునే అవకాశాన్ని మనం ఎందుకు వదులుకోవాలి. ఇక కొద్దిరోజుల్లో నా ట్రెయినింగు పూర్తయిపోతుంది. ఆతర్వాత అవసరమని తోస్తే వుద్యోగంలో ప్రవేశిస్తాను. అప్పుడిక నేను కేవలం బ్రతకటం అన్నది ఓ సమస్యగా పరిణమింపచేసుకుని ఆత్మహత్యలకు పూనుకోవాల్సిన అగత్యం వుండదుగా." అంది.

ఈ ధోరణి పార్వతమ్మ హృదయానికి నాటుకున్నంతగా మరెవ్వరి గుండెలనీ స్పృశించలేక పోయింది. వారికదంతా హాస్యాస్పదంగానూ, తేలిగ్గానూ తోచింది. చేస్తున్న తెలివితక్కువపనిని సమర్థించుకునే వ్యర్థప్రలాపాలుగా వారు అర్థం చేసుకున్నారు. పార్వతమ్మ కళ్ళు చెమ్మగిలటం ఎవరూ గమనించలేదు. ఆమె బలవంతాన అణుచుకుంది. ఆమె ఆపాదమస్తకం కంపించిపోయింది. మనోరమ ఆడిన ప్రతిమాటా తన్ని వుద్దేశించి అన్నట్టుగానే పార్వతమ్మ గిజగిజలాడిపోయింది. విషాదభారంతో ఆమె లేచి అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లగా అక్కడ్నించి నిష్క్రమించింది. చింతాక్రాంతమైన ఆమె హృదయంలో సముద్రఘోష ఆరంభమయింది. ఉన్వృత్తుగా లేచిన అలలు ఫెడిల్లున వడ్డున విరుచుకుపడ్డట్టుగా ఆలోచనలు మథించసాగినాయి. గదిలోకి నడిచి తలుపు దగ్గరగా వేసి నేలమీదపడి వెక్కివెక్కి ఏడ్చింది. ఏడ్చిఏడ్చి అలాగే సొమ్మసిలినట్టుగా పడిపోయింది. తిరిగి ఆమెకు స్పృహవచ్చి లేచేసరికి ఎదురుగా తన వంక ఆతృతగా చూస్తున్న అనూరాధ అగుపించింది. ఆవారనే మనోరమ కూడా వుండటం గమనించి లేచి కూర్చుని చీరచెరగుతో ముఖం తుడుచుకుంది.

"మీరు పడుకున్న తీరుచూస్తే అది నిద్రలా లేదు. వంట్లో ఏదోతేడా వచ్చినట్టుంది. ఇప్పుడు తగ్గిందాండి" అంది, మనోరమ, ఎంతో పరిచయంవున్న మనిషిలా.

పార్వతమ్మ "అవునమ్మా కళ్ళు తిప్పింది. ఇప్పుడు తగ్గింది" అంది.

"నే నన్నమాటలు మీకు కష్టం తోచివుంటే క్షమించండి. నేను మూర్ఖురాల్ని. మీ ఎదట నేనలాంటి ధోరణిలో మాట్లాడ్డం తెలివితక్కువ కాకపోతే మరేవిఁటి? మీగురించి కొంత విన్నాను. మరి కొంత నేను వూహించాను." అంటూ ఆమె పూర్తి కానివ్వకుండానే అర్ధాంతరంగా అందుకొని "అవునమ్మా నువ్వు వూహించింది నాకు తెలుసు. అదంతా నిజం. నువ్వు సరిగానే వూహించావమ్మా. నువ్వన్న మాటల్లో ఏవీఁ తప్పులేదమ్మా. ఎక్కడ కుళ్ళు కనిపించిందో అక్కడ వేలుపెట్టి చూపించావు. నువ్వు బాగా చదువుకుని నీ పట్టుదల నెగ్గించుకుని ఒక ఆదర్శప్రాయమైన వ్యక్తివి కావాలమ్మా. నువు నెగ్గుతావనే ధైర్యం నాకుంది. మా అనూరాధ కూడా ఇలా చదువుతే బాగుండును" అంది పార్వతమ్మ.

"అవును అమ్మమ్మా! నాకూ చదువుకోవాలనే వుంది. కాని అమ్మకి తెలుస్తే ప్రాణాలు తీసేస్తుంది" అంది అనూరాధ.

మనోరమని ఈ ఇంటి మనుష్యుల్తో పరిచయం చేసిన ఆమె ఇంటావిడ గుమ్మంలో నిలబడి 'మనోరమా! పోదాం వస్తావా?' అంది. మనోరమ లేచి 'వస్తానండీ' అని సెలవు తీసుకుని అనూరాధ పెట్టిన బొట్టును సరిచేసుకుంటూ వెళ్ళిపోయింది.

అనూరాధ ఆమెను సాగనంపటానికి వీథివరకూ వెళ్ళింది. పార్వతమ్మ లేచి కిటికీదగ్గరకు నడిచి కిటికీ గజాలు పట్టుకుని భారంగా ముందుకు వంగి "ఇంతకంటె విశ్రాంతి లభించేచోటు మరొకటి లేదూ? నా రెక్కలమీద ఆధారపడి నేను జీవించలేనూ" అని ఆలోచించింది.

"ఏవిఁ మాయదారి చదువులోనమ్మా! నిక్షేపంలాంటి సంసారం వదిలిపెట్టి, ఒక కొడుకుని కని కూడా ఇప్పుడు చదువులేవిఁటి నా ముఖం. అడిగేవాడు లేకగాని అంతా కిరస్తానీ సజ్జుగా తయారవుతున్నారు. అదే మనం అయితే ప్రాణం వున్నా పోయినా ఇంట్లోనే పడివుంటాంగాని ఇలా సంసారాలు వదులుకుని పరాయి వాళ్ళ ఆర్జన మీదపడి చదువులు వెలగబెట్టటానికి సాహసిస్తామా. ఒకళ్ళని అసేవనే

ముంది. ఈరోజులే అలాగున్నాయి. మొగుడికి ఇప్పుడు వుద్యోగం లేకపోతే ఇక ముందు దొరకదూ? అందుకని తను బరితెగించి వీథిని పడుతుందా? ఛా! ఎంత సిగ్గు మాలిన మనుషులమ్మా! పాపం పండిపోయింది. వుండు చెల్లీ దొడ్లో కాసిన చిక్కుడు కాయలున్నాయి. ఇస్తాను పట్టుకెళ్దువుగాని"—ఈ నారాయణి గొంతు రానురాను దగ్గర కావటంతో పార్వతమ్మ సర్దుకుని కళ్ళు తుడుచుకుని ఏదో పనిలో వున్నట్టుగా మంచం మీద దుప్పటి తీసి దులిపి పక్క వెయ్యసాగింది.

అవతలావిడ నారాయణి వాదానికి తాళం వేస్తూ "పాడుకాలం వచ్చిపడిందక్కా. మన చిన్నతనాల్లో గుమ్మందాటి వీధిముఖాలు చూచి ఎరుగుదుమా? మగవాళ్ల మాటకి ఇప్పటికి ఎగురు చెప్పటం వుందా? ఆ రోజులు, ఆ భక్తి ప్రపత్తులూ, వినయ విధేయతలూ మట్టూ మర్యాద ఇప్పుడన్నీ మంట గలిసాయి. కాక పోతే కట్టుకున్న మొగుడ్ని, కన్న కుర్రవాడ్ని వదిలి పెట్టి తిరుగుదునమ్మా అంటూ తిమ్మయ్యగారింట్లో పడి చదువులు వెలగబెట్టటానికి ఎన్నిగుండె లుండాలి. ఆడ జాతికి చేటుకాలం దాపురించిందక్కా. అసలు మన పెద్దలు చెబుతూంటారే అలాగ ఈ కలియుగం బద్ద లయిన పాపంలో ఇంకెంత కాలమో వుండదు. సర్వం నాశనం అయిపోతుందక్కా. ఇంతటి పాపభారాన్ని భూదేవి ఎన్నాళ్ళని మొయ్యగలుగుతుంది" అని ఆమె నారాయణి ఇచ్చిన చిక్కుడు కాయల సంచీపట్టుకుని వెళ్ళిపోయింది.

దీపాలవేళయింది. అనూరాధ దీపం చిమ్నీలు తుడుస్తూంది. నారాయణి పెరటిలో స్నానం చేస్తూంది. మడికట్టుకుని గాని వంటచెయ్యదు నారాయణి. పొద్దుపోయే వరకూ పొయ్యిలో నిప్పు వెయ్యదు. రాత్రి పొద్దుపోయి భర్తవచ్చే సరికి వండిన అన్నం చల్లారి పోతుందని ఆలస్యంగా వంట ప్రారంభిస్తుంది. పిల్లలకి కూడా బాగా పొద్దు పోయిం తర్వాత తినటం అలవాటయిపోయింది. ఇవాళింకా చంద్రుడు ఆటలు అయి యింటికి రాలేదు. వాడిని అదుపులో పెట్టేవారే లేరు. రాత్రి ఒక్కొక్కప్పుడు బాగా చీకటి పడిందాకా వాడు ఇంటికిరాడు. అల్లరి చిల్లరగా ఏ కాలవగట్లమీదనో, తోటల్లోనో పడి అల్లరి చేస్తూంటాడు. అదుపులేక వాడి అల్లరి మితిమీరి పోయింది. అప్పుడప్పుడు ఇరుగుపొరుగు వాళ్ళు వాడి మీద ఫిర్యాదులు తెచ్చి నారాయణితో చెబుతుంటారు అయినా నారాయణి వాడ్ని మందలించదు. ఎందుకంటె వాడంటేభర్తకి చాలాగారవం ప్రేమ.అందుకని వాడ్ని ఏమీ అనటం ఆమెకు ఇష్టంవుండదు. వాడిని ఏమన్నా భర్త మనసు కష్టపడుతుంది. మీ వాడు మా పిల్లల్ని కొడుతున్నాడని, తిడుతున్నాడని ఎవరైనా ఫిర్యాదు చేస్తే నారాయణి వాళ్ళనే నాలుగు ఎదురు మాటలని పంపించేస్తుంది. వాడికప్పుడే ఏడేళ్లు నిండుతున్నాయి. అయినా వాడ్ని ఇంతవరకూ బడిలో వేయించ లేదు. అనూరాధ అప్పుడప్పుడు వాడ్ని దగ్గర కూచో బెట్టుకుని తనకు వచ్చిన నాలుగు ముక్కలూ చెప్పబోతుందిగాని వాడి తింగరతనానికి ఆమె తట్టుకో లేక వాడిమానాన వాడ్ని వదిలేస్తుంది. ఇకపోతే నారాయణి, ఎంతసేపూ మడీ, ఆచారమూ, వంటలూ, వార్పులూ సాయంత్రం అమ్మలక్కలతో ముచ్చటలూ వీటితో నే సరిపోతుంది. వాడి చదువుగురించి శ్రద్ధపట్టే అవకాశమే ఆమె కుండదు. ఇక వీరభద్రం గారి సంగతి సరేసరి. ఆయన బాధ్యతలూ,ఇష్టాలు దేశానికి సంబంధించినవై వుంటాయి గాని ఇంటికి సంబంధించినవి కావు.

ఇలా ఒక మూర్ఖమైన వాతావరణం ఆ యింట్లో వ్యాపించి పోయింది. దానికి విరుగుడంటూ లేదు.

చంద్రుడు వళ్ళంతా మన్ను చేసుకుని గెంతు కుంటూ నేరుగా వంటగదిలోకి దూరబడ్డాడు, దారి పొడుగూతా దుమ్ము దులుపుకుంటూను. అనూరాధ "అయ్యో వీడ్ని చూడమ్మా వళ్ళంతా దుమ్ముచేసుకుని కడుక్కోకుండానే ఇంట్లోదూరబడి ఇల్లంతా దుమ్ము చేస్తున్నాడు" అంటూ అరిచింది. అయినా వాడు లక్ష్యపెట్టలేదు. పైపెచ్చు నేరుగాపోయి వంటగదిలో పొయ్యిమీద వేగుతూన్న కూరముక్కల్ని గరిటతో తీసి రుచిచూడ సాగాడు.

అనూరాధ చప్పున వాడిని వీపుమీద చరిచింది. ఒక్కమారు వాడు కెవ్వు మనగానే పెరటిలోంచి నారాయణి, ముందు గదిలోంచి పార్వతమ్మా ఒకేమారు వంట గదిలోకి వచ్చిపడ్డారు కంగారుగా.

"చూసావా అమ్మా వీడుచేసినపని. వీథులన్నీ తిరిగి వళ్ళంతా బాడి చేసుకుని అలాగే వచ్చి కూర ముక్కలు రుచిచూస్తున్నాడు" అంటూ ఫిర్యాదు చేసింది అనూరాధ.

"అందుకని నువ్వేం చేశావు వాడ్ని?"—ఈ కంఠంలోని తీవ్రతకు అనూరాధ నివ్వెర పోయి నిరుత్తరరాలై నిలబడిపోయింది.

ఈ అవకాశం జార విడువకుండా చంద్రుడు గొంతు మరింత పెద్దది చేసి 'కొట్టిందమ్మా! చూడు! ఎలా తట్టు తేలిపోయిందో' అని ఏడుస్తూనే వాడు చొక్కా పైకెత్తి వీపు చూపించాడు.

నారాయణి కంగారుగా వాడివీపు నిమురుతూ "ఎంతపనిచేశావే! నీ పెద్దరికం పాడుగాను. కుర్రకుంక ఏదో తెలియక తప్పుచేస్తే అంతలా బాదుకోవటమా! అవి చేతులా మరేమన్నానా? వూరుకో నాయనా... అక్కని నే కొడతాలే...ఏడవకు...అయినా వాడ్ని అలా బాదటానికి నీకెవరిచ్చారంట అధికారం. ఈమారు ఇలాంటి పని చేసి చూడు వీపు చీరుస్తా ఏమనుకున్నావో" అంటూ మిరపకాయలు వేయించినట్టుగా నాలుగూ దులిపేసింది నారాయణి.

అనూరాధ ముఖం చిన్నబోయింది. అభిమానంతో కళ్ళు నీళ్ళ పర్యంతం అయింది. కాని ఎదురుగా తన వైపే చూస్తూ ముక్కుమీద వేలు వేసుకున్న పార్వతమ్మని చూడగానే అక్కడ్నించి కదిలి ముందు వసారాలోకి నడిచింది. ఈ సంఘటనలో అంతగా కలత చెంద వలసినఅగత్యం లేకపోయినా అనూరాధమటుకుమనస్సు పాడుచేసుకుంది. ఆమెకి ఒక్కమారు "తనకి పెళ్ళయి వుంటే ఎంత బాగుండేది" అనే ఆలోచన ఎందుకో తట్టింది.ఆవయస్సు అలాంటిది.అప్పుడు వచ్చేవూహాలూ అలాగే వుంటాయి.రాత్రి పడుకోబోతూకూడా పార్వతమ్మ చేత తనదేమీ తప్పులేదని పదిమార్లు చెప్పించుకునేవరకూ ఆమెకు మనశ్శాంతి లేకపోయింది.

"మరేవీఁలేదు అమ్మమ్మా. వాడల్లా అల్లరి చిల్లరగా తిరిగి చదువుకోవటం మానేస్తే వాడేమయినా బాగుపడాలా? ఎనిమిదేళ్ళు వచ్చాయి. వాడికింత వరకూ అ, ఆలు రావు. వాడికి సిగ్గయినా లేదు. అమ్మ, నాన్నా కూడా వాడికి తగట్టే వాడేంచేసినా వాళ్ళు చూస్తూ వూరుకుంటారు. పిల్లల్ని కాస్త మందలించక పోతే వాడేంబాగుపడతాడు! ఇవ్వాళ మటుకు వాడు ఎలాంటి పని చేసాడో నువ్వు చూశావా? వాడు చేసిన పని బాగుంది గాని నేను చెయ్యిచేసుకోవటం బాగుండ లేదన్నమాట. అసలు నాకెందుకులే" అంది అనూరాధ.

పార్వతమ్మ బదులుచెప్పలేదు. ఆమెమనసు మనోరమ వైపు పోయింది. అంతమంది స్త్రీలమధ్యని సగర్వంగా ఆమె చెప్పిన జవాబులు, ఆవెనక ధ్వనించిన పట్టుదల, ఆ నుదుటిమీద ముడతలలో వ్యక్తమయిన దృఢత్వం, ఆ చైతన్య స్రవంతి తెరలు తెరలుగా గుర్తుకు తెచ్చుకోసాగింది. వీరరస ముట్టిపడే ఆ మూర్తి పార్వతమ్మ హృదయంలో చెరగని ముద్రవేసి హత్తుకుపోయింది. ఇన్నాళ్లకు తను వూహించిన ఒక మనిషిని యథార్థంగా చూడగలిగింది. జీవితంపట్ల మనోరమకి వున్న దూరదృష్టి, విశ్వాసానికీ పార్వతమ్మ ఆమెను పదేపదే అభినందించింది. జోహారు లర్పించ కుండా వుండలేకపోయింది.

"ఏవిటమ్మమ్మా ఆలోచిస్తున్నావు?" అంది అనూరాధ

"మనోరమనుగురించి నీ అభిప్రాయం ఏవిఁటమ్మా?"

"ఏముంది? సరదా అయిన మనిషిలాగానే వుంది"

"అంతేనా! అంతకు తప్పించి మరేవిఁ విశేషం లేదా?"

"ఏమిటది?"

"మనోరమ ఆదర్శప్రాయమైన స్త్రీ. ఆమె లాంటి వాళ్లు చాలాకొద్దిమంది వుంటారు. జీవితం విలువ తెలిసినవారు ఎప్పుడూ గౌరవించదగిన వారు కారూ? ఆమె ధోరణిలో నిశ్చలత, దీక్ష ఎలా ధ్వనించాయో విన్నావా?"

"అయితే మనోరమ కూడా చదువుకుని వుద్యోగం చేస్తుందా అమ్మమ్మా?"

"అవసరమైతే చేస్తుంది. అయితే అందుకు అర్హత సంపాదించుకోగలగటం అన్నది విశేషం కాదూ? నువ్వుకూడా మనోరమ దగ్గరకు పోయి చదువుకోరాదూ వుత్తినే ఇలా కాలక్షేపం చెయ్యకపోతే."

"అమ్మో! అమ్మ చంపేస్తుంది"

గడియారం పదిగంటలు కొట్టింది. అనూరాధ గంటలు లెక్క పెడుతూంది.

"ఇంకా మీనాన్న ఇంటికి రాలేదు కదమ్మా?"

"లేదు"

భారంగా నిట్టూర్పువిడిచి పక్కకు వత్తిగిలింది పార్వతమ్మ. వీధి మొగలో రావిచెట్టు 'జంయ్' మంటూ గోల చేస్తూంది. వూరంతా మాటుమణిగినా నారాయణి

మటుకు కమ్ముకువస్తున్న నిద్రని అణుచుకుంటూ వుండీ వుడిగీ వినవచ్చే ప్రతి చిన్న సవ్వడికీ, భర్త వచ్చా రేమోనని వీథివైపు మూస్తూ ఆవులించి చిటికెలు వేసుకుంటూంది.

ఆమె ఇక ఆగలేక ఓ నిద్రతీసి లేచింతర్వాత గడియారం ఒంటిగంట కొట్టటం భర్త తలుపు తట్టటం ఒక్కమారు జరిగింది.

## 4

రాత్రి ఏ నిశ్చయానికి వచ్చి పడుకుందో పార్వతమ్మ తెల్లవారి అది ఆచరణలో పెట్టింది. అందుకనే ఇంట్లో ఎవరూ లేవకుండానే ముందుగానే లేచింది. కుంపటి రాజేసి కాఫీ నీళ్లు పడేసింది. ముఖం కడుక్కుని పనిమనిషి రాగానే అది అరవ నవసరం లేకుండానే అంట గిన్నెలన్నీ బైటవేసింది.

పనిమనిషి కేకవేసితేగాని నారాయణి లేవదు. ఇవాళ ఆమె లేచేసరికి కొద్ది పొద్దెక్కింది. కళ్ళు నులుపుకుంటూ వంటగది సమీపించేసరికి మొదటి చూపులోనే జరిగిందంతా ఆమె వూహించ గలిగింది. ఆమె గదిలో అడుగుపెట్టగానే "అమ్మా నారాయణీ! వన్నివాళనుంచీ ఈవిషయంలో అడ్డుపెట్టవద్దు. నువ్వు చిన్నదానివి. నీకు తెలీదు. నాబాధ అర్థంచేసుకో తల్లీ" అంది పార్వతమ్మ.

పార్వతమ్మ ఎంతటి దూరపాలోచనతో ఈ మాటలందో నారాయణి గ్రహించినట్లు కనబడదు. అందుకనే ఆమె నిస్సంకోచంగా "అయితే నీ వుద్దేశం ఈఇంట్లో ఒక బలమైన స్థానం నువ్వు అపేక్షిస్తున్నావా పిన్నమ్మా?" అంది.

"నన్ను అర్థం చేసుకోమని పదేపదే వేడుకుంటున్నాను నారాయణీ! నేను నిజంగా ఈబాధ్యతలు నీకు బరువైపోకుండా వుండటానికే నెత్తిన వేసుకోవటంలేదు. కొంత అభిమానమూవుంది. కొంత అవసరమూ వుంది. జీవితంలో దిక్కులేని మనిషినై ఈ ఇంట అడుగుపెట్టాను. నాలుగు మెతుకులు తింటున్నాను. కాని..."

ఈమాట పూర్తవకుండానే అర్థాంతరంగా అందుకుని "చూసేవాళ్ళ దృష్టిలో కేవలం ఒక చుట్టంగానే కాకుండా బాధ్యతగల ఇంటి మనిషిగా కనబడాలని తాపత్రయం కాబోలు" అంటూ పూర్తి చేసింది నారాయణి.

పార్వతమ్మ నిలువల్లా నీరుకారిపోయింది. ఇవాళ రభస జరుగుతుందని ఆమె ముందుగా వూహించకపోలేదు. అయినా ఈతీవ్రమైన అవమానకరమైన ధోరణి ఆమె సహించలేకపోయింది. ఆమె చేతిలోని తాటాకు విసనకర్ర కిందికి జారిపోయింది.

"భగవంతుడు నాకు రెక్కల్లో కావల్సినంత శక్తినిచ్చాడు. అది వున్నంతకాలం ఈ ఇంటివాడికి ఎంతమంది వచ్చిపడినా వండిపెట్టగలను. ఇందులో ఇంకొకళ్ళ ప్రమేయం నేను సహించేది లేదు." అంది నారాయణి నిర్మొహమాటంగా.

ఇక ఏవిధమైన ఆసరా లేని నిస్సహాయస్థితిలో పార్వతమ్మ ఆగది విడిచిపెట్టక తప్పలేదు. అంతవరకూ నారాయణి అక్కడ్నించి కదలలేదు. పార్వతమ్మ ముఖమంతా చెరువు చేసుకుని తనగదిలోకి నడిచి మంచంకింద చిరుగులుపడిన చేతిసంచీ తీసుకుని అందులో తన నాలుగు పాతచీరలూ కుక్కుకుంది. అప్పటికింకా పిల్లలు లేవలేదు. నారాయణి భర్త మెలుకువ వచ్చినా బద్ధకంచేత మంచంమీద అటూ ఇటూ దొర్లుతున్నాడు. కిటికీలోంచి పొద్దుటి ఎండ మంచం మీదకి పాకగానే ఆయన మంచం దిగి వళ్ళు విరుచుకున్నాడు. పార్వతమ్మ గొంతు విని ఆయన గుమ్మం వైపుకి తిరిగారు. గుమ్మంముందు చేతిసంచీతో ఆమె వారగా నిలబడివుంది. "నేను వెళ్తున్నాను నాయనా" అంది.

"ఎక్కడికి?" అన్నాడాయన అయోమయంగా.

"అదే ఇంకా నిశ్చయించుకోలేదు. వచ్చి చాలా రోజులయింది. ఇక వెళ్ళొద్దూ.

"నువ్వనేదేవిటో నా కర్థంకావటం లేదు. అసలేం జరిగింది"

"ఏవీఁ జరగలేదు. ఇందులో జరగడానికేముంది. వచ్చాను. కొన్నాళ్ళు వున్నాను. మళ్ళీ వెళ్ళిపోతున్నాను. అంతే నాయనా!"

"అవును. ఎక్కడికి పోతావు? అది చెప్పు ముందు."

దీనికి ఏమని చెప్పాలో ఆమెకి బోధపడలేదు. "ఇచ్ఛాపురంలో మా దూరపు చుట్టాలున్నారు. వాళ్ళ దగ్గిరకి వెళ్దామనుకుంటున్నాను."

"ఇప్పుడు నీకిక్కడ ఏం లోటు వచ్చిందని"

"రామ! రామ! అలాగని సేనన్నానా, ఏ లోటూ లేదు. సేను కేవలం చుట్టాన్ని నాయనా. నాలుగు రోజులుండి వెళ్ళిపోతున్నాను. దీనికోసం నువ్వింత బాధపడతావు దేనికి?"

"నారాయణితో చెప్పావా?"

"లేదు చెబుతాను" అని పార్వతమ్మ వెనక్కి తిరగ్గానే వంటగది గుమ్మంలో చేతులు తుడుచుకొంటూ నారాయణి నిలబడివుంది. ఇదంతా ఆమె వినే వుండాలి. నారాయణి దగ్గరగా వచ్చి పార్వతమ్మ చేతులు పట్టుకుని పక్కగా తీసుకెళ్ళి "ఈ డబ్బు దగ్గరవుంచుకో పిన్నమ్మా. నువ్వు అభ్యంతరపెడితే నా మీద ఒట్టే" అంది.

పార్వతమ్మ బలవంతం మీద ఆ డబ్బుతీసుకోక తప్పలేదు. ఆమె అక్కడ్నించి కనుల్తూ పిల్లపెళ్ళి గురించి, పిల్లవాడి చదువు గురించి మరోమారు హెచ్చరించి, పిల్లలు పడుకుని నిద్రపోతున్న గదిలోకి వెళ్ళి లేతఎండలో ముడుచుకుని నిద్రపోతున్న అక్కా,తమ్ముళ్ళని చూసి బయటికి నడిచింది. వెనకాల నారాయణి దంపతులు అనుసరించారు. మరోమారు ఆమె శెలవుతీసుకొంది.

"ఇచ్ఛాపురం చేరగానే వుత్తరం రాయి" అన్నారు వీరభద్రంగారు.

ఉదశు సంధ్యని చీల్చుకుంటూ మెల్లగా సాగిపోతున్న ఆమె పూర్తిగా అదృశ్యమయేవరకూ నారాయణి దంపతులు గుమ్మంలో నిలబడి తర్వాత నిట్టూర్పులతో లోపలికి వెళ్ళిపోయారు.

"ఏమిటో పిచ్చికాకపోతే ఇప్పుడెక్కడికని పోతుంది?" అన్నారు వీరభద్రంగారు.

వెనకాల వస్తున్న నారాయణి "అవును నిజమే అనుకోండి. అయినా మనంమటుకు ఎన్నాళ్ళని పోషించగలం? ఏదో రెండుసెలలు వుంచుకున్నాం. మనసు రాయి చేసుకోందే ఇలాంటి విషయాల్లో కష్టం. పిల్లాజల్లావున్నవాళ్ళం. ఖర్చులు పెంచుకుంటే ఎలాగు. అదే మనసులో పెట్టుకోకండి. ఎవరిఖర్మ వాళ్లది. ఏం చేస్తాం" అంది నారాయణి.

ఆనాడల్లా అమ్మమ్మ వెళ్ళిపోవటం గురించి గుచ్చిగుచ్చి వేసే ప్రశ్నలకి చివరికి విసుగెత్తి "చుట్టాలు ఎల్లకాలం మనింట్లో సే పాతుకు పోతారేమిటే. వచ్చి రెండుసెలలు వుండి వెళ్ళిపోయింది. ఆవిడకోసం దిగులు పడతావేమిటి? వెళ్ళి బిందెతో నీళ్ళుతోడి పట్టుకురా?" అంటూ చిరాకుపడే వరకూ అనూరాధ వూరుకోలేదు. అమ్మమ్మ దగ్గర అంతగా చనువులేని చంద్రుకు ఆప్రసక్తే తీసుకు రాలేదు.

## 5

అనూరాధ గుమ్మంలో అడుగుపెట్టగానే చుట్టూతా పరుచుకున్న పుస్తకాలమధ్య కూర్చుని తదేకంగా చదువుకుంటున్న మనోరమ చప్పున లేచి అతి ఆప్యాయంగా ఎదురు వచ్చి లోపలికి తీసుకువెళ్ళింది.

"మా స్నేహితురాలింటికి వచ్చి ఓమారు మిమ్మల్ని చూసిపోదామని వచ్చాను. మీ చదువుకి భంగం కలగ లేదుగదా" అంది అనూరాధ.

"అబ్బే! లేదు. అలాకూర్చోండి. మీవాళ్లంతా కులాసాగా వున్నారా?"

"ఆఁ! మా అమ్మమ్మ వెళ్ళిపోయింది. మీకు తెలుసునా?"

"తెలియదే! ఎక్కడికి?"

"ఎక్కడో ఇచ్ఛాపురంలో వాళ్ళదూరపు చుట్టాలున్నారుట. అక్కడికి వెళ్ళింది."

"అది నమ్మతగిందేనా అనూరాధా. నాకేమీ నమ్మకంలేదు." అంది మనోరమ భారంగా నిట్టూర్పు విడిచి.

"అంటే మీవుద్దేశ్యం?"—అనూరాధ వ్యాకుల హృదయంతో అడిగింది.

"ఆమె కొంపాటి ఆసరావున్నట్టు తోచదు" దగ్గర కొద్దిడబ్బయినా వుందా?"

"అమ్మ పాతికరూపాయ లిచ్చింది" అది తప్ప ఆమెదగ్గర మరేమీలేదు. అంతవరకూ నాకు తెలుసు."

"మీ అమ్మ పాతిక రూపాయ లిచ్చిందా?" అంది మనోరమ నమ్మకంలేని స్వరంతో.

అనూరాధ తల వూపింది.

ఈ మనసు అల్లే పాడువూహాలనుంచి తెముల్చుకుంగుకు మనోరమ "మాయిల్లు బాగుందా?" అని ప్రశ్నించింది.

"ఏదీ చూపించకుండానే?"

"అయ్యో నా తెలివితెల్లవారిపోను" అంటూ మనోరమ అనూరాధని వెంటపెట్టుకుని ఇల్లంతా

చూపించింది. ఇంత పెద్ద యిల్లు అద్దెకు తీసుకున్న మనోరమ తమ్ముడి వుద్యోగం తక్కువేమీ కాదని అంచనా వేసింది అనూరాధ.

ఆతర్వాత తను చదువుకునే పుస్తకాలన్నీ పరిచయం చేసింది మనోరమ. ఆమె వుత్సాహం చూస్తుంటే తన్ని ఆమెతో పోల్చుకొని సిగ్గుపడింది.

"అమ్మమ్మ ఓమారు అంది, ఇలా వృత్తినే కాలక్షేపం చెయ్యకపోతే మనోరమదగ్గరకిపోయి చదువుకోరాదా?" అని. మీరంటే ఆమెకి వల్లమాలిన అభిమానం. తరుచు మీ ప్రసక్తి తీసుకువస్తూండేదామె." అంది అనూరాధ ఆస్మృతి రేకెత్తించిన వ్యథతో.

"ఆమె వెళ్ళేముందు నాకు తెలిసిందికాదు. ఒక్కగంటముందు తెలిసినా ఆమెని తప్పక కలుసుకునేదాన్ని. అనేకవిషయాలు ఆమెతో మాట్లాడాలనుకున్నాను" అంది మనోరమ.

"ఆమె వెళ్ళిపోయే సంగతి మాకుమటుకు తెలుసునా? ఎవరికీ తెలియదు. ఆమె వెళ్లేసమయానికి నేనూ తమ్ముడూ ఇంకా నిద్రలేవలేదు. పాపిష్టిదాన్ని ప్రతిరోజూ తెల్లవారకుండానే లేచేదాన్ని. ఆనాడు పొద్దుపోయి లేచాను. అమ్మమ్మ వెళ్ళిపోయింది. ఆమె హఠాత్తుగా నిశ్చయించుకుని వెళ్ళిపోయింది. మళ్ళీ ఇక ఆమెనుచూట్టం పడదనుకుంటాను. ఆమెని మరిచిపోయినా ఆమె చెప్పిన కథలు మరిచిపోలేను. ఆమె వెళ్ళింతర్వాత తిక్కెత్తినట్టు అనిపించింది."—అనూరాధ కంఠం కొద్దిగా వణికింది. కళ్లు చెమ్మగిల్లి ఒక నీటిచుక్క చెంపలమీదుగా జారిపోయింది.

మనోరమ ఆమెను దగ్గరగాతీసుకుని "బాధపడకు అనూరాధా! ప్రతిరోజూ సాయంత్రంపూట ఇలాగ వచ్చావంటే అంతకంటె మంచికథలు చెబుతాను." అంది.

అనూరాధ సిగ్గుపడుతూ అచ్చే వూరికే అన్నాను. నేనేమన్నా చిన్నపిల్లనా కథలకోసం అంటూ ముఖం వాచిపోవటానికి" అంటూ నవ్వింది.

మనోరమ నవ్వుతూనే "నువ్వు చాలా తెలివైనదానివే. ఏమిటో అనుకున్నాను. అయితేనేం రోజూ వస్తూండు. కులాసాగా కబుర్లు చెప్పుకుందాం."

అలాగే అన్నట్టుగా తల వూపింది అనూరాధ.

"మాయింటికి పత్రికలు కూడా వస్తూంటాయి" చదువుకోవచ్చు."

"పత్రికలు చదవటం నాకు అలవాటులేదండీ" అంది అనూరాధ.

"అలవాటు చేసుకుందువుగాని."

"మీరు రోజూ చదువుతారనుకుంటాను"

"అవును ప్రతిరోజూ చదువుతాను."

"అంత శ్రద్ధగా చదవటానికి అందులో ఏముంటాయి?"

"ఎందుకుండవు? అనేకవిషయాలుంటాయి. ఒకరోజు కాఫీ తాగకపోతే ఎంతతిక్కగా వుంటుందో ఒక్కరోజు పేపరు చదవకపోయినా అలాగేవుంటుంది" అంది మనోరమ.

అనూరాధకి మనోరమధోరణి ఆశ్చర్యంగానే వుంది.

"నేను ఇవాళనుంచీ సంపాదనాపరురాలినయాను" అంది మనోరమ వున్నట్టుండి.

"ఎక్కడన్నా వుద్యోగంలో ప్రవేశించారా?.

"లేదు, అయిదు ప్రయివేట్లు కుదుర్చుకున్నాను. నెలకో పాతిక రూపాయలు వస్తాయి. ఓ పదిరూపాయిలు అబ్బాయికి పంపుతాను. మిగతా పదిహేనూ ఆయనకి పంపేస్తాను. పైఖర్చుకన్నా వస్తుంది.

"ఆయన ఎక్కడ వున్నారు?"

"ఆయన అన్నగారి దగ్గర"

"మరి మీ సంగతి?"

"నాకు తమ్ముడున్నాడుగా, స్కూలువాళ్లు కొంత 'స్టయిఫెండు' ఇస్తారు. "తెల్లవారగానే ఆ పిల్లలు మనింటికి వస్తారు. ఓ గంట చెబుతాను. అనవసరంగా కాలం ఎందుకు పాడుచెయ్యాలి. నేను చేస్తున్నపని బాగుండలేదూ?"

"ఎందుకు బాగుండలేదు. దివ్యంగా వుంది" మనోరమ గొంతుతగ్గించి "ఇలా పాఠాలు చెబుతున్నానని చెబితే తమ్ముడు కస్సుమని లేచాడు. అతడ్ని వప్పించి శాంతిపరిచేటప్పటికి నా తలప్రాణం తోకకు వచ్చింది. 'నువ్వు పిల్లలకి ప్రయివేట్లు చెప్పి సంపాదించాల్సిన అగత్యం ఏముంది? నే నిన్ను ఇంతగా ఆదరిస్తున్నా నువ్వు నన్ను అర్థం చేసుకోలేదన్నమాట,

చూసేవాళ్లేమనుకుంటారు?' అంటూ నిష్ఠూరాలాడాడు. అన్నిటికి నచ్చచెప్పి "నా సంపాదనకోసం కాదు తమ్ముడూ, నా వాళ్లకోసం; నా సంపాదనలో దమ్మిడీ నేను ముట్టను. నేను పూర్తిగా నీ మీదనే ఆధారపడతాను" అని హామీ ఇచ్చాను. అప్పటికిగాని వాడు మెత్తపడలేదు. తర్వాత ఇందులో తప్పేమీ లేదని వాడూ గ్రహించాడు." అని మనోరమ లేచి గాలికి రెపరెపలాడుతున్న పుస్తకాన్ని తీసి అలమారాలో వుంచి తిరిగివచ్చి కూర్చుంది.

"మీతో మాట్లాడుతూవుంటే సరదాగావుంది" అంది అనూరాధ.

"అందుకనే మనం ప్రతిరోజూ కలుసుకుందామని నేనంటున్నాను."

"అమ్మమ్మ వున్నది రెండుమాసాలయినా ఆమె వెళ్ళిపోయింతర్వాత ఏదో పెద్దలోటుగా వుంది. ఆమె తలపుకు వస్తే దిగులు దిగులుగావుంటుంది"

మనోరమ అనూరాధ తల నిమురుతూ "అది మంచిదికాదు. మనస్సు ఎప్పుడూ వుత్సాహంగా వుండాలి. దిగులుపడటం మంచిదికాదు. అలావుంటే ఎవరూ నిన్ను పెళ్ళిచేసుకోరు" అంటూ నవ్వేసిందామె.

ఈ పరిహాసంలో అనూరాధ మనస్సును ఆవరించిన మబ్బులు మంచులా కరిగిపోయాయి. ఆమె సిగ్గుపడి ముఖం ఎఱుపుచేసుకుని "మీదంతా వేళాకోళం" అంటూ దూరంగా జరిగింది.

మనోరమ మరింత బిగ్గరగా నవ్వింది. మనోరమ నవ్వు అనూరాధకి నవ్వు తెప్పించింది.

"ఏమిటి అక్కా అంతలా నవ్వేస్తున్నావు" అంటూ అప్పుడే గదిలో అడుగుపెట్టిన శేఖరం మరో కొత్తమనిషి అక్కడ వుండటంతో నాలిక కొరుక్కుని త్వరత్వరగా బూటుకాళ్లతోనే లోపలికి వెళ్ళిపోయాడు.

అనూరాధ చప్పున నోరు నొక్కుకొని లేచి "వస్తాను" అంటూ త్వర త్వరగా బయటికి రాబోయింది.

మనోరమ నవ్వు దాపుకుంటూ "ఫర్వాలేదు. వాడు వచ్చి ముస్నేం చేశాడు? కాసేపు కూచుని వెళ్దువుగాని" అంది.

"లేదు పని వుంది. అప్పుడప్పుడు మీరూ కనిపిస్తూవుండండి" అంది అనూరాధ మెట్లు దిగుతూను.

"నేను అప్పుడప్పుడు వస్తూంటాను. నువ్వు ప్రతిరోజూ రావాలి రేపు ఇదే వేళకి ఎదురు చూస్తూంటాను."

అనూరాధ కనిపించినంతసేపూ చూస్తూ తమ్ముడ్ని గొంతువిని లోపలికి వెళ్లిపోయింది మనోరమ.

"ఈమె మరొక కొత్త శిష్యురాలు కాదు గదా?" అంటూ ఇవతలికి వచ్చాడు శేఖరం.

మనోరమ నవ్వుతూ "ఇంచు మించు అంతే అనుకోవచ్చు" అంది.

"అయితే జీతం ఏపాటి గుంజుతున్నావేమిటి?"

"పోరా నీదంతా పరిహాసం. ఏమీ లేదు" అంది మనోరమ.

## 6

నారాయణి అన్నగారివద్ద నుంచి వుత్తరం వచ్చింది. బావగారి పేర రాసాడాయన.

బావగార్కి నమస్కరించి వ్రాయునది—

ఇవాళ ఇక్కడ మంచి సంబంధం ఒకటి చూశాను. కుర్రవాడు బి. ఎ. చదివాడు. నెలకు రెండొందలు జీతం తెచ్చుకొంటున్నాడు. పదెకరాలభూమి పిల్లవాడి వాటాకు వస్తుంది. ఒక ఇల్లుకూడా వుంది. మూడు నాలుగువేలు ఇవ్వటానికి మనం సిద్ధపడితే వాళ్ళు వప్పుకుంటారని అనుకుంటున్నాను. కాబట్టి నువ్వోకమారు బయల్దేరి ఇక్కడికివస్తే వాళ్ళతో మాట్లాడదాం. నేను ఈ చిరుగుల చొక్కాతో వెళ్ళి పెళ్ళి సంబంధం మాట్లాడితే కలిసేది కూడా కలవదు. లేకపోతే దీనికోసమంటూ ఓ చొక్కా పంచీ కొనుక్కోవాలి. నాకు దాపరికం, సిగ్గూ లేవు సుమా. ఉన్న దున్నట్టుగా రాసేస్తున్నాను. పేదరికం అనుభవిస్తూంటే గాలేంది చెప్పకుంటే వచ్చిందా? నువ్వు ఈ విషయంలో కాస్త త్వరపడాలి. ఎదురు చూస్తూంటాను. ఈ సంబంధం కుదురుతే పిల్లదాన్ని గురించి మనకు దిగులు వుండదు."

ఉత్తరం పూర్తవగానే గట్టిగా మూలిగి దాన్ని టేబిల్ మీదికి విసిరేసారు వీరభద్రంగారు. నారాయణి తీసుకుని చదివి ముందు అభిమానంతో ముఖం ఎఱుపు చేసుకుని 'పాడు దరిద్రం మానాభిమానాల్ని కూడా చంపేస్తుంది కాబోలు.' అనుకొని "అదిసరే పోనీ వెళ్ళిరారాదు?" అంది ఆమె.

"నాకెక్కడ తీరిక. ఇవాళనుంచీ క్లబ్బులో ఆటలపోటీలు జరుగుతాయి. అవన్నీ నిర్వహించటమంటే ఇంకొకళ్ళకి సాధ్యమౌతుందనుకున్నావా? పేకలు తెగుతాయి. నేను లేకపోతే ఒక్క నిముషం గడవదక్కడ" అన్నారాయన చిరాగ్గా.

నారాయణి మనసులోనే నిట్టూర్చింది. పైకి ఏమీ అనకుండా లోపలికి వెళ్ళిపోయింది. ఆమె యిక ఆ ప్రసక్తి భర్తవద్ద తీసుకురాలేదు. అనూరాధని కూచోబెట్టుకొని నాలుగు ముక్కలు రాయించింది అన్నగారికి. ఇక్కడ బావగారు క్షణం తీరికలేని పనుల్లో మునిగిపోయారనీ, కాబట్టి శ్రమ అనుకోకుండా తనే వాళ్ళతో మాట్లాడి వాళ్ళని పిల్లను చూడటానికి తీసుకు రావల్సిందని, శ్రద్ధ తీసుకోవలసిందనీ ప్రాధేయపూర్వకంగా రాయించింది. డబ్బుకూడా పంపించింది. ఇలా రాశానని భర్తతో చెబితే "మంచిపని చేశావు అలా సర్దుకోవాలి" అన్నారాయన.

ఈ వుత్తరం రాసిన ఆరోనాటికల్లా గలగలమంటూ అన్నగారు పెళ్ళివారితో సహా వచ్చి దిగాడు. కలికితే అతికదంటూ ఆ వచ్చినవారు నేరుగా ఇక్కడికి రాకుండా వాళ్ళ దూరపు చుట్టాలున్నారని వెళ్ళారు. అక్కడ భోజనం చేసుకుని తాంబూలం సేవిస్తూ చక్కా వచ్చారు. క్రితంరోజు తాము వస్తున్నట్టుగా వుత్తరం రాసినా కన్యాదాతగారు ఇంట్లో లేకపోవడం గమనించి ఆశ్చర్యంగా, అనుమానంగా "నా వుత్తరం అందలేదేవిటి?" అని అడిగాడు నారాయణి అన్నగారు.

పిల్లకి ముస్తాబు హడావుడిలో మునిగిన నారాయణి "అందింది. లేకపోతే ఈ ఏర్పాట్లన్నీ ఎలా జరిగాయనుకుంటున్నావు" అంది.

"మరయితే బావ ఎక్కడికి వెళ్ళినట్టు?"

"ఆయనకి అర్జంటు పనివుండి వెళ్ళారు"

"అయితే పిల్లుండగా ఇంటికి రాడేవిటి?"

"పోనీలెద్దూ. నువ్వున్నావుగా. ఆయనకి తీరిక లేదు."

"ఇది మరీ వింతగావుంది చెల్లీ! తీరిక లేకపోవటమంటే అర్థంలేదు. ఒకరికి మటుకు తీరిక వుండదేవిటి? రోజు బత్తెంమీద పని చేసుకుంటున్నవాడ్ని రెండు రోజుల జీతం వదులుకుని నేనురాగాలేనిది ఒకపూట తీరిక ఆయనకి లేదన్నమాట. ఎవరన్నా వింటే నవ్వుతారు. అసలు బాధ్యత అనేది లేదంటే ఒక్క ముక్కలో పోతుంది. నా దగ్గిర దాపరికం, మొహమాటం లేదుసుమా. వున్నమాట అనేస్తాను," అంటూ చనువుగానే నాలుగూ దులిపాడు ఆయన.

నారాయణి నవ్వుతూ "నీ సంగతి నాకు తెలియదుట్రా. పోనిద్దూ. ఆయనకి మటుకు బాధ్యత లేదనా. ఇవాళ పిల్లకి, చీరా, పళ్ళూ, ఫలాలూ, తమలపాకులూ, వక్కలూ, ఇంకా ఏవేవేమిటో తెచ్చారు? ఆఁ! అన్నట్టు కూరలూ ఇవన్నీ తెచ్చి పడెయ్య లేదూ. నిజంగా ఆయనకి తీరిక లేదు. పొట్టంతి మేన మామవి నువ్వుండగా ఆయనకేంరా?" అంది.

"పురుషుడు పుట్టినన్నాళ్ళకి యజ్ఞం చేశాడని మీ ఆయన ఇన్నాళ్ళకి ఇంటిపనులు కాస్త చేశాడని మహా గొప్పగా చెప్పేస్తున్నావు. ఎవరి తిరవో ఎవరికి తెలియదు. అది సరిలే ముందు త్వరగా తెముల్చు. మళ్ళీ వాళ్ళు చీకటిపడగానే వెళ్ళిపోతారు. కాస్త పౌడరూ అదీ బాగా కనబడేటట్టు మందంగా పట్టించు. పెదిములకి 'లిప్‌స్టిక్' తెప్పించక పోయావా..."

"ఫో మావయ్యా! నీదంతా వేళాకోళం" అని సిగ్గుపడి సిగ్గులోని ఆనందం అనుభవించి వొళ్ళు పులకరింపచేసుకుంది అనూరాధ.

నారాయణి కూతురు ముస్తాబు పూర్తిచేసి, ముందు హాల్లోనుంచి అన్నగారు "చెల్లీ అమ్మాయిని తీసుకు రామ్మా" అనగానే కూతుర్ని రెక్కపట్టుకుని ముందుకు నడిపించింది. సిగ్గుభారంతో అనూరాధ అడుగు ముందుకు పడలేదు. వెనక నారాయణి తొందరచెయ్యటంతో ఆమె మందంగా అడుగులు వేసుకుంటూ నడిచి మధ్యహాలులో వాళ్ళందరికీ కొద్దిదూరంలో తివాచీ మీద తలవంచుకుని కూర్చుంది. అలా కూర్చునే ఆమె మొదటిసారిగా జీవితంలో అతి అవమానకరమైన కొన్ని అనుభవాలని, సత్యాలనీ తెలుసుకుని మానసికంగా కొంత పెద్దదయిపోయింది. ఈ పెళ్ళిచూపుల తతంగం ఆమె వూహించినదానికి కేవలం భిన్నంగా వుండటమేకాదు జీవితంలో ఇంతటి జుగుప్సాకరమైన అనుభవం తనింతవరకూ పొందలేదనికూడా ఆమె అర్థం చేసుకుంది.

ఆ చూడవచ్చినవారిలో ఆడంగులు తనురాగానే తన పక్కకివచ్చి కూర్చుని తలమీద చెయ్యిపెట్టి శల్యపరీక్షచేసి 'ఈ మచ్చ ఏమిటండీ' అన్న దొకావిడ.

నారాయణి కలగజేసుకుని "చిన్నప్పుడు ఆటల్లో కుమ్మంతగిలి గాయమయింది. అది మచ్చపడింది" అంది.

"అయితే ఎంతవరకూ చదువుకున్నావమ్మా?" అని ప్రశ్నించారు పడకకుర్చీలో కూర్చున్న పెళ్ళి కుమారుని తండ్రి.

అనూరాధ తలవంచుకుని ఏ సమాధానం చెప్ప కుండా వుండటం గమనించి అవతలవాళ్ళు అపోహ పడతారేమోనని నారాయణి "చెప్పు అనూరాధా! వారు ఏదో అడుగుతున్నారు." అంది.

"చెప్పు! చెప్పు! లేకుంటే మూగపిల్ల అను కుంటాం" అంటూ ఆయన తన చమత్కారానికి తనే పెద్దగా నవ్వేశారు.

అనూరాధ "మూడోఫారం వరకూ చదివాను" అంది.

"అది 'పాస్' అయావా?"

"లేదు"

"బాగుంది, నాకూ ఈ చదువులంటే పరమ అసహ్యం. అయినా పూరికే అడిగాను. ఆడవాళ్ళకి కాస్త ఉత్తరంముక్క చదవనూ రాయనూ వస్తే చాలు."

"అట్టే అది పెద్దపెద్ద గ్రంథాలే చదువుకుం దండీ. ఏదమ్మా భాగవతంలోనుంచి వరూధిని ప్రవ రాఖ్యుడు ఘట్టాలలోని పద్యం ఒకటి..."

నారాయణి అన్నగారిమాట పూర్తిగాకుండానే పెళ్ళికుమారుడు తండ్రిగారు: "అబ్బ! పోతన్నగారు మనుచరిత్ర ఎంతగొప్పగా రాశారండీ. నేను ఎన్ని మార్లు చదివానో ఒక లెఖ్ఖ జమాలేదు. అయినా ఈ కాలం వాళ్ళకి మన పూర్వకాలంనాటి కవిత్వం యొక్క గొప్పతనం అర్థంకాదు" అన్నారు.

"అదేమిటండీ మనుచరిత్ర రాసింది తెనాలి రామ కృష్ణుడుకదూ మీరు పోతన్నగారి భాగవతానికీ, మను చరిత్రకీ ముడిపెడతారేమిటి?" అంది ఆయనభార్య తన పాండిత్యం వలుగుతూ గమనించారో లేదో నని చుట్టూతా చూస్తూను.

అనూరాధకి నవ్వు ఆగలేదు. ఆమె ముఖం ఎత్తి చూసేసరికి ఎదురుగా తనవైపే గుచ్చిగుచ్చి చూస్తున్న కోరమీసాల అబ్బాయి బొగ్గులబస్తామీద పిడత బోర్లించినటుగా వున్న తలకాయని ముందుకుచాచి మీసాలు దువ్వుకుంటున్నాడు.

పెళ్ళికుమారుడు తండ్రి "అవునేవ్. మరచి పోయాను. పొరబడ్డాను. మనుచరిత్ర రాసింది తెనాలి రామకృష్ణుడే. నాకంటె నువ్వే తెలివైనదానివి" అంటూ పెళ్ళాంతో చిన్న సరసం ఆడి తన రసజ్ఞతకి తనే మురిసిపోయారు.

"ఏదమ్మా తెనాలి రామకృష్ణుడి మనుచరిత్ర లోని పద్యాలు రెండు చదువు" అన్నా రాయన.

"మనుచరిత్ర రాసింది అల్లసాని పెద్దన్న. తెనాలి రామకృష్ణుడు కాదు" అని అనూరాధ సమా ధానం ఇవ్వడంతో అక్కడున్నవాళ్ళ ముఖాలన్నీ క్షణం వెలావెలాబోయాయి. వెనక నేకూర్చున్న నారా యణి మనస్సు సంతృప్తితో కూడిన గర్వంతో నిండి పోయింది.

"ఆఁ! అదే ఒక పద్యం చదువు."

అనూరాధ మాట్లాడదల్చుకోలేదు. నారాయణి వెనకనించి వీపు తట్టి 'చదువమ్మా ఫర్వాలేదు చదువు" అంది.

అనూరాధ కచ్చితంగా 'నేను చదవను' అనే సింది. ఆడవాళ్ళు ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. నారాయణి కంగారుపడింది. కూతురు స్వభావం గురించి వాళ్లేమనుకుంటారోనని కలతబడింది. మరో మారు "తప్పు! అలా అనకూడదు చదవాలి" అంది.

"నేను చదవనంటే చదవను" అంది అనూరాధ

"పోనీ ఒక పాట పాడమ్మా. సంగీతం వచ్చా"

ఇక గత్యంతరంలేక వెనకనించి తల్లి పోరుపడ లేక అనూరాధ ఒక పాట పాడింది. గాభరాపడి అక్క డక్కడ నట్టినా మొత్తంమీద పాట బాగానే రక్తి కట్టింది. పెళ్లికుమారుడు ఓమారు సర్దుకుని మీసం దువ్వుకొని, వెనకనించి తమ్ముడు 'మీసంమీంచి చెయ్యి తియ్యరా!" అని హెచ్చరించి చేతిమీద ఓ దెబ్బ వేసింతర్వాత సర్దుకుని 'సినిమాపాటలు రావు కాబోలు' అంటూ సణిగి మళ్ళీ అలవాటుగా చెయ్యి మూతిమీదికి పోనిచ్చాడు. మళ్ళీ వెనకనించి తమ్ముడు చేతిమీద చిన్నదెబ్బ వేశాడు.

"ఇంకొకటి పాడమ్మా" అన్నారు పెళ్లికొడుకు తండ్రిగారు. తన గొంతుకుడికి తగిన విలువ లేకపోవ టంతో పెళ్లికుమారుడు ముఖం చిన్నబోయింది.

అనూరాధ ఇక పాడనన్నట్టుగా మాట్లాడకుండా కూచుండిపోయింది. వెనకనించి తల్లి మళ్లీ రొక్కిం చింది. అయినా అనూరాధ నోరు విప్పలేదు.

"నీ వయసెంతమ్మాయ్?"

"పదహారు" అని సమాధానం చెప్పింది అనూ రాధ.

"ఇంగ్లీషు చదవటం కూడా వచ్చునా?"

అనూరాధ సమాధానం చెప్పకుండానే నారాయిణి అన్నగారు చప్పున లేచి అలమారులోనుంచి ఓ పుస్తకం తీసి అనూరాధ కందించారు. ఆమె పుస్తకాన్ని పేజీ అయినా తిప్పకుండా అలాగే పట్టుకుని వుండిపోయింది.

నారాయణి అతి నిరుత్సాహపడిపోయింది. ఈ పిల్ల బొత్తిగా పెంకి ఘటం అని వాళ్లు ఎక్కడ అనుకుని పోతారో అని ఆమె బాధపడిపోయింది. ఆమె అనూరాధకి బాగా దగ్గరగా జరిగి పక్కగా కూర్చొని చెవి దగ్గర నోరుపెట్టి "అలా కూచుంటే బాగుండదు. చురుగ్గా అడిగిన వాటికి సమాధానం ఇవ్వాలి. వాళ్ళేమనుకుంటారు. ఆ పుస్తకం తీసి నాలుగు పంక్తులు చదువు. వూ!" అంటూ ఆమె బుజ్జగించసాగింది.

అయినా అనూరాధ వులక లేదు పలక లేదు.

చివరికి విసుగెత్తి నారాయిణి కూడా మౌనం వహించింది.

ఆతర్వాత పెళ్ళికుమారుడు తండ్రి తన పెళ్ళినాటి ముచ్చటల దగ్గిర్నుంచీ, ఈనాటి వరకూ ఆయన జీవితంలో ఆయనకి తోచిన అతి ముఖ్య సంఘటనలన్నీ చిలవలూ, పలవలూ పెంచి నారాయిణి అన్నగారితో బాతాఖానీలో పడ్డాడు. ఆయన తీరు చూసి నారాయణికి 'వీళ్ళకి పిల్ల నచ్చిందేమో' అనే భ్రాంతిలో పడింది. ఆడవాళ్లిద్దరికి ఘరానాగా, బెట్టుగా పలుకైనా లేకుండా ఉండి, ఉండి ముసలాయన ధోరణి చిరాకును వ్యక్తంచేస్తూ, నిరసనగా నిట్టూర్పులు విడుస్తూ వాళ్లు ఎంత తొందరగా కదులుతే అంత మంచిదనే ఆతృతలో వున్నారు.

చివరికి ముసలాయన భార్య కలగజేసుకుని ఆయన వాగ్ధోరణి ఆపుతూ "ఇక లేద్దామా" అనేవరకూ ఆయన తనవునికిని తను తెలుసుకోలేని తన్మయావస్థలో పడిపోయారు.

పెళ్ళివారిని సాగనంపుతూ నారాయణి అన్నగారు, "మళ్లీ మీ దర్శనం ఎప్పుడు?" అన్నారు.

"మేం రెండురోజులు ఈ వూళ్లోనే వుంటాం. మా బంధువులు వున్నారు" అన్నారాయన.

"అయితే మా బావగారు రేపు మిమ్మల్ని కలుసుకొంటారు."

"అలాగే"

ఆడవాళ్ళవద్ద శెలవు తీసుకుంది నారాయణి. వాళ్ళు వెళ్ళగానే నారాయణి ముఖం చిట్లించుకుని అనూరాధని చివాట్లు పెట్టింది. తెల్లవారి లేస్తే వాగిన నోరు వాగినట్టుంటుందికదా, అవసరంవస్తే పలుకే బంగారం అయిపోయిందేమే. అంత మొండితనమా? ఒక చెంప నే చెబుతున్నా నా మాటలు లక్ష్యపెడితేనా? ఎంత సిగ్గయితేమటుకు అంత మొండితనమా? అయ్యో! వాళ్ళేమనుకున్నారో? ఈ పిల్ల బొత్తిగా పెంకిదిలాగుందని వాళ్ళు అనుకోరూ?" అంటూ సాధించిపోసింది.

ఆమె అన్నగారు కూడా అనూరాధని కొస్త మందలించాడు. కాని అనూరాధ మనసు అసలే చిరాగ్గావుంది. ఈ ఇద్దరి ధోరణి ఆమెను మరింత ప్రకోపింపచేసాయి. ఆమె ముఖం కందగడ్డ చేసుకుని "మీ రసలు నాతో మాట్లాడకండి. నా కివ్వాళ మహా చిరాగ్గా వుంది" అని అనూరాధ కన్నీరు గ్రుక్కుకుంటూ అక్కడ్నించి వెళ్ళిపోయింది.

అన్నా చెల్లెళ్ళు ఒకళ్ళముఖం ఒకరు చూసుకున్నారు. "పిచ్చిపిల్ల. ఈ మాత్రానికే ఇంత బాధపడాలా? ఇందులో పెద్ద అవమానానికేముంది? లోకంలో జరుగుతున్న పద్ధతేగాని కొత్తదికాదుగా. దీని తీరు చూస్తే నాకు బెంగగావుంది. ఇలాంటి పెళ్ళిచూపులు ఎన్ని జరగాలో ఏమో ఖర్మ! దేవుడు మన పక్షాన వుండి ఈ సంబంధం స్థిరం చేసేస్తే బాగుండును. ఈ ఒక్కసారికే ఇదిలా రభస చేసిందికదా ఇంకోమారంటే అదసలు వచ్చి కూర్చుంటుందా? అబ్బే! ఇలాంటివాళ్ళతో వేగటం మహా కష్టం" అంటూ నారాయణి చాపమీద చతికిలబడి తల మొత్తుకుంది.

"దాని స్వభావానికి మనం అంతగా దిగులు పడాల్సిన అవసరంలేదు చెల్లీ, దానికోసం బెంగపడకు. చిన్నపిల్ల! నాలుగు రోజులుపోతే నీకంటె అనుభవజ్ఞురాలౌతుంది. కాని మనం భయపడాల్సిందల్లా మీ ఆయన స్వభావం గురించే." అన్నారు నారాయణి అన్నగారు.

ఈ చివరి మాటతో నారాయణికి ఎక్కడలేని రోషం పుట్టుకొచ్చింది. ఆమె తలమీంచి చేతులు తీసేసి "నీకు మాట్లాడితే ఆయనొకరు దొరికారా లోకువ. ప్రతిదానికి ఆయన వూసు ఎత్తుతూంటావు. ఆయనేదో దయ్యమో, భూతమో అన్నట్టుగా ఆయన స్వభావాన్ని చూసి భయపడాల్సిన అగత్యం ఏముంది? అంటూ నారాయణి తాచుపాములా కస్సుమంది.

ఆవిడ అన్నగారుకూడా అందుకు తగినట్టుగానే "నీ తెలివి మండినట్టేవుంది. కూతుర్ని చూడటానికి పెళ్ళివారొస్తే వాళ్ళని ఆదరించి మాటా మంతీ ఆడటానికైనా ఇంట్లో లేకుండా వుడాయించిన పెద్దమనిషిని నా దగ్గర నువ్వేదో సమర్థించాలనుకుంటావు.

అపాటి బాధ్యతకూడా లేని భర్తని చూసుకుని నువ్వు పొంగిపోతున్నావు. ఛా! ఇలాంటి ఆడవాళ్ళంటే నాకు పరమ అసహ్యం! నేను వున్నమాట అనేస్తాను. నాదగ్గర దాపరికం లేదు! రానీ ఆయనముందే అనేస్తాను. కాని ఒక మాట మాత్రం చెప్పదల్చుకున్నాను. ఎవరెలాంటివారైనా నాకు పోయేదేమీ లేదు. కాని నేను బాధపడుతున్నదల్లా నిన్నుగురించీ, నీ పిల్లల గురించీను. నేను వుండి ఇవాళ ఈ పెళ్ళివారిని తీసుకు వచ్చాను. నాకు తీరికలేక నేను రావటం పడకపోతే ఇక అంతేగా. వేళకి భోజనం చెయ్యటం, వూళ్ళో వ్యవహారాలు, నెత్తిన వేసుకుని తిరగటం, ఇంతేగా మనం చేసే ఘనకార్యాలు. నీ సంసారం తీరు చూసే వాళ్ళకేమీ బాగులేదు చెల్లీ! నేను మళ్ళీ రాత్రి బండికే పోతాను. రేపు వాళ్ళని కలుసుకుని ఏ సంగతీ తెలుసుకోమని బావతో చెప్పు. నేనుండగా వస్తే నేనే చెబుతాను. నేను నీ బాగుకోరేవాణ్ణేగాని చెడుకోరేవాణ్ణికాను. అందుకని ఇంతగా చెబుతున్నాను. నెత్తురు సంబంధం వుందికాబట్టి బాధపడతాను. ఎల్లకాలం ఇలా సాగదు. మన జాగ్రత్తలో మనం మన బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తించుకోకపోతే అధోగతిపాలయిపోతాం. ఎల్లకాలం రోజు లొక్క మాదిరిగా గడవ్వు" అని ఆయన క్షణం ఆగి "ఈ పెళ్ళికి ఏమైనా కాస్త పనకవేశారా?" అన్నాడు.

"ఏమీ లేదు" అంది నారాయణి తలవంచుకునే.

"నేనలాగే అనుకున్నాలే. అంతగాక మరేముంది? గతిలేక రోజల్లా వళ్ళు విరుచుకుంటే తిండి మెతుకులు దొరక్క నాబోటివాళ్ళు గడ్డికరుస్తుంటే, వచ్చింది ఖర్చు చేసుకోవటం తెలియక మీబోటివాళ్ళు కష్టాలు కొని తెచ్చుకుంటారు. మీ చేతులారా మీరు మెడకి వుచ్చులు పోసుకుంటున్నారు. డబ్బు విలువ తెలియకుండా దుబారా చేసేవాళ్ళని చూస్తుంటే నా కడుపు మండిపోతుంది. ఆ క్లబ్బులో చేరేవాళ్ళంతా అలాంటివాళ్ళే. కేవలం వ్యసనంకోసం జీవితాన్ని, సర్వస్వాన్ని బలిపెట్టే గాలిపటాలన్నీ అక్కడ చేరుతూంటాయి. మీ ఆయన వారిమధ్య యుగాలు నిముషాలుగా, హుషారుగా సర్వం మరిచి తిరుగుతూంటాడు. నువ్వాయన్ను తలుచుకుని మురిసిపోతూంటావు. ఇదంతా పాతివ్రత్యమని లోలోపల గర్వం పెంచుకుంటావు. ఏదో పెద్ద ఎదురుదెబ్బ తగిలేవరకూ మీలాంటి వాళ్ళు ఇలాగే వుంటారు. ముందు నీ వంతు నీ భర్తని అదుపులో పెట్టటానికి ప్రయత్నించు. సాగకపోతే అది వేరు సంగతి. అందుకు నువ్వు చేసిన ప్రయత్నమంటూ వుండాలిగా. ఇరవై ఏళ్ళనించీ నీ సంసారం నువ్విలా చేసుకున్నావు. ఇప్పుడిక అంతా మించిపోయింది" అంటూ ఆయన కాస్త తీవ్రంగా, సూటిగా ఎక్కడయితే తగలాలో గురిచూసి ప్రతిమాటా తూచి తూచి ప్రయోగించారు.

నారాయణి భర్తనిగురించి ఇంతచులకనగా అన్నగారు మాట్లాడటం సహించలేకపోయింది. "మీరంతా అనుకున్నంత ప్రమాదమేదీ ఆయన స్వభావంలో నాకు కనిపించలేదు. ఆయన నాకు దేముడంత మంచివారుగా కనిపిస్తారు" అని ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

ఆయన బుజాలు కుంచించుకుని మూతివిరుచుకుని "ఎవరి ఖర్మ వారిది. తనకి తోచనన్నా తోచాలి, ఒకరు చెబుతేనన్నా వినాలి. రెండూ లేనివారికి ఎవరుమటుకు చెప్పగలరు" అనుకున్నారు అర్థస్వగతంగా.

భోజనందగ్గరకూడా అన్నాచెల్లెళ్ళు మౌనంగానే వుండిపోయారు. చివరికి ఆయన మెల్లగా తలవంచుకునే "నా తల్లితండ్రులంతగా లేనివాళ్ళు కావటంవల్ల నాకు విద్యాబుద్ధులు అబ్బే అవకాశంలేక ఇలా శరీరాన్ని అతి చవకగా అమ్ముకుని, ఒక పూట తినీ, ఒకపూట తినకా బతుకుతున్నాను. ఉన్నదానిలో వున్నంతగా నా పిల్లల్ని సుఖపెట్టటానికే ప్రయత్నిస్తాను. కట్టుకున్న తర్వాత, కన్నతర్వాతా వాళ్ళని చూసుకోవద్దూ? బాధ్యత అనేది చాలా విలువైనదమ్మా. అది చిన్ననాటినుంచీ అబ్బాలి. లేకుంటే జీవితం దుఃఖభాజనం అయిపోతుంది" అన్నారు.

నారాయణి అన్నగారి దైన్యానికి కంటనీరు పెట్టుకుంది. ఆ దుఃఖతీవ్రతతో ఆమె కిక ముద్ద లోపలికి వెళ్ళలేదు. మావయ్యమాటలు అనూరాధ మనసునికూడా ద్రవింపచేశాయి. నారాయణి తినే తినే అన్నం విడిచి పెట్టి పెరటిలోకి వెళ్ళిపోయింది. ఆయన తలపట్టుకుని అలాగే గోడకి చారబడిపోయారు.

ఆరాత్రి భర్త ఇంటికి రాకుండానే నారాయణి అన్నగారు వెళ్ళిపోయారు. వెళ్ళబోయేముందు పిల్లల భవిష్యత్తుగురించి శ్రద్ధపటవలసిందని మరీ మరీ హెచ్చరించారు. నారాయణి పదిహేను రూపాయిలు అన్నగారి చేతిలో వుంచబోయింది.

ఆయన ఆవిడ గుప్పిట అలాగే మూసి "నువ్వు పంపిన పాతిక రూపాయిల్లో ఇంకా ఇరవై రూపాయిలు అలాగే వున్నాయి. అవి నాకు చాలు. కాని నెలనెలా ఇలాంటి పదిహేను వెనకవేసి ఒక సంవత్సరం తర్వాత "రెండు వందలు వెనకవేశాను అన్నయ్యా" అని ఒక వుత్తరంముక్క రాయి. నీ అన్న సంతోషిస్తాడు. ఆ పని నువ్వు చెయ్యి" అని ఆయన వెళ్ళిపోయాడు.

*నారాయణి నిట్టూర్చి లోపలికి వచ్చేసింది.*

రాత్రి వీరభద్రంగారు ఇంటికి వచ్చేసరికి పన్నెండు దాటింది. ఆయన వస్తూనే ఎవరినో తిడుతూ

అడుగుపెట్టారు. ఆయన ముఖం చాలా తీవ్రంగా వుంది. 'ఏమిటండీ' అని అడగటానికికూడా నారాయణి సాహసించలేకపోయింది. ఆయనే చెప్పసాగారు: "వాళ్ళని పాతిపెట్టేటంత డబ్బువుంది. ఏంలాభం! బుద్ధి ఘనంలేనప్పుడు వెధవడబ్బు ఎంతవుండిఏంప్రయోజనం! ఇప్పటికి రెండు సంవత్సరాల చందాలు బాకీ వున్నారు క్లబ్బుకి. ఇవాళ రొక్కంచేసరికి నానా కూతలూ కుయ్యసాగారు. అడుగుతే నామోషీలు. అడక్కుండా కడదామనే బుద్ధిలేనివాళ్ళు అడుగుతే పౌరుషాలు దేనికి? కడితే డబ్బుకట్టండి లేకుంటే సభ్యత్వానికి రాజీనామా ఇవ్వండి. మీరు ఇవ్వకపోతే నేనే రద్దుచేస్తాను" అని చెప్పేసాను. దాంతో వెధవలు జారిపోయి డబ్బుకట్టేశారు. ఈ వీరభద్రం గారితో వ్యవహారం అంటే ఏమిటో వాళ్ళకి తెలిసి చావదు. మళ్ళీ వెధవలు సిగ్గులేకుండా నాదగ్గరికి వచ్చి వాళ్ళంతట వాళ్ళే పలకరించారు. మంచిగావుంటే గౌరవిస్తాను. లేదా నల్లిని నొక్కినటు నొక్కిపారేస్తాను" అంటూ ఆయన భార్య అందించిన పంచ తీసుకుని "నాకు కాస్త మజ్జిగా అన్నం కలిపివుంచు. తిని పడుకుంటాను" అన్నారాయన.

నారాయణి మనసు క్షోభపడింది. ఇవాళ అమ్మాయిని చూడటానికి పెళ్ళివారు వస్తున్నారన్న సంగతి ఆయనకి తెలియకపోదు. 'వాళ్ళు వచ్చారా' అనిగాని 'ఏమన్నారు?' అనిగాని—అసలా విషయమే ఆయన ప్రస్తావించకపోవటం నారాయణికి మనసు కష్టం తోచింది. అయినా ఆమె తన స్వభావానికి విరుద్ధంగా ఆయనతో ఘర్షణపడలేదు.

చివరికి భోజనందగ్గర మటుకు ఆయన అప్పటికీ ఆ ప్రసక్తి తీసుకురాకపోవటం గమనించి "ఇవాళ అమ్మాయిని చూట్టానికి వాళ్ళు వచ్చారు. అన్నయ్య కూడా వచ్చాడు" అంది.

"అలాగా" అన్నారాయన.

"చూసి వెళ్ళారు. రేపు ఈ వూళ్ళోనే వుంటారుట. మీరోమారు వెళ్ళి కలుసుకుంటే ఏమాటా వాళ్ళు చెబుతారు. భగవంతుడిదయవల్ల ఈ సంబంధం స్థిర పడితే బాధలేదు" అంది నారాయణి.

ఆయన అయిష్టంగా ముఖం మార్చుకుని "నాకెక్కడ తీరికవుందే. బోలెడన్ని పనులున్నాయి." అన్నారు.

"అలాగంటే ఎలాగు. మనపస్లు మనం చూచుకో వద్దూ?"—ఇన్నాళ్ళకి నారాయణి అమాత్రం ఎదురు మాట అనగలిగింది.

ఆయన తల అడ్డంగా తిప్పుతూ "అబ్బే! చాలా ముఖ్యమైన పనులున్నాయి. అయినా ప్రయత్నిస్తాను" అన్నారు.

నారాయణి ముఖం ఆశతో వెలిగింది.

మర్నాడు, ఆమె ఈ విషయం మరోమారు జ్ఞాపకం చేసింది. ఆయన విసుక్కున్నారు. "సగ్గెద్దూ వందమార్లు చెప్పాలేమిటి?" అంటూను.

"అమ్మా చింతపండు అయిపోయిందే. కాఫీ గిన్నెలు తోమటానికి పనిమనిషి వచ్చింది" అంటూ అనూరాధ వచ్చింది.

నారాయణి అలమారులోనుంచి డబ్బుతీసి లెఖ్ఖపెట్టి చంద్రుడ్ని పిలిచి వాడికిచ్చి వాడ్ని వెళ్ళి పట్టుకురమ్మంది.

వాడు ఆ డబ్బుపుచ్చుకుని గెంతుకుంటూ వీథిని పడ్డాడు. పది నిముషాలన్నా కాకుండానే ఏడుస్తూ నెత్తిబరుక్కుంటూ వాడు ఇంట్లో ప్రవేశించాడు. నారాయణి కంగారుగా 'ఏమయిందిరా?' అంటూ ఇవతలికి వచ్చింది.

వాడు వెక్కుతూ కళ్ళనులుపుకోసాగాడు.

"ఏమయిందిరా? చింతపండు తెచ్చావా?"

"మరేం......"

"ఆఁ! ఏమయింది త్వరగా చెప్పు."

"మరేం దారిలో డబ్బులు......"

"ఏమయ్యాయి? పారేశావా? ఎవరన్నా లాక్కున్నారా?"

"జారిపోయి పడిపోయాయి. ఎంత వెతికినా కనబడలేదు." అంటూ వాడు ఏడుపు సాగించాడు.

నారాయణమ్మ ఓర్పు సన్నగిలి వాడ్ని నెత్తి మీద నాలుగు మొట్టి "ఎక్కడ పారేసావురా. సరిగ్గా వెతికావా? మళ్ళీపోయి చూసి రా" అంటూ వాడ్ని తోసింది.

"అయినా పెద్దోళ్ళు తెచ్చుకోవాలిగాని ఆయన్ని పంపడమేందమ్మా. ఆయనకేం తెలుసుద్ది" అంది పనిమనిషి చీపురు తీసుకుని ప్రవేశిస్తూను.

"ఇంకెవరున్నారు. నేను వీథిని పడాలి." అంది నారాయణి చేతిలో చంద్రుడ్ని కుంజుతూను.

"ఎంత వెతికినా కనబడలేదే" అంటూ వాడు వెళ్ళటానికి మొరాయించాడు.

నారాయణి నెత్తి మొత్తుకుంటూ "నువ్వన్నా వెళ్ళి ఓమారు వెతికిరా అమ్మా! పోరా! దాంతో పోయి వెతికిరా" అంటూ వాడ్ని ఓ తోపు తోసింది.

పని మనిషి వాడ్ని తీసుకుని వీథిలోకి నడిచింది.

[సశేషము]

# కలగూరగంప

## భూమి తిరుగుట లేదా!

శ్రీ వేమూరి నరసింహమూర్తి

శతాబ్దుల కాలము శల్యపరీక్షచేయబడి ప్రయోగాత్మక నిరూపణలచే నిర్ధారణచేయబడిన నిర్ణయము తిరిగి సనాతనాచారపరులకువారిచే సవాలు చేయబడుటయే యీ వ్యాసమునకు కారణము. పూర్వోక్త మతవిషయము లన్నియు నిత్యసత్యము లని నమ్మి ఆ యభిప్రాయములను మనసునందుంచుకొని వాని కెట్టయిన సమర్థించుటే తమ ఆశయముగా పెట్టుకొనుట వీరి పద్ధతి. నిర్హేతుక మగు మతవిధేయతకంటె సహేతుక పరిశీలన శాస్త్రమునకు దోహదము చేయగల్గును.

'ఆస్తికత్వము' అను గ్రంథమునందు శ్రీ వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తిరిగి భూకేంద్ర సిద్ధాంతము నుద్ధరింప ప్రయత్నించిరి. కేరళ దైవజ్ఞ విరచిత 'వివాహబృందావనము'; శ్రీ అనంతుని సీతారామ సిద్ధాంతిగారి 'జోతిస్సిద్ధాంత తత్వప్రదీపిక'; రామచంద్ర సుబ్బాజీ బాబుగారు మహారాష్ట్ర భాషలో వ్రాసిన 'సిద్ధాంతశిరోమణి ప్రకాశిక; దైవజ్ఞ విలాసము మొ॥ గ్రంథములనుండి యుదాహరించుచు భూకేంద్ర సిద్ధాంతమును బలపరచిరి. అనేక శాస్త్రజ్ఞులచే బరిశీలింపబడి నిర్ణయము చేయబడిన సూర్యకైంద్రిక సిద్ధాంతమును నిర్ధారింప బూనుట పునర్విమర్శయే కావచ్చును; కాని శ్రీ శాస్త్రిగారు ఆధునిక విజ్ఞానశాస్త్ర పురోగమనమును పరిశీలింపకయే అజ్ఞాతమయిన సిద్ధాంతమును బయటికి తీసిరి గనుక దానియందలి దోషములను బరిశీలింపవలెను.

సూర్య చంద్రులు రాహుకేతు గ్రస్తములగుటయే సూర్యచంద్ర గ్రహణములకు కారణములనియు, భూమి స్థిరముగ నున్నదనియు స్థిరముగనున్న భూమి చుటు సూర్యుడు నక్షత్రములు తిరుగుచున్నవనియు శాస్త్రి వాదము.

జ్యోతిశ్శాస్త్ర జ్ఞానము ప్రబలి సూర్యచంద్రుల గ్రహణములకు కారణములు చంద్రునియొక్క భ్రమణములో భూమిపైనను; భూమియొక్క భ్రమణములో చంద్రునిపైనను సూర్యకాంతివలన గలుగు ఛాయలే యనియు వేరొండు కాదనియు నిర్ణయింపబడిన తర్వాత రాహు కేతు సంబంధమగు వాదము నిరస్తమయినది. అయినను శ్రీ శాస్త్రిగారు రాహు కేతువులు సూర్య చంద్రులను మ్రింగుచున్నవను వాదమును విసర్జింపలేక రాహుకేతువులు అంధకార చారులు గనుక ఛాయాగతులై వారు సూర్యచంద్రులను గ్రసించుచున్నారని సనాతన నూతన సిద్ధాంతములకు సమన్వయము చేయబూనిరి. పాఠకుల యర్థసౌలభ్యముకొరకు వారి వాక్యములనే ఎత్తి వ్రాయుదును.

"చంద్రునియందు భూచ్ఛాయ పడినప్పుడు ఆ ఛాయ అంధకారరూపము గనుక అంధకార చారియగు రాహువు దాని నాధారము చేసికొని చంద్రుని ఆచ్ఛాదించును. అంధకార రూపమయిన చంద్రమండల చ్ఛాయ సూర్యునియందు పడినపుడు ఆ ఛాయ నాధారము చేసికొని సూర్య మండలమును రాహువు ఆచ్ఛాదించును.

కనుక ఛాయా నిమిత్తమున గ్రహణమను వాదమునకును రాహు నిమిత్తమున గ్రహణమను వాదమునకును విరోధమేమియు లేదు."

ఈ వాక్యమును బట్టే చూడ చంద్రునియొక్క ఛాయ సూర్యునిపై బడునని వీరు భ్రమపడుచున్నారని స్పష్టము. సూర్యుడు స్వయంప్రకాశము గలవాడనియు చంద్రునియొక్క ఛాయ భూమిపై పడునుగాని సూర్యునిపై పడుట కవకాశము లేదనియు వీరు గ్రహించిన వీరి సమన్వయ పద్ధతిలోని లోపము స్పష్టమగును. ఇంతటితో నయినను ఛాందసత్వమును విడి సూర్యచంద్రుల గ్రహణమును గూర్చిన సత్యమును వీరు గ్రహింపవలెను.

శాస్త్రిగారు సూర్యకైంద్రిక సిద్ధాంతమునకు చూపు ఆక్షేపణ లేవియు కూడా ఇతఃపూర్వము వాదోపవాదములు లేక విస్మరింపబడినవి కావు. ఈ సందేహము లన్నియు ప్రాచీనులకుగల్గినవే. కొన్ని శతాబ్దములు సూర్యకైంద్రిక సిద్ధాంతమును స్థాపించుట కొరకు వాదోపవాదములు జరిగినవి. ఈ సిద్ధాంతమును

సమర్థించు శాస్త్రజ్ఞులు సమకాలికులయొక్కయు, మతాచార్యులయొక్కయు నిశిత విమర్శలకు లోనై వారిచే బాధింపబడియు తాము నమ్మిన సూత్రములను విడువక ముందుకు సాగిపోయిరి. మొట్ట మొదటిసారిగా సూర్యకైంద్రిక సిద్ధాంతమును ప్రతిపాదించిన వాడు క్రీ. పూ. ఐదవ శతాబ్దము వాడగు పైథాగొరస్. కాని యాతడు తగు పరిశ్రమ చేసి యీ విషయమును స్పష్టముగ నిర్ధారణ చేయుటకు తగు సాక్ష్యమును సేకరింపనందున తరువాత టాలమీ యను యీజిప్టు దేశీయుడు క్రీ. శ. రెండవ శతాబ్దములో యీ సిద్ధాంతమును వెనకకు త్రోసి భూకేంద్ర సిద్ధాంతమును ప్రతిపాదించెను. సూర్యకేంద్ర సిద్ధాంతమును ఖండించుటకు ప్రస్తుతము శ్రీ శాస్త్రిగారు ఆయా గ్రంథములనుండి ఎత్తిచూపిన సందేహాస్పద విషయములన్నిటిని అతడు ఉపయోగించుకొనెను. పదార్థవిజ్ఞానశాస్త్రము తగినంత అభివృద్ధి కాని ఆ కాలములో ప్రత్యక్ష ప్రమాణములను చూపి, వాదన చేయు టాలమీయొక్క తార్కిక బలముచే అప్పటికి సూర్యకైంద్రిక సిద్ధాంతము మరుగునపడి భూకైంద్రిక సిద్ధాంతము నిజమని నమ్మబడినది. టాలమీ సిద్ధాంతములోని అపసవ్యతను తరువాత పదిహేను శతాబ్దములవరకు నిరూపింప వీలుపడినది కాదు. క్రీ. శ. పదునారవ శతాబ్దములో 'కోపర్నికసు' అను పోలండు దేశీయుడు టాలమీ నిర్మించిన సౌధమును కూలద్రోసెను. దానితో చక్కగ విశ్వమధ్యమున నుండి సూర్యుని, ఇతర గ్రహములను తనచుట్టు త్రిప్పుకొనెడి మనభూమి తన విశిష్ట స్థానమును గోల్పోయి సామాన్య గ్రహమువలె సూర్యునిచుట్టు ప్రదక్షిణము చేయవలసి వచ్చినది. అట్టి తలపే ఆనాటి ఛాందసులగు క్రైస్తవ మతస్థులకు కష్టముగనుండెడిది. తాము నివసించు భూమి మధ్యనుండి, తముచుట్టును సూర్యచంద్రగ్రహములు తిరుగుచున్నవను ఆధిక్యభావమును, అందు కల ఆనందమును సత్యముకొరకు ఆనాటి మతగురువులు విసర్జింపలేకైరి.

అట్లయినను అనేక కష్టనష్టముల కోర్చి కోపర్నికసు మొదలుగాగల శాస్త్రజ్ఞులు జ్యోతిశ్శాస్త్ర జ్ఞానము నభివృద్ధి పరచిరి.

కోపర్నికసుకంటె ముందుగా క్రీ. శ. ఐదవ శతాబ్దములో హైందవశాస్త్రజ్ఞుడగు ఆర్యభటుడు "అనులోమ గతిః నౌస్థః పశ్యత్యచలం విలోమగం యద్వత్ । అచలాని భాని తద్వత్ సమ పశ్చిమగాని లంకాయామ్॥" అని దృష్టాంతపూర్వకముగ భూభ్రమణమును నిరూపించియున్నాడు. ఇందు 'లంకాయామ్' అనుపదము ఒక నిర్దిష్టమగు స్థలము నుదహరించుటకు చెప్పియున్నాడు గాని భూమండలమందుండి జూచినను గ్రహనక్షత్రాదులు పశ్చిమాభిముఖమై భ్రమించుచున్నట్లుండునని యాతని భావము. అట్లే.

శ్లో॥ అగ్న్యార్కచ్చంద్ర మండలాత్ భ్రమతి।
హితస్మిన్ క్షితి చ్ఛాయా॥

అను ఆర్యభటుని శ్లోకమునుబట్టి యాతనికి సూర్యునిచుట్టు భూమి భ్రమించుచుండునను విషయము తెలిసియుండెనని వ్యాఖ్యాతలు తీర్మానించియున్నారు.

ఇక శాస్త్రిగారి యాక్షేపములను బరిశీలింతము.

(1) తూర్పునకు గాగలుగు భూభ్రమణవేగము వలన పశ్చిమదిక్కుగా సతతము పెనుగాలి వీచుచుండవలయును.

(2) ఆ పెనుగాలినిబట్టి పతాకలు ఎప్పుడూ పశ్చిమదిక్కుగానే ఎగురుచుండవలెను.

(3) మేఘసంచారము కూడ ఎప్పుడూ పశ్చిమదిక్కునకే ఉండవలెను.

(4) ఆకాశమువిూదికి వేసినబాణము ఎప్పుడుపడినను పశ్చిమదిక్కునకే పడవలెను

(5) ప్రాతఃకాలమున తమ గూళ్ళను విడిచి వెళ్ళిన పక్షులు ఆకాశమునుండి తమగూళ్ళకు తిరిగి చేరలేకపోవలెను.

భూమిపైగల ప్రాణుల జీవితమంతయు భూమి నాశ్రయించుకొని జరుగుచున్నది. భూమిపైగల సమస్త ప్రాణికోటియు వస్తుసముదాయమును భూమినాశ్రయించుకొని యుండవలసినదేగాని, భూమిని వదలిపెట్టి పోవుట అసంభవమను విషయము మనకు దృక్సిద్ధమగుచున్నది. దీనినిబట్టియే భూమికి ఆకర్షణశక్తిగలదని నిర్ణయింపబడినది. ఈ భూమ్యాకర్షణశక్తి భూమిని పరివేష్టించి ఆకాశమునందు (space) కొంతదూరము వరకుండును. ఈ భూమ్యాకర్షణముయొక్క అవధిని దాటుటకు, ఈశక్తి ప్రభావమునుండి తప్పించుకొనుటయును ఏరికిని శక్యము గాదు. భూమ్యాకర్షణ ప్రభావము ప్రసరించునంతవరకుగల దేశమునందు జరుగు విషయములన్నియు అట్టియాకర్షణకు లోబడియే జరుగుచుండును. కనుకనే ఆకాశమువిూదికి వదలిన బాణముకాని, తమ గూళ్ళను వదలిపోయిన పక్షులుగాని తమతమ స్థానములను పోగొట్టుకొనుటలేదు. ప్రతిక్షణము, ప్రతిలిప్త, ఇట్లేల: మానవుని కవగతిమగు ప్రతి కాలవిభాగమునందును కూడ అనగా నిరతము (without interval) భూమ్యాకర్షణము తన్నాశ్రయించియున్న ప్రాణికోటిని, వస్తుసముదాయమును తనవైపు లాగుకొనుచుండుటచే భూమినుండి పైకెగసిన యేవస్తువుగాని స్థానభ్రష్టత్వముపొందక స్వస్థానము చేరుచున్నది. అట్లుగాక పక్షి తన గూటిని వదలిపోయిన తర్వాత భూమి తన యాకర్షణ శక్తి నుపసంహరించుకొనిన యెడల శ్రీ శాస్త్రిగారి య

భావించుచుంటులు పక్షి తనస్థానమును గోల్పోవును. అట్టి పక్షి తన రెక్కలలో బలమున్నంతవరకు విహరించి స్వబలముతో భూభ్రమణవేగము నతిక్రమించి గూటిని చేరుకొనును. లేదా మార్గమధ్యమున శక్తివిహీనమై స్థాణువుగా అంతరాళమున నిలచియుండును. లేక భూమి తన యాకర్షణశక్తి నుపసంహరించుకొనుట వలన యితర గ్రహముల యాకర్షణ యిటు ప్రసరించి తమవైపు లాగుకొనను వచ్చును.— కాని భూమియొక్క నిరంతరాకర్షణశక్తి అట్టి ఊహలకు తావీయదు. ఇక పక్షి తనకు భూమినపేక్షించిగల స్వీయ వేగమునుబట్టియే ఆహారమునకై గూటిని వదలిపోగలుచున్నది. భూమ్యాకర్షణ పరిధినధిగమించి పోలేని పక్షికి భూగమనము నిరపేక్షణీయము. ఉదా॥ గంటకు ముప్పదిమైళ్ళ వేగముతో పరుగిడు రైలుబండియందు మనము ఏదిక్కునకైనను నడువగలుచున్నాము రైలుబండియొక్క చలనవేగము బండిలోని ప్రయాణీకుల చలనమును మార్పు చేయుటలేదు. దీనిని బట్టి చలనము సాపేక్షము (Relative) అని తెలియుచున్నది. చలనము సాపేక్షమగుట వలననే భూభ్రమణము మన కతీంద్రియమగుచున్నది. భూమిపై జరుగు చలనక్రియ యంతయు భూమినపేక్షించిన చలనమే గాని స్వతంత్రము గాదు. అందుచేతనే పొగ, మేఘములు మొ॥ వాయువులు భూభ్రమణ చలనముతో నిమిత్తము లేకుండ నల్దిక్కుల సంచరింపగలుగుచున్నవి.

న్యూటన్ తన ప్రిన్సిపియాలో "The motion of bodies included in a given space are the same among themselves whether that space is at rest or moves uniformly forwards..." అని వ్రాసినాడు. దీనికి సుమారుగా "స్థిరముగనట్టి గాని, సమగతితో గాని చలించునట్టి దేశములోని మూర్తముల చలనములు సమానములు" అని యర్థము. అనగా ఒకే దేశము నపేక్షించియుండు మూర్తముల చలనములు ఆదేశము (space) యొక్క చలనమున పేక్షింపవు. దీనిని బట్టి భూమి సెకనుకు 17 మైళ్ళ చొప్పున తిరిగినను 17 వేల మైళ్ళ చొప్పున తిరిగినను భూమి నపేక్షించియుండు వస్తు సముదాయముల పరస్పర సంబంధములు మారవని తెలియుచున్నది.

భూమిమీదుండు జెండాలు ఎగురుటవంటి దృశ్యములు పూర్తిగా భూమి నాశ్రయించియుండు దృశ్యములని గ్రహింపవలెను. తథ్యమగు పదార్థమందు (*Real matter*) ఇతరమగు మూర్తము (*body*) చలించిన పదార్థమునకు గాని మూర్తమునందు గాని సాపేక్షవేగము (Relative motion) ఇంద్రియ గోచరమగును (ఇంద్రియ గోచర మగుటయనగా శుద్ధముగా ఇంద్రియములకు తోచుటగాని, ఇంద్రియవశమగు ప్రయోగములకు వశమగుటగాని అని యర్థము) భూమి చరించు మహదాకాశమున పదార్థమేదయిన గలదా? లేదా? అను మీమాంస పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్తలను కల్లోలపరచినది. భూమి చరించు అంతరాళమున ఈథరు (మిథ్యావాయువు) వంటి పదార్థమేదయినను వ్యాపించియున్నను ఇంద్రియ వశమగు ప్రయోగములేవియు భూమియొక్క చలనగతిని నిర్ణయింపలేవు. దీనినే ఐయిన్‌స్టిన్ "Nature is such that it is impossible to determine absolute motion by any experiment whatever" అని సూత్రీకరించినాడు." ఎటువంటి ప్రయోగము చేతనయినను నిరపేక్ష చలనమును నిర్ణయించుట అసంభవము" అని దీని యర్థము.

ఇక శాస్త్రిగారుదహరించిన మేఘ నిర్మాణము, వర్షపాతము నిస్సందేహముగా స్థానిక దృశ్యములనియు భూమి నాశ్రయింపక జరుగు ప్రక్రియలు గావనియు తెలియనగును. దీనినిబట్టి ఒకే దినమున వర్షపాతము భూమినిచుట్టి వ్యాపించియుండుటలేదను విషయము సుగమమగుచున్నది. భూమి తిరుగుచున్నదను కారణముచే వర్షము భూమియందన్ని ప్రదేశములను కప్పించుమనన్న, వర్షము ఏదియో ఒక దీర్ఘాంశముపై

పొడవునను ప్రారంభించి తీరవలయును. కాని ఒకే దీర్ఘాంశయందుగల ప్రదేశము లన్నిటియందును ఏక కాలమున వర్షము పడుటలేదు. ఒక గ్రామమునందలి తోటలలో ఒకతోటపై వర్షముండుటయు, మరియొక తోటపై వర్షము పడకపోవుటయు మన మెరిగిన విషయమే. కనుక భూమి తిరుగుటవలన వర్షము భూమి యంతయు వ్యాపించి యుండవలెనను వాదము దోషయుతము. వర్షము స్థానిక వాతావరణము యొక్క కార్యరూపము.

భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నదనుటకుగల నిదర్శనములను చూడుడు:—ఒక దినమున మధ్యాహ్నకాలమున సూర్యుని నిమ్నకోణము (Angle of declination) ను గుర్తించి ఆ రాత్రి అర్ధకాలమునుసరికి దక్షిణోత్తర రేఖపై (observer's meridian) సూర్యుని కభిముఖమైయుండు స్థానమునుగాని అచ్చోటగల నక్షత్రమునుగాని గుర్తింపవలెను. అదే స్థానమును వరుసగా కొన్ని దినములు ఒకే కాలమున గుర్తింపగా కొన్ని దినములకుసరికి ఆ నక్షత్రము పశ్చిమాభిముఖమై ప్రయాణము చేయుచున్నట్లుండును. అనగా అంతరిక్షమున మన పరిశీలన స్థానమున కభిముఖముగా (diametrically opposite) పాతాళమున (Below the horizon) గల సూర్యుడు ప్రాఙ్ముఖముగా నడచునట్లు కనపడును. అంతరిక్షమున నక్షత్రము పశ్చిమాభిముఖమై ప్రయాణము చేయుచున్నట్లు కనపడినను దాని కితరనక్షత్రములతోగల యంతరము మారదు. కనుక నక్షత్రమండలి యంతయు సూర్యునిచుట్టు ప్రదక్షిణము చేయుచుండవలయును. ఇది సంభవమా?! మఱియు ఎన్నియో లక్షల మైళ్ళ దూరమునగల యీ నక్షత్రములు పరిశీలకుని కంటివద్ద దినమునకొక డిగ్రీ చొప్పున కోణము చేయుచో అవి ఎన్నియో కోట్ల మైళ్ళ వేగముతో పరుగిడుచుండవలెను. ఆధునిక శాస్త్రజ్ఞానమునుబట్టి అది యసంభవము (సెకనుకు 186271 మైళ్ళ కంటె ఎక్కువ వేగమసాధ్యము) అదియునుగాక శతసహస్రములగు నక్షత్రములలో ఒక సామాన్య నక్షత్రమగు — సూర్యుని చుట్టును మిగిలిన నక్షత్రము లన్నియు భ్రమించుచున్న వనుకొనుట సరిగాదు. కనుక యీ సందర్భమున నక్షత్రములు తిరుగుటలేదని యనుకొనవచ్చును. కనుక భూమియే తనకన్న ఎన్నో వేలరెట్లు (సుమారు 330000 రెట్లు పెద్దదగు సూర్యగోళముచుట్టు తిరుగుచున్న దనుట సత్యము.

భూమియొక్క జన్మమునుగురించి ఆధునిక జ్యోతిష్కులలో అభిప్రాయభేదము లున్నను ఈ నాటి వరకు ప్రబలిన విజ్ఞానశాస్త్ర చరిత్రలో ఏ శాస్త్రకారుడుగాని భూమి సూర్యగోళమునుండి విడివడగా ఏర్పడ్డ గోళమను విషయమును నిరాకరించలేదు. భూమికి సూర్యుడు మూలమనునది నిర్వివాదాంశము. సూర్యునినుండి యుద్భవించి, సూర్యునికన్న ఎన్నో వంతులు చిన్నదయి, సూర్యకాంతిపై ఆధారపడియున్న భూమి సూర్యునాశ్రయించి సూర్యునిచుట్టును తిరుగక సూర్యుడే భూమిచుట్టూ తిరుగుచున్నాడనుట, భూమిమీదను సనాతనగ్రంథములమీదను వారికి గల మమకారమే కారణ మనిపించుచున్నది.

శతాబ్దములనుండి ఎందరో మహానుభావులు ప్రోవుచేసిన విషయ సంపదను పరిశీలించి హేతువున కాగని విషయములను, ప్రయోగాత్మకముగా నిరాధారమని ఋజువుచేయబడిన విషయములను వదలివేయుట; సందిగ్ధములగు విషయములను పునఃపరిశీలనచేసి విషయ నిర్ధారణచేయుట బుద్ధిమంతుల లక్షణము. ఇట్లని సనాతన భారతశాస్త్రజ్ఞుల ప్రజ్ఞావైశిష్ట్యమును నిరసించుట కాదు. ఎంతటి మహామేధావులయినను తత్కాల పరిస్థితులకు లోబడి పనిచేయువారే గనుక, వారు చెప్పినదే పరమసత్యమని నమ్మనంతమాత్రమున వారిని నిరసించుట గాదు. ఈతరమువారు తిరిగి పరిశ్రమచేసి కాలహరణము చేయకుండ వారు ప్రోవుచేసిన విషయ సంపదను చేర్చుకొనుచుండుటవలన వారెప్పటికిని గౌరవనీయులే. కానివారు చెప్పిన విషయము లన్నియు పరమసత్యములని పరిగణింపక, శాస్త్రము సంపాదించిన నూతన విషయములతో, నూతన పరికరములతో పూర్వ శాస్త్రజ్ఞుల యభిప్రాయములను సవరించవలసినచోట సవరించుట యనునది ఆక్షేపణీయము కాదు. కాగా ఎంతకాలమునకు ఒకే శాస్త్రము, ఒకే గ్రంథము ఒకే అభిప్రాయము న్యాయమని నమ్మి చిలుకవలె పునశ్చరణ చేయుటమాత్రము హాస్యాస్పదము.

మేధావి కనుకనే ఆర్యభటుడు క్రీ॥ శ॥ 12-వ శతాబ్దములోనే అనగా కోపర్నికస్ కంటె ముందుగనే భూభ్రమణ సిద్ధాంతమును భూమి సూర్యునిచుట్టు తిరుగు కక్ష్య సమవృత్తముగాక ఆయత వృత్తమై యుండుననియు ఊహించగలిగినాడు. అట్లే భాస్కరాచార్యుడు గొప్పగణితశాస్త్రజ్ఞుడుగా పరిగణింపబడెను. భాస్కరాచార్యుడు గణితశాస్త్రజ్ఞుడైనంతమాత్రముచే అతని సూత్రము లన్నియు నిరాక్షేపణీయములు గా నవసరంలేదు. మూడుశతాబ్దముల క్రిందట న్యూటనుచే వ్రాయబడిన చలనసూత్రములు (Laws of motion) ద్రవ్యాకర్షణ సూత్రము ఇంతకాలమును నిత్య సత్యములుగా నమ్మబడినవి. కాని ఈనాడు స్వల్పముగ సవరణలు చేయవలసి వచ్చినది. ఇది సత్యాన్వేషణ, శాస్త్రపద్ధతి.

# గ్రంథ విమర్శనము

## మహాభారత కర్ణ

పద్యకావ్యం; రచన: శ్రీ వంగా రామిరెడ్డి; ప్రాప్తిస్థానం: శ్రీ ప్రత్తిగోడుపు రాఘవరాజు, ఈమని పోస్టు, (వయా) దుగ్గిరాల, గుంటూరు జిల్లా; వెల రు 1-0-0.

మహాభారతంలో కర్ణునిపాత్ర లోకోత్తరమైన చిత్రణ. కర్ణుడు లేంది భారతం లేదనే అభిప్రాయం సామెతగా నిలిచిపోయింది. ఎట్టి ధార్మికసమస్య లెదురయినా, ఎట్టి క్లిష్టపరిస్థితు లెదురయినా, ధీరోదాత్తుడై నిలచి తన ఆత్మతేజమును జగత్తుకు చాటిన మహాపురుషుడు. మహా త్యాగశీలియైన యీ ప్రాచీనపురుషుడు, స్వాతంత్ర్య సమరోన్ముఖమైన నవ్యభారత రంగంలో అనేకమంది కుమారయోద్ధలకు ఉత్సాహకారకుడయినాడు. పలువురు యువరచయితలు కర్ణుని చరిత్రయందలి ఆయా ఘట్టాలను సేకరించి ఖండకృతులుగా రచించారు. శ్రీ రామిరెడ్డిగారు, భారతమునందు గల కర్ణుని ప్రధానఘట్టాల నన్నిటినీ సంపుటీకరించి ఈ కావ్యాన్ని సంఘటించారు.

ఈ కావ్యాన్ని శ్రీ రెడ్డిగారు—కర్ణ ప్రేమ, కర్ణదీక్ష, కర్ణశపథం, కర్ణ శౌర్యం, కర్ణ సైన్యాధిపత్యం, కర్ణ దాతృత్వం, కర్ణ స్వరూపం, కర్ణశీలం, కర్ణవిషాదం, కర్ణభీభత్సం, కర్ణమరణం, పూజాంజలి, అనే శీర్షికలుగా విభజించారు. ఇట్టి ప్రణాళికవల్ల ఆయా ఘట్టాలలో రచయిత తాను చెప్పదలచిన విషయాన్ని సూటిగా చెప్పటానికి అనువైంది. అనవసరమయిన వర్ణనలు వగయిరా చొరటానికి అవకాశము లేకుండా, చక్కని శిల్పరూపంలో కావ్యాన్ని రూపొందించటానికి వీలైంది. రచయిత అత్యంత శ్రద్ధాళువు. ఈ శ్రద్ధ ఒక కథానిర్మాణంలోనే గాక పదపద విన్యాసంలోనూ, పద్యపద్య నిర్మాణంలోనూ మనకు కనుపించుతుంది. ఇట్టి శ్రద్ధ ఆధునిక రచయితలలో బహు కొద్దిమందిలో మాత్రమే కనుపించుతుంది. శ్రీ రెడ్డిగారు ఇందుకు అభినందనీయులు.

చీమ చిటుక్కుమన్న తన
 చిత్తము వ్రయ్యలు వ్రయ్యలైయెదో
బాముల క్రుంగు; కంట తడి
 పైట చెరంగున నొత్తిముంచుకున్
బో మదిసెంచు, కాల్గదపి
 బోర్ల బడుక్, పడి తెప్పరిల్లి నా
నోము ఫలంబు లీగతి మ
 నుష్యతి మాపి కుమార నేషనున్.

ఇది, అర్ధరాత్రి సమయాన కర్ణుని కలుసుకోవటానికి వెడుతున్న కుంతిమూర్తి; ఈ పద్యంలో కుంతీదేవి బాహ్యమూర్తి మాత్రమే గాక అంతరంగిక మూర్తి సహితం విజయవంతంగా ప్రస్ఫుటం చేయబడివుంది. రచయితకు ప్రాచీన సాహిత్యకారుల శిల్పమార్గాలు కరతలామలకమైవున్నాయి. అందుచేత పద్యం ప్రారంభించగానే, అది యేదో ఒకరకమైన మనోహరగమనాన్ని తనంతదా సంతరించుకుంటుంది.

ఉదాహరణకు : కృష్ణుడు-కర్ణునితో :

అగ్నిబుట్టు మానవతి
　　అందమునన్ రతి, సద్గుణంబులన్
భగ్నవిపాగ్నిశీల, కల
　　కాలము పాండవపాదసేవలో
నిగ్గులు దిద్దు ద్రౌపది అ
　　నింద్యచరిత్ర, మదీప్సితంబునన్
పెగ్గ త్యజించి నీ ప్రణయ
　　జీవితరేఖల కంకితంబగున్.

ఏ రచయితకైనా, ముఖ్యంగా సంస్కృతి ప్రభావంలో మునిగి తేలుతూండే మనకు జాతీయమైన నుడికారం పట్టుబడటం చాలా కష్టం. ఈ దిగువపద్యం చూస్తే రచయితకు ఆ రంగంలోగల సాధన మనకు అవగతమౌతుంది. కృష్ణుడు కర్ణునితో :

రోసము మోసులెత్తి జిగి
　　రొమ్ము బిగించి, తెగించి, విల్లునన్
దూసిన బాణపుంజముల
　　తో అదలించి గమించునీపయిన్
మీసముదువ్వి పోరగల
　　మేటి యెవండు త్రిలోక నేతలన్



దాసులజేతునీకు పర
　　దాస్యమునన్ బడి క్రుగ్గనేటికిన్.

కర్ణునిపాత్రకు మెరుగులు దిద్దాలనే ఉత్సాహంలో రచయిత భీష్మాది మహాపురుషుల పాత్రలనుద్దేశించి పరుషమైనపదాలను కొన్నిటిని వాడారు. వాటిని రానీయకుండా చూచుకునివుంటేబాగుండేది. అలాంటి పరుషవాక్యాలు అక్కడక్కడ కర్ణునిచేతనే పలికించటం, రచయిత ఉద్యమానికే విఘ్నం కలిగించేదిగా వుంది. తిట్టుకోవటం గొప్పవాళ్లూ తిట్టుకుంటారు బజారు రకం తిట్టుకుంటారు. గొప్పవాళ్ళు తిట్టుకున్నప్పుడు, అస్థాయి వేరుగా ఉంటుంది.

"పేటలువార ఈ ముసలిపీనుగు ధర్మము లుగ్గడించి..."ఇత్యాది కర్ణుడు భీష్ముణ్ణితిట్టడం రసిక హృదయాలను చివుక్కుమనిపించుతుంది.

## రాష్ట్రీయ పఞ్చాఙ్గ

### [తెలుగు]

ఇది సమస్త భారతదేశానికీ ఒకేరకమయిన పంచాంగం వుండాలనే ఉద్దేశ్యంతో చిరకాలంగా భారతప్రభుత్వం చేస్తున్న కృషికి ఫలితం. దీన్ని తెలుగులో అనువాదం చేసినవారు శ్రీ పిడపర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారని ప్రకాశకుల పీఠికవల్ల తెలుస్తున్నది.

ముఖపత్రంమీద "రాష్ట్రీయ పంచాఙ్గ" అనీ లోపలి ముఖపత్రం మీద "రాష్ట్రీయ పంఞ్చాఙ్" అనీ ముద్రించారు. వీటిని చిత్తగించితే ముందుముందు హిందీ ప్రాబల్యంవల్ల మన భాషకు ఇలాంటి గతి పడుతుందా అని భయపడవలసివస్తోంది. శ్రీ శాస్త్రి గారు ఇలా ఎందుకు అనువదించారో చిత్రంగావుంది. ముఖశీర్షికలేకాదు. లోపలకూడా అలాగేవుంది. ఉదాహరణకు :

---

1. చైత్ర,శుక్రవార, 22 మార్చి 19 పాబాన్

సూర్యోదయ గం 6-04, అస్త గం 18-10 (ఉ గం 6-20 అ. గం 18-26) తిథి: (ఫాల్గున కృష్ణ) సప్తమి గం. 21-52 జ్యేష్ఠనక్షత్ర గం. 17-01 సిద్ధియోగ అస్పృశ్. గం 8-10 విష్టికరణ గం. 9-26 ధనుస్సు నందు చంద్రప్రవేశ గం. 17.01

ఇండియా నూతన సంవత్సరాది.

---

## గ్రంథ విమర్శనము

ఇది నిజానికి భాషకు సంబంధించిన విషయం. పంచాంగానికి సంబంధించిన విషయం కాదు; వదిలేదాం.

ఇక పంచాంగం విషయం—భారతదేశంలో వివిధ ప్రాంతాల ప్రజలనూ ఒకే త్రాటిమీద నడిపించటం మాట ఎలా వున్నా ఒకేమూసలో పోతబోసుకురావాలనే ఉద్దేశ్యంతో భారత ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలలో ఈ 'రాష్ట్రీయ పఞ్చాఙ్గ్ నిర్మాణ్' ఒకటి. అయితే యీ ప్రయత్నం యెంతవరకు ప్రజామోదాన్ని పొందగలదనేది, ముందుముందు తేలవలసిన విషయం. హిందీ రాష్ట్రభాష కావటానికి ఎంతకాలం పడుతుందో, ఇది ప్రజామోదం పొందటానికి కూడా అంతకాలమూ పట్టవచ్చు.

ప్రచురణ: డైరెక్టర్ జనరల్ ఆఫ్ అబ్జర్వేటరీస్, లోడి రోడ్, న్యూఢిల్లీ; వెల రు 0.25

---

### చిత్రశతకమ్

సంస్కృత మూలం: శ్రీ జటావల్లభుల పురుషోత్తము; ఆంధ్రానువాదం: శ్రీ ఆత్మానంద యతీంద్రులు. ప్రాప్తి స్థానము: శ్రీ జటావల్లభుల పురుషోత్తము సత్యనారాయణపురం, విజయవాడ-2. వెల రు. 1/-

శ్రీ పురుషోత్తంగారు ఆర్షసంప్రదాయ ప్రచారానికి విశేషంగా కృషి చేస్తున్నారు. ఆ కార్యక్రమంలో వీరు రచించి ప్రచురించుకున్న గ్రంథ పరంపరలో ఇది ఒకటి. ఇది, 'గీర్వాణవాణి' 'భారత విభూతి,' 'ఆన్వీక్షికి' 'మన ఋణదాత' (విద్యారణ్యులు), 'వైరాగ్యము' 'జీవితకళ', 'కుటుంబం' 'సమాజ సమీక్ష', 'ఈశ్వరారాధనము' 'చిత్రలోకము' అని పది భాగాలుగావుంది. శ్రీ పురుషోత్తంగారి ఉదారాశయం మనకు తెలుసునుగనుక విశేష విమర్శ పనిలేదు. మచ్చుకు ఒక శ్లోకం ఉటంకించి, దానికి శ్రీ స్వామివారు చేసిన అనువాదాన్ని ఉదాహరించి వదిలేస్తాం:

---

సకలం నో ధనికోఽహిలోకే
యస్యాస్తి విత్తం నికటే మహీయః
జ్ఞేయశ్చసోఽపిహ ధనాఢ్య ఏవ
మన్యేతిరాశిం స్త్రృణవ ద్ధనస్య"

అనువాదం:

చం॥ ఎవని నికాంతమందున న
హీనముగా సిరి వర్ధిల్లుచుండునో
యతని నతండొకండె ధని
కాగ్రణి కాడిక నేమనన్ గన
ద్రవిణపురాశి ఘాసము
దాయముగా గణియించు నెవ్వడా
పవినయుడున్ ముముక్షువగు
సజ్జనుడున్ ధనవంతుడే సుమీ.

తె. సూ.

## ఆర్యభటీయ వ్యాఖ్య

జ్యోతిశ్శాస్త్ర గ్రంథము. రచయిత : శ్రీ కోటి కలపూడి కోదండరామకవి. సంపాదకులు : శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రి; ప్రచురణ : ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారము, మద్రాసు. మూల్యం రు : 3-12-0

భారతీయ జ్యోతిశ్శాస్త్ర గ్రంథాలలో పరమ ప్రామాణికమైన ఆర్యభటీయానికి ఇది విపులాంధ్ర వ్యాఖ్య. క్రీస్తుశకము ఐదవ శతాబ్దాంతమున రచింపబడినట్లు ఊహింపబడుతూన్న ఈ జ్యోతిశ్శాస్త్ర కల్పకమునకు, తదాదివెలువడిన శ్రీ కంఠభాష్యాద్యనేక వ్యాఖ్యానములను సమన్వయము చేసి, శ్రీ కో. కో. కవి ఈ గ్రంథమును రచించారు. ఈయన గత శతాబ్దాంతమువాడు.

దశగీతికా పాదము, గణితపాదము, కాలక్రియా పాదము, గోళపాదము అను నాలుగు భాగములుగా రచితమైన ఈ గ్రంథము ఆర్యభటాచార్యుడు తత్పూర్వ గ్రంథములన్నిటిని పరిశోధించి, అందులోపాలను సవరించి, స్వకాల గ్రహగతులను సునిశితమతి శోధించి రచించిన ప్రాచీన తమ సమగ్ర గణితశాస్త్ర గ్రంథము.

శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రిగారు విశేష పరిశ్రమచేసి రచించిన ఆంధ్ర ఆంగ్ల పీఠికలు, కో. కో. కవిని స్వయముగ నెరిగియుండిన కీ. శే. శ్రీ నిడుదవోలు సుందరము పంతులుగారి పుత్రులు శ్రీ వేంకట రావుగారు చేసిన కవిపరిచయము గ్రంథ, గ్రంథకర్తృ ప్రాశస్త్యములను చాటుతున్నవి. ఈ గ్రంథముతో పాటుగ మరియేడు జ్యోతిష గ్రంథములు, ఇతర సంస్కృత గ్రంథములు, ప్రబంధములు, శతకములు మొత్తము 66 గ్రంథములు రచించినట్లు శ్రీ ని. వేంకట రావుగారు తెలుపుతున్నారు. కాని, ఇందులో ఎన్ని ఇప్పుడు లభించుచున్నది, ఎన్ని వెలుగుముఖము చూచినదిమాత్రం ఏలనో వారు తెలుపలేదు.

ఒకే లిఖితప్రతిపైన ఆధారపడి, ముద్రించిన ఈ గ్రంథములో, ఆ ప్రతిలోని దశగీతిక యందుగల లేఖకదోషములకు అడపదడప పంటిక్రిందబడు ముద్రణాపాషాణలేశములు తోడవుతున్నవి.

మొత్తముమీద, ఈ గ్రంథము "జ్యోతిశ్శాస్త్రాభిలాషులకు ఆరాధ్య" మనుట అటుంచి, ఆధునిక ఖగోళశాస్త్రములోను సంఖ్యాబీజ రేఖాగణితశాస్త్రాలలోను తెలుగున పాఠ్యగ్రంథాలు తయారుచేస్తూన్నవారంతా అవశ్యం పఠింపవగినది. ఆయా శాస్త్రాల పారిభాషిక పదాలను తెనుగుచేయుటలో వారు పడే నవశబ్ద ప్రసవవేదనను ఈ గ్రంథం చాలావరకు నివారింపగలదు.

అయితే, ముందుగా అటువారీ గ్రంథాన్ని భారతీయ జ్యోతిశ్శాస్త్రమును సంప్రదాయ సిద్ధముగ అభ్యసించిన పండితులయొద్ద తెలిసికొనడం అవసరం. ఈ పారిభాషిక పదసముదాయం భారతదేశమందలి జ్యోతిష పండితులందరికి పరిచితమైనది గనుక, భారతీయ భాష లన్నింటిలోను ఉపయోగించవచ్చును.

ఇందలి తెనుగురచనకు మచ్చుతునక :

"సమభూమియందు ఒకచోటను శంకువుమోపి మనత పెట్టిన త్రాటియొక్క రెండుకొనలను ఒకబలపము నకుకట్టి బిగించి గిరగిరచుట్టూ త్రిప్పగాను వృత్తమగును. సమానములయిన ఉభయకర్ణములును అగ్రమందు సంపాతమయ్యేటట్లుగా తీసినచో త్రిభుజక్షేత్రమగును. తనచేత తీయబడ్డ ఉభయకర్ణములకును మధ్యభాగమందు సంపాతమయ్యేటట్లుగా ఉండిన చతుర్భుజక్షేత్రమగును. నీటిమట్టముకట్టి అగ్రబద్ధమయిన గుగ్గుద్రవ్యముకల నీటిమట్టపుత్రాడు మధ్యభాగమందు నుండునట్లుగాను కొలిచిన క్షేత్రము సమభూమిఅగును. లేదా ఉదకము పల్లమునుండి అయినా సమభూమి సాధించుకోవలసినది." (గణితపాదము పుట : 45)

పిం. గు.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**